శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ పరాశర భట్టరనుగ్రహించిన

# శ్రీ గుణరత్నకోశము

## జ్యోతిష్మతీవ్యాఖ్యాసమేతము



శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీరామచంద్ర

రామానుజ జీయరు స్వామి వారి

మంగళాశాసనములతో



శ్రియై నమః

శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః

శ్రీ పరాశర భట్టరనుగ్రహించిన

# శ్రీగుణరత్న కోశము

## జ్యోతిష్మతీ వ్యాఖ్యాసమేతము

(సంస్కృత వ్యాఖ్యతో సహా)

వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**

ప్రచురణ

**తిరుమల చారిటబుల్ ట్రస్టు**

హైదరాబాద్, తెలంగాణ

శ్రీ పరాశర భట్టర్ అనుగ్రహించిన

**శ్రీ గుణరత్న కోశము** (జ్యోతిష్మతీ వ్యాఖ్యాసమేతము-సంస్కృత వ్యాఖ్యతో సహా)


| | | |
|---|---|---|
| వ్యాఖ్యాత | : | **శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు**<br>c/o. **డా॥ కె.వి. రమణాచార్యులు** ఐ.ఏ.ఎస్. (రి)<br>ప్రభుత్వసలహాదారు, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం<br>సి-501, నఫీజ్ రెసిడెన్సీ, ఏ.సి. గార్డ్స్<br>హైదరాబాద్- 500 028. ఫోన్: 040-2330 6899 |
| కాపీరైట్ | : | సర్వహక్కులు గ్రంథకర్తవి |
| ప్రథమ ముద్రణ | : | మన్మథ, చైత్రం-2015<br>మహాలక్ష్మీయాగం-తిరుపతి |
| ప్రతులు | : | 500 |
| మూల్యము | : | ₹100/- |
| ప్రాప్తిస్థానము | : | **శ్రీ మాలోల గ్రంథమాల**<br>శ్రీ అహోబిల మఠము, 2-2-20/28. డి.డి. కాలనీ,<br>హైదరాబాద్-500 013 |
| ముద్రణ సహకారం | : | **"పుస్తకశిల్పి" తాళ్లపల్లి మురళీధర గౌడు**<br>సెల్: 9393 176 552 |
| ముఖచిత్ర రూపకల్పన | : | **టి. మల్లేశ్** |
| అక్షరాలంకరణ | : | **కె.బి.టి. కొండయ్య** |
| ప్రచురణ | : | **తిరుమల చారిటబుల్ ట్రస్టు**<br>హైదరాబాద్, తెలంగాణ |
| ముద్రణ | : | **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**<br>విద్యానగర్, హైదరాబాద్-500 044<br>ఫోన్ : 040-2761 8261 |


ఆత్మీయులు సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ఈ గ్రంథం ముద్రింపబడింది.
శ్రీశ్రియఃపతులు వారిని కటాక్షింతురు గాక.

శ్రియై నమః
శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః
శ్రీ పరాశర భట్టరనుగ్రహించిన

# శ్రీగుణరత్న కోశము

## జ్యోతిష్మతీ వ్యాఖ్యాసమేతము

*శ్రీ పరాశర భట్టార్యః శ్రీరంగేశ పురోహితః।*
*శ్రీవత్సాంక సుతః శ్రీమాన్ శ్రేయసేమేఽస్తు భూయసే॥*

**అర్థం:** శ్రీవత్సాంకసుతః= శ్రీవత్సం సంజ్ఞగా కలిగిన కూరత్తాళ్వాన్ యొక్క పుత్రులును; శ్రీరంగేశ పురోహితః= శ్రీరంగనాథ దివ్యక్షేత్రానికి సర్వదా హితమొనర్చు వారును; శ్రీమాన్= సంపద కలవారునైన; శ్రీపరాశర భట్టార్యః= పూజ్యులైన శ్రీపరాశర భట్టర్ వారు; మే= నాకు; భూయసే= అధికమైన; శ్రేయసే= ఇహపరాభ్యుదయం కోసం; అస్తు= ఉందురు గాక.

**తా॥** శ్రీ కూరేశుల కుమారులైనట్టి, శ్రీరంగనాథాలయ పురోహితులైనట్టి, సంపన్నులైన శ్రీపరాశర భట్టర్ అనబడే ఆచార్యులు నాకు ఐహికాముష్మిక సుఖాన్ని చేకూర్తురు గాక.

**వివరణం:**

1) కూరం అనే అగ్రహారానికి అధిపతులు కూరత్తాళ్వాన్. వీరు సకల వేద వేదాంత శాస్త్రజ్ఞులే కాక గొప్ప ఐశ్వర్యం కలవారు. నిరతాన్నదాతలు. వీరు తమ సర్వస్వాన్ని దానం చేసి శ్రీరంగ క్షేత్రమందు భగవద్రామానుజులకు అంతరంగ శిష్యులై భిక్షాటనంతో కాలం గడిపినారు.

శిష్యలక్షణం సంపూర్ణంగా కలవారు. వీరి ధర్మపత్ని ఆండాళమ్మగారు. ఈ పుణ్యదంపతులకు శ్రీరంగనాథుని ప్రసాద మహిమవల్ల ఇద్దఱు కవల పిల్లలు జన్మించారు. పెద్దవారి పేరు 'పరాశర భట్టరు'. చిన్నవారి పేరు 'వ్యాసభట్టర్'. రామానుజ దర్శన స్థాపనం కోసం తమ నేత్రాలను బలిదానం చేసిన చారిత్రక పురుషులు శ్రీకూరేశులు. విష్ణుమూర్తి యెదలో పుట్టుమచ్చయైన శ్రీవత్సం యొక్క అంశచేత అవతరించినందువల్ల శ్రీవత్సాంకులు, శ్రీవత్స చిహ్నామిశ్రులు అనే ప్రసిద్ధమైన పేర్లతో వీరు వ్యవహరింపబడినారు.

2) శ్రీమన్నారాయణుడు, చతుర్ముఖ బ్రహ్మకు నిత్యం ఆరాధించుకోవడానికి ఇచ్చిన మొట్టమొదటి అర్చామూర్తియే శ్రీరంగనాథుడు. తర్వాత ఇక్ష్వాకు మహారాజు తపస్సు చేసినందున భగవదాజ్ఞననుసరించి బ్రహ్మదేవుడు ఆ మూర్తిని అయోధ్యాధిపతికి సమర్పించాడు. ఇక్ష్వాకువంశమందు అవతరించిన శ్రీరాముడు తన పట్టాభిషేకానంతరం తన కులదైవమైన శ్రీరంగనాథ విగ్రహాన్ని భక్తుడైన విభీషణునికి సమర్పించాడు. విభీషణుడు లంకానగరానికి పోతుండగా సాయం సంధ్యావందన మాచరించడానికి ఆ మూర్తిని కావేరీ నదీ ద్వీపమందు ఉంచినాడు. తర్వాత ఆ మూర్తి ఆ ద్వీపమందే నివసింపదలచి అక్కడనే నిలిచినాడు. ఆ దివ్యక్షేత్రమే శ్రీరంగం.

"పెణ్ణాళన్ పేణుమూర్ పేరు మరంగమే"- (నాచ్చితి.మొ. 11-9)

'అరంగం' అంటే 'పెరియ పిరాట్టియార్క్కు నృత్తస్థానమ్'. శ్రీరంగనాయకి యొక్క నృత్తరంగమని పెరియవాచ్చాన్ పిళ్ళై తెల్పినారు. అరంగ శబ్దానికి ద్రావిడ భాషలో 'శ్రీరంగ ద్వీపం' అని (మఱొక) అర్థం. ఉభయ కావేరీ మధ్యదేశమందు శ్రీరంగనాథస్వామి బ్రహ్మాది దేవతలచే ప్రతిష్ఠింపబడి, ఆరాధింపబడినందున (ఈప్టే) శ్రీరంగేశ నామం ప్రసిద్ధమని ఐతిహ్యం.

శ్రీవత్సాంకుల పుత్రరత్నమైన 'శ్రీపరాశర భట్టర్'ను బాల్యమందే తమ దత్తపుత్రునిగా స్వీకరించారని గురుపరంపరా ప్రభావాది గ్రంథాలవల్ల

తెలుస్తున్నది. శ్రీమద్రామానుజులవారి కటాక్ష పాత్రులైన పరాశర భట్టరును పూర్వాచార్యులు శ్రీరంగనాయకీ మానస పుత్రుడని ప్రేమతో పిలిచేవారట.

(పురః హితం కరోతీతి= పురోహితః. శ్రీశ్చరంగేశశ్చ= శ్రీరంగేశౌ; తయోః = శ్రీరంగేశ పురోహితః.)

పరాశర భట్టర్ వారు ఆచార్య పీఠాన్ని అధిష్ఠించిన తర్వాత శ్రీరంగనాథాలయాన అధ్యయనోత్సవ బ్రహ్మోత్సవాదులకు నిర్వాహకులై శ్రీరంగనాథుని వైభవానికి ప్రసిద్ధిని కల్పించినందున 'శ్రీరంగేశపురోహితులు' అని వ్యవహరింప బడినారు.

3) 'శ్రీమాన్' అంటె వైష్ణవశ్రీ కలవాడు అని అర్థం. ఉత్తమ వంశమందు జన్మించడం, ఆచార్య కటాక్ష పాత్రుడవడం, భాగవతార్చన, భగవత్కైంకర్యాన్ని యావజ్జీవం నిర్వహించడమే శ్రీ వైష్ణవ లక్షణ సంపద. ఆ సంపదను కల శ్రీపరాశర భట్టరు 'శ్రీమాన్' అని నిర్దేశింపబడినారు.

4) శ్రీ పరాశర భట్టార్యం– 'శ్రీ పరాశరమహర్షి' యొక్క స్మృత్యర్థం, నామకరణం చేయబడింది. భట్ట, భట్టారక శబ్దాలు సకల వేదశాస్త్రాలను అధ్యయనం చేసి, నిత్య కర్మానుష్ఠానపరులైన మహనీయులనే అర్థాన్ని బోధించడం గమనీయం.

'ఆర్యః'– అతత్త్వేభ్యః ఆరాత్ దూరం యాతి బుద్ధిః యస్యసః= ఆర్యః. తత్త్వంలేని విషయాలకు దూరంగా ఉండే బుద్ధికలవాడు ఆర్యుడు. లేదా, తత్త్వేభ్యః ఆరాత్ సమీపేయాతి బుద్ధిః యస్యసః= ఆర్యః. తత్త్వమున్న విషయాలకోసం దగ్గరగా ఆలోచించే మహనీయుడు ఆర్యుడు.

"ఆరాత్ దూరసమీపయోః"– (అమరం) 'ఆరాత్' అనే అవ్యయం, దూరమందు, సమీపమందు (రెండు) అర్థాలు కలది. ఇక్కడ, పరాశర భట్టరు వారు, ఆర్య శబ్దానికి గల రెండు వ్యుత్పత్తులవల్ల, సంశయ విపర్యాది దోషాలు లేని జ్ఞానాన్ని, నిర్దుష్టమైన ఆచరణాన్ని కలవారని తెల్పబడుతున్నది.

5) 'శ్రీగుణరత్నకోశం' అనే స్తోత్రాన్ని రచించిన శ్రీ పరాశర భట్టర్‌ను స్తుతించే శ్లోకమిది. ముక్తక రూపంగా స్తుతింపబడే శ్లోకానికి సంప్రదాయమందు 'తనియన్' అని పేరు. అంటే, గ్రంథస్థ విషయంకంటె వేరైనదని భావం.

'పరాశర' శబ్దం శత్రువులను ఓడించువాడనే అర్థాన్ని తెల్పుతుంది. కర్ణాటక ప్రాంతమందు మాధవ సూరియనే ఉద్దండ పండితుడుండెను. అతడు షడ్దర్శన పారంగతుడు కాబట్టి, అందుకు గుర్తుగా ఆఱు కాళ్ళ సింహాసనమందు కూర్చొని, గర్వంతో ప్రతివాదులను ధిక్కరించేవాడు. అద్వైత సిద్ధాంతమందు ప్రఖ్యాతి వహించి 'వేదాంతి' అనే పేరుతో ప్రసిద్ధిని పొందినవాడు. పరాశర భట్టరు 'వేదాంతి' దగ్గరికిపోయి, వాద (దాన) భిక్షను కోరి తొమ్మిది దినాలు శాస్త్రార్థచర్చ చేశారు. పదవరోజున వేదాంతిని జయించారు. వేదాంతి ఒప్పందం ప్రకారం, పరాశర భట్టరు పాదాల నాశ్రయించాడు. పంచ సంస్కారాలను పొంది, వైష్ణవోత్తము డయ్యాడు. తర్వాత విరక్తుడైన ఆ వేదాంతి సన్యాసాశ్రమాన్ని స్వీకరించాడు. ముఖ్య శిష్యుడైన 'వేదాంతి'ని ఆచార్యులైన శ్రీ పరాశర భట్టర్ 'నంజీయర్' (మనకు ప్రీతి పాత్రులైన సన్యాసులు) అనే పేరుతో పిలిచేవారు. నంజీయర్ వైష్ణవాచార్యులలో ప్రముఖులై విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారాన్ని సాగించారు. ద్రవిడ వేదాన్త ప్రవర్తకాచార్యుల పరంపరలో ముఖ్యులుగా పరిగణింపబడినారు. షడ్దర్శన సార్వభౌములైన 'నంజీయరే' "గురుం ప్రకాశయేత్ ధీమాన్" అన్నట్లు తనను వైష్ణవోత్తమునిగా మలచి, తత్త్వ త్రయార్థాలను ఉపదేశించిన శ్రీపరాశర భట్టరు వారిని (స్వాచార్యులను) గూర్చి, ఈ 'తనియ'ను రచించి సుశ్లోకించారు– వారి కీర్తిని ప్రకాశింపజేశారు.

సదాచార్యులను ఆశ్రయించినందువల్ల శ్రేయస్సు కలుగుతుంది అనే దృఢమైన అధ్యవసాయం సూచితం.

1. *శ్రియై సమస్త చిదచిద్విధాన వ్యసనం హరేః।*
*అంగీకారిభిరాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః॥*

**అర్థం:** హరేః= విష్ణుమూర్తి యొక్క; సమస్త చిత్+అచిత్, విధాన వ్యసనం= సమస్త చేతనాచేతన వస్తువులను సృజించడం, రక్షించడం, లయంచేయడం అనే పద్ధతియందున్న దీక్షను; అంగీకారిభిః= ఆమోదించునట్టి; ఆలోకైః= చూపులతో; సార్థయంత్యై= సఫలంచేస్తున్నట్టి; శ్రియై= లక్ష్మీదేవి కొరకు; అంజలిః= దోసిలొగ్గి నమస్కారం; కృతః= చేయబడినది.

**తా॥** శ్రీహరికి సృష్టి స్థితి లయాత్మకాలైన కార్యాలయందున్న పట్టుదలను తన చూపులతోనే అంగీకరించి సార్థక పరచునట్టి లక్ష్మీదేవికి నమస్కరిస్తున్నాను.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవియొక్క కటాక్షంచేత శ్రీహరి కృతకృత్యుడవుతాడనే మంగళా చరణ శ్లోకమిది.

ప్రతిభామూర్తులైన శ్రీపరాశరభట్టర్ వారు శ్రీదేవిని స్తుతించిన ఈ స్తోత్రానికి 'శ్రీగుణరత్న కోశం' అని పేరు పెట్టినారు. 'స్తుతి' అంటే, గుణి నిష్ఠ గుణాభిధానమ్. 'స్తోత్రం' అంటే, సమ్యక్ తత్త్వగుణాభివర్ణనమ్.

శ్రీదేవి వైభవం అనంతమైనది. మహిమ అమేయమైనది. ఈ స్తోత్రనామం ఏడు అక్షరాలు కలది. ఈ సోత్రమందున్న శ్లోకాల సంఖ్య (61) అరవై యొకటి. ఇది కూడా (6+1) సప్త సంఖ్యనే తెల్పుతున్నది. కాబట్టి, సప్తప్రాకారాల మధ్యన తామరమొగ్గ వికసిస్తున్నట్లు భాసించే విమానమందు వెలసియున్న శ్రీరంగనాథుని పట్టమహిషియైన శ్రీరంగనాయకి యొక్క సమస్త కల్యాణ గుణాలు అనర్ఘ రత్నాలే. ఆ గుణరత్నాలను భద్రపరచి యుంచిన పేటికయే ఈ స్తోత్రం.

హరేః:- శ్రియం ఆహరతి ఇతి= హరిః. శ్రీదేవి యొక్క మనస్సును ఆకర్షించిన వాడు హరి.

*"పశ్యతాం సర్వదేవానాం యయౌవక్షః స్థలంహరేః"* (వి.పు. 1.9.105) దేవతలందఱు చూస్తుండగా శ్రీదేవి విష్ణువు యొక్క వక్షః పీఠంపైన అధివసించినది.

"మందిరమిందిరాయాః"- (వైకుంఠస్తవం) లావణ్య జలధియైన విష్ణువు యొక్క వక్షఃస్థలమే 'ఇందిరామందిరం' అన్నారు శ్రీ కూరేశులు. హృదియెదలో వెలసియున్న శ్రీదేవి, "పతిని విడిచి క్షణమైన నుండలేను"- "అకల కిల్లేనిత్తైయు మెన్ఱు"- (తి.వా.మొ.) అని ప్రకటించింది.

"భగవద్దక్షిణేపార్శ్వే శ్రియం దేవీ మవస్థితామ్"- శ్రీదేవి వైకుంఠుని వక్షః స్థలంలో కుడిప్రక్కన వెలసియున్నది.

"వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్గిన్ఱ మంగైయుమ్"- అని పెరియాళ్వార్లు, శ్రియఃపతి యొక్క యెదలో కుడివైపున సుఖంగా నివసించిన యువతికి 'పల్లాండు'ను పాడినారు.

హరతి ఇతి హరిః:- బ్రహ్మాండాన్ని హరించువాడు 'హరి'. చరాచర జగత్తును తన కుక్షిలో భద్రంగా నిక్షేపించుకొనువాడు 'హరిః'.

"హరిం ప్రహరంత మనుయంతిదేవాః"- దేవతలు హరిని అనుసరిస్తుంటారు- అనే శ్రుతి, ఇంక,

"బ్రహ్మాణమీశం రుద్రంచ యమం వరుణమేవచ।
ప్రసహ్యాహరతే యస్మాత్ తస్మాద్ధరి రివోచ్యతే॥"

అని స్మృతియు, బ్రహ్మరుద్రేంద్రాది సమస్త దేవతలను తన అధీనమం దుంచుకొని, వారికంటె అధికుడుగా ఉండేవాడు. బ్రహ్మరుద్రేంద్ర యమవరుణాది దేవతలు తాము స్వతంత్ర ప్రభువులమని భావిస్తుంటారు. కాని ఆ దేవతలందఱినీ ప్రళయంలో హరించి తాను ఒక్కడే "దేవ ఏకో నారాయణః"- "న బ్రహ్మో నేశానః" అని శ్రుతులు బోధిస్తున్నట్లు- మిగిలియుండేవాడు 'హరి' అనే అర్థం విశదీకృతం.

"హరిర్హరతి పాపాని దుష్టచిత్తై రపిస్మృతః।
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హిపావకః॥"

మనకు ఇష్టమున్నా, లేకున్నా అగ్గిని ముట్టుకొన్నప్పుడు అది కాల్చి వేయునట్లే, దుష్టజనులు కూడా 'హరి, హరి' యని రెండక్షరాలను పలికినట్లైతేవారి పాపాలను బుగ్గి చేసేవాడు. ఇష్టముండి హరి నామాన్ని సంకీర్తించిన వ్యక్తుల సర్వపాపాలను హరించి- ధ్వంసం చేసి, వారికి భుక్తిని, భక్తిని, ముక్తినీ ప్రసాదించే వాడు 'హరి'.

సమస్త చిదచిద్విధాన వ్యసనం:- 'చిత్' శబ్దం జీవరాశిని (ప్రాణులను) తెల్పుతుంది. 'అచిత్' జడ ప్రకృతిని తెల్పుతుంది. (వీటిని తన సంకల్పంచేత) విధానం= చేయబడే ప్రకారాన్ని తెల్పుతుంది. వ్యసనం= దేనిమీదనైనను మనస్సు తగుల్కొనియుండడం. శ్రద్ధ, దీక్ష, పట్టుదల అనే అర్థం.

'సమస్త' శబ్దం, చీమ మొదల్కొని సత్యసీమాధి పతియైన బ్రహ్మదేవుని వరకు ఉండే జీవులకు (ప్రాణులకు) కరణకళేబరాది నిర్మాణ ప్రక్రియనూ, అట్లే జడ ప్రకృతిని ఇరవైనాల్గు (24) తత్వాలు కలదిగా ఏర్పరచడాన్ని తెల్పుతుంది.

చేతనాచేతనాల విషయమై సృష్టి స్థితి లయాత్మకమైన కార్యాలను చేయడమందే బహుశ్రద్ధ కలవాడు హరి.

ఉపహరతి విశ్వం ఇతి= హరిః. శ్రీదేవియొుక్క విలాసం కోసమే ప్రపంచాన్ని సృజించడం భగవానునికి గల వ్యసనం. అందువల్ల, తాను సృజించిన జగత్తును శ్రీదేవికి ప్రియమైన కానుకగా- ఉపహారంగా సమర్పించేవాడు 'హరి'.

భగవానుడు తాను లయంచేసిన- తన బొజ్జలో భద్రపరచుకొన్న- చేతనా చేతనరూపమైన జగత్తును ప్రళయకాలాంతమందు ఉత్పత్తి చేయాలనే దయ కలవాడై సంకల్పించుకొంటాడు. ఆయా జీవ పదార్థాలకు అవి పూర్వం చేసిన కర్మలకు తగిన ఫలాన్ని అనుభవించే రూపాలను మనస్సులో చిత్రించుకొన్న ప్రకారంగా సృజిస్తాడు. సృజింపబడిన జడ జీవ వస్తువులు దేశకాలాలకు అనుగుణంగా మారుతూ పెరిగి పెద్దవై లోకాలకు ఉపయోగపడే రీతిగా చేసే వ్యసనం శ్రీహరికే ఉంది.

"న హి పాలన సామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్"- ఈ వ్యసనం ఎంతో శ్రమ-ప్రయాస-తో కూడియున్నదే, అయినా, సర్వేశ్వరునికి జగత్తును సృజించడం, రక్షించడం అనే ప్రక్రియ ఒక లీల- వినోదక్రీడగా ఉంటుందని మహర్షులు చెప్పిన మాట. "ఇన్బుఱు మివ్విళై యాట్టుడైయాన్"- (ఆళ్వార్ శ్రీసూక్తి.) 'ఇంటికి దీపం ఇల్లాలు'- అనే నానుడి ధర్మపత్ని యొక్క ప్రవర్తనను సమర్థిస్తుంది.

"హరిణీ ప్రేక్షణాయత్ర గృహిణీన విలోక్యతే।
సేవితం సర్వసంపద్భి రపి తద్భవనం వనమ్॥"

సకల సంపదలతో కళకళలాడే భవనంలోనైనా, తళతళలాడే లేడి చూపులవంటి చూపులుగల గృహిణి కనబడకుంటే ఆ భవనం వనంతో సమానం- అడవే కదా!

"నగృహంగృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే"- గృహమున్నంత మాత్రాన గృహమనబడదు. గృహిణియే గృహం-అని గృహిణియొక్క ప్రాముఖ్యం చెప్పబడింది. జగత్పితయైన శ్రియఃపతియొక్క కార్యవిధానం జగన్మాతయైన శ్రీదేవి యొక్క ముఖోల్లాసానికే హేతువు కాబట్టి, శ్రీదేవి ఆ విధాన వ్యసనాన్ని కడగంటి చూపులతో చూస్తుంది. "ఆ ఓరచూపులు, తన పెనిమిటి సృష్టిస్థితి కార్యాలయందు ఎంతో శ్రద్ధ వహిస్తున్నాడు. ఇది అనన్యార్హమైన విధానం. ఎంతో బాగున్నది"- అనే భావాన్ని ప్రసరింపజేస్తున్నాయి. శ్రీదేవియొక్క అంగీకారాన్ని-ఆమోదాన్ని తెల్పుతున్న ఆమె చూపులు ప్రసరించగానే శ్రియఃపతి యొక్క శ్రమ-అలసట దూరమై, శ్రియఃపతియొక్క సృష్టి స్థితి కార్యాలు సఫలమవునట్లు చేయబడుతున్నాయి.

సార్థయంత్యై శ్రియై అంజలిః కృతః:- "మాతృదేవో భవ"- అనే శ్రుతి పల్కిన రీతిగా, శ్రియఃపతిని కృతకృత్యునిగా జేసే గుణాధికత గల్గి, శుభాశ్రయమైన శ్రీదేవికి అంజలి ఒసగబడినది.

"అంజలిః పరమాముద్రా క్షిప్రం దేవప్రసాదినీ"- (పాద్మసంహిత) దేహేంద్రి యాలను ఏకాగ్రంగా ముకుళితం చేసి త్రికరణశుద్ధిగా నమస్కరింపదగిన ముద్ర అంజలి. ఇది ఇష్టదేవతానుగ్రహాన్ని త్వరగా పొందునట్లు చేస్తుంది.

ఆరు వ్యుత్పత్త్యర్థాలు కలది శ్రీ శబ్దం.

శ్లో॥ *శ్రితాస్యన్యైః సర్వైః శ్రయసి రమణం సంశ్రిత గిరః*
*శృణోషి ప్రేయాంసం శ్రితజన వచః శ్రావయసిచ।*
*శృణాస్యేతద్దోషాన్ జనని! నిఖిలాన్ సర్వజగతీం*
*గుణైః శ్రీణాసిత్వం, తదిహ భవతీం శ్రీరితి విదుః॥*

1) అందరిచే ఆశ్రయింపబడుతుంది. 2) ప్రియుడైన విష్ణువును ఆశ్రయిస్తుంది. 3) ఆశ్రితుల మాటలను వింటుంది. 4) ఆర్తుల కష్టాలను భర్తకు విన్నవిస్తుంది. 5) ఆశ్రితుల దోషాలను పోగొట్టుతుంది. 6) తన గుణాలచేత ప్రపంచాన్ని ఆశ్రయించి ఉంటుంది. శ్రీశ్రియః పతులకు జగద్వ్యాపారమందున్న ఐకరస్యం అగ్గలంగా ఉగ్గడింపబడినది.

ఈ స్తోత్రారంభ శ్లోకమందు మొదట రోగఫలకమైన జగణం ప్రయోగింపబడింది.

*"దేవతావాచకాః శబ్దాః యేచ భద్రాది వాచకాః।*
*తే సర్వేనైవ నింద్యాః స్యుః లిపితో గణతో௨పివా॥"*

అన్న రీతిగా, స్తోత్రారంభమందు మంగళారంభ సంభవం కోసం దేవతా వాచకమైన శ్రీశబ్దాన్ని ప్రయోగించడం వల్ల జగణ ప్రయోగదోషం నివారింపబడింది. అనుష్టుప్ ఛందస్సు.

*2.* *ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ*
*నిర్వాహ కోరకిత నేమకటాక్ష లీలామ్।*
*శ్రీరంగ హర్మ్య తల మంగళ దీపరేఖాం*
*శ్రీరంగరాజ మహిషీం శ్రియమాశ్రయామః॥*

**అర్థం:** ఉల్లాస పల్లవిత– లీలామ్/ ఉల్లాస= ఉదయం– సృష్టివలన; పల్లవిత= తీగచ చిగురించినట్లు; పాలిత= పాలింపబడిన; సప్తలోకీ= ఏడు లోకాలయొక్క;

నిర్వాహ= నిర్వహణ-స్థితి-రక్షణ- వలన; కోరకిత= మొగ్గ తొడిగినట్లు ఉన్నట్టి; నేమ= సగమైన; కటాక్ష లీలాం= కడగంటిచూపుల విలాసాలు కల్గినట్టి; శ్రీరంగ హర్మ్యతల మంగళ దీపరేఖాం= శ్రీరంగమందిరమందు మంగళ ప్రదమైన దీపకళిక యైనట్టి; శ్రీరంగరాజ మహిషీం= శ్రీరంగరాజు యొక్క పట్టమహిషియైన; శ్రియం= శ్రీదేవిని; అశ్రయామః= అశ్రయిస్తున్నాం.

**తా॥** సమస్త లోకాల సృష్టిచేత చిగురు తొడిగినట్లు, స్థితి వలన మొగ్గవేసినట్లు సగమేయున్న కటాక్ష విలాసాలు కల్గినట్టి, శ్రీరంగభవనమందు మంగళప్రదమై వెలిగే దీపరేఖయైనట్టి, శ్రీరంగరాజుకు పట్టమహిషియైన లక్ష్మీదేవిని అశ్రయిస్తున్నాము.

**వ్యాఖ్య:** మొదటి శ్లోకంలో చెప్పిన లక్ష్మీదేవియొక్క చూపులను విశేషంగా వర్ణిస్తూ, ఆమె పురుషకారిణిగా సుశ్లోకితం.

శ్రియఃపతి ఇష్టపడి నిలిచిన దివ్యక్షేత్రం శ్రీరంగం.

*"క్షీరాబ్ధే ర్మండలాద్భానో ర్యోగినాం హృదయాదపి।*
*రతింగతః సదాయత్ర తద్రంగం మునయోవిదుః॥"*

క్షీర సముద్రంకంటె, సూర్యమండలంకంటె, యోగుల హృదయంకంటెను శ్రీరంగం విలక్షణమైనది. అది శ్రీదేవికి నృత్త స్థానం. విష్ణుమూర్తికి భూనీళాది పత్నులెందరున్నా, లక్ష్మీదేవియే పట్టపురాణి. "కృతాభిషేకామహిషీ"- (అమరం) "అనంత నామధేయాచ శక్తి చక్రస్యనాయికా"- (బ్రహ్మాండ పురాణం) దేవీగణమైన శక్తిమండలానికి నాయకురాలైన లక్ష్మీదేవి అనేక నామాలతో కీర్తింపబడుతున్నది.

శ్రీరంగరాజు చేసే సృష్టిస్థితులవల్ల ఆయన పట్టమహిషియైన లక్ష్మియొక్క కటాక్ష లీల తీగరూపంగా శోభిస్తున్నది. తననాశ్రయించిన తీగ చేత తరువు ప్రకృతి రంజకంగా ఉంటుంది. తీగ ఏపుగా ఎదుగుతుంది. ఇది అన్యోన్య రాసిక్యం, రంజకం.

సప్తలోకాలు అనడంవల్ల భూలోకం తన క్రింది ఏడు లోకాలకు ఉపలక్షణం. భూలోకం, భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం అనే ఏడు ఊర్ధ్వలోకాలు సూచింపబడినవి. సమస్తలోకాలు- చతుర్దశ (14) భువనాలు అనే అర్థం గమనీయం.

లక్ష్మీకటాక్ష లీలచేతనే సృష్టి స్థితులు జరుగుతున్నాయి. సమస్తలోకాలు ఉల్లసిల్లంగానే- సృజింపబడగానే- చిగురుటాకులు పొటమరించినట్లు లక్ష్మీదేవి యొక్క చూపులు రాగరంజితమైనాయి. ఆ లోకాలను రక్షించేకార్య నిర్వహణవల్ల, మొగ్గలు తొడిగి సగం వికసించినట్లు చూపులు విలసిల్లుతున్నాయి. లక్ష్మీకటాక్ష లీల ప్రకృతి వికాసాన్ని సాక్షాత్కరింప జేస్తున్నది. "నేమ ఇత్యర్థే"- నేమ శబ్దం సగం అనే అర్థం కలది- (సిద్ధాంత కౌముది). సృష్టికంటె స్థితి- పాలన వల్ల కలిగిన సంతోషం లక్ష్మీదేవికి అధికమయిందని సూచితం.

శ్రీరంగహర్మ్యతల మంగళ దీపరేఖాం:- శ్రీరంగధామమందు దివ్యంగా వెలుగుతున్న మంగళదీప కళిక శ్రీదేవి. ఇతర వస్తువులను చూపడానికి దీపం అవసరం. కాని, దీపాన్ని చూపడానికి వేరొక వస్తువు అక్కరలేదు కదా! అట్లే భగవంతుణ్ని ఆశ్రయించడానికి లక్ష్మీపురుషకారం- సహాయం- ఆవశ్యకం. కాని లక్ష్మీదేవిని ఆశ్రయించడానికి మరొకరి సహాయం అవసరం లేదు. కావున, శ్రేయోమూర్తియైన శ్రీదేవిని ఆశ్రయిస్తున్నాము.

కవి ఒక్కడే స్తోత్రం చేసిననూ, భక్తజనాన్ని కల్పుకొని 'ఆశ్రయామః' అని బహువచనాన్ని ప్రయోగించడం ఔదార్యం.

ఉత్పత్తి స్థితులను లక్ష్మీదేవియొక్క అర్ధకటాక్ష లీలా పల్లవ కోరకత్వంగా వర్ణించడంవల్ల సావయవరూపకాలంకారం. 'మంగళదీపరేఖ' అనడంవల్ల నిరవయవరూపకాలంకారం. కాబట్టి ఇందు రెండు రూపకాల సంసృష్టి కలదు.

వసంత తిలకా వృత్తం. 'త భ జ జ' గణాలు, రెండు గురువులు కలది., "ఉక్తావసంత తిలకా త భ జా జగౌ గః".

3. అనుకల తనుకాండా లింగానారంభ శుంభత్
ప్రతి దిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధిః।
స్తన నయన గుళుచ్ఛస్ఫార పుష్ప ద్విరేఫా
రచయతు మయిలక్ష్మీ కల్పవల్లీ కటాక్షాన్॥

**అర్థం:** అనుకలతనుకాండ-శ్రీసఖానోకహర్ధిః/ అనుకల= ప్రతిక్షణం; తనుకాండ= కాండం వంటి శరీరాన్ని; ఆలింగన+ఆరంభ= కౌగలించే ప్రయత్నంచేత; శుంభత్= ప్రకాశిస్తున్న; ప్రతిదిశ= అన్ని దిక్కులకు వ్యాపించిన; భుజశాఖ= కొమ్మల వంటి భుజాలుగల; శ్రీసఖ, అనోకహ= కల్పవృక్షమైన విష్ణువుయొక్క; ఋద్ధిః= ఐశ్వర్యం కలిగినదైన; స్తన నయన-ద్విరేఫా/ స్తన= స్తనాలు; నయన= నేత్రాలు అనే; గుళుచ్ఛ= గుచ్ఛాలు; స్ఫారపుష్ప= విరిసిన పూలు; ద్విరేఫా= తుమ్మెదలు కలిగినదైన; లక్ష్మీ కల్పవల్లీ= కల్పలతవంటి లక్ష్మీదేవి; మయి= నా యందు; కటాక్షాన్= దయగల చూపులను; రచయతు= ప్రసరింపజేయుగాత.

**తా॥** సర్వదా కల్పవృక్షం వంటి విష్ణుమూర్తిని ఆశ్రయించి, స్తన నయనాలు అనే పుష్పగుచ్ఛాల, వికసిత పుష్పాలయందున్న తుమ్మెదల సౌందర్యంచేత శోభించే కల్పలతతో సమానమైన లక్ష్మీదేవి స్వీయ కటాక్ష దృష్టులతో నన్ను అనుగ్రహించు గాత.

**వ్యాఖ్య:** లక్ష్మీకటాక్షం కవిచేత ప్రార్థితం.

నారాయణుడు కల్పవృక్షంతోనూ, లక్ష్మీదేవి కల్పలతతో పోల్చబడినారు.

"*నిరాశ్రయా నశోభంతే పండితావనితాలతాః*"- పండితులు, స్త్రీలు, తీగలు ఆశ్రయం లేకుండా శోభించవు. నారాయణుని శరీరం చెట్టుకాండంవలె ఋజువుగా నున్నది. నలుదెసల వ్యాపించియున్న కల్పవృక్ష శాఖల్లాగా నారాయణుని చతుర్భుజాలు శోభిస్తున్నాయి. చెట్టును ప్రకాశింపజేసేది తీగ. వృక్షాన్ని ఆశ్రయించి, ఏపుగా ఎదిగి నాలుగు దిక్కుల వ్యాపించియున్న కొమ్మలకు శోభను కలిగిస్తూ, అల్లిబిల్లిగా అల్లుకొనబడిన ఆ వృక్షసంపద తన అధీనమై యున్నందువల్ల లతయొక్క అందంకూడా సముచితంగా పెరిగి చూడముచ్చటగా నున్నది.

లక్ష్మీదేవి నారాయణమూర్తిని ఆలింగనం చేసుకొన్నందువల్ల ఆయన ఆనందంతో స్తబ్ధుడయ్యాడు. "వృక్ష ఇవ స్తబ్ధో దివితిష్ఠత్యేకః, తేనైవ పూర్ణం పురుషేణ సర్వం"- ఆ పరమ పదమందు నారాయణుడు ధ్రువమూర్తిగా ఒక్కడే వృక్షంలాగా ఆనందమయుడై యుంటాడు. ఆయనతోనే ఈ చరాచర ప్రపంచం నిండియున్నది- అని ఉపనిషద్వాక్యార్థం.

కల్పవృక్షంగానీ కల్పలతగానీ ఆశ్రయించినవారి కోరికలను సిద్ధింప జేయడం శాస్త్రవిదితం.

"తన్నై తన్ద కఱ్పగమ్"- కల్పతరువు కోరికలను ఇస్తుంది కాని తనను మాత్రం ఇచ్చుకోదు కదా! భగవానుడనే కల్పతరువు ఆశ్రితులకు తననే ఇచ్చుకొంటాడు- అని ఆళ్వార్ల శ్రీసూక్తి. 'విధేయాత్మా' అని (వి.స.నా.) ప్రసిద్ధి. లక్ష్మీదేవి ఆలింగనంవల్ల ప్రకాశించేది నారాయణుని ఐశ్వర్యమే- గుణసంపద అని అర్థం.

ఆత్మగుణాలు, రూపగుణాలు అని గుణాలు రెండు విధాలు. జ్ఞానశక్త్యాదులు ఆత్మగుణాలు; ఔజ్జ్వల్య, సౌందర్య, సౌగంధ్య, సౌకుమార్యాదులు రూపగుణాలు.

శ్రీసఖానోకహర్ధిః- ఈ పదంవల్ల, శ్రీదేవిచేతనే శ్రియఃపతియొక్క స్వరూప నిరూపకత్వమని తెలుస్తున్నది. 'అనోకహ' పదంచేత "వాసదేవ తరుచ్ఛాయా నాతిశీతా న ఘర్మదా!" వాసుదేవుడనే చెట్టునీడ చలిగానీ, వేడిమిగానీ ఎక్కువ ఉండనట్టిది- అని స్మృతి తెల్పుతున్నది.

ఈ సంసార మార్గంలో పయనించే బాటసారుల బడలికను దీర్చే వాసుదేవ తరుచ్ఛాయయే ఆశ్రయించడానికి యోగ్యమైనది. ఇట్టి బుద్ధి కలది లక్ష్మీదేవి. అంటే ఆమె యొక్క స్వరూపస్థితి ప్రకటితమవుతున్నది. లక్ష్మీదేవి స్వాధీన పతిక యని స్పష్టమవుతున్నది. పరస్పరానురాగం, నిత్యదాంపత్యయోగం అనురణిస్తున్నది.

వృక్షాన్ని ప్రకాశింపజేసిన లతాసౌందర్యమూ ప్రకటింపబడుతున్నది. లక్ష్మీదేవి యొక్క అవయవసౌందర్యం నాన్యత్ర దర్శనీయం. 'తనుకాండ' అన్నచోట

కల్పలత వంటి లక్ష్మి యొక్క శరీరం కాండంవలె వంకర టింకరగా లేకుండా, చక్కగా- నిటారుగా నున్నదని కూడా అర్థమవుతున్నది.

లక్ష్మి కల్పవల్లి కదా! ఆమె స్తనాలే పూలగుత్తులు. నయనాలే విరిసిన పువ్వులు. వికసిత పుష్పాలమధ్యన ఉన్న తుమ్మెదలవలె నల్లగా, నునుపుగా ఉన్న కనీనికలు- కనుగ్రుడ్లు కలది లక్ష్మీదేవి. ఇట్లు, లక్ష్మీనారాయణుల దివ్య విగ్రహ సౌందర్య దిదృక్షయే విశిష్టాద్వైత సంప్రదాయం.

*"యద్గతాగత విశ్రాంతి వైచిత్ర్యేణ వివర్తనమ్।*
*తారకాయాః కళాభిజ్ఞైః తం కటాక్షం ప్రచక్షతే॥"* (సంగీత రత్నాకరం)

ఎదలోని భావాన్ని సంతోషంగా ప్రకటించే కనుపాపను విచిత్రంగా కదలించడమే కటాక్షమని నిర్వచింపబడింది.

వాసుదేవ తరుచ్ఛాయ పాంథుల తాపాన్ని శమింపజేస్తే, లక్ష్మీకల్పవల్లీ కటాక్ష వీక్షణాలు సదా హ్లాద జనకాలు కదా! శ్లోకంలో ఉపమాలంకారం ఉన్ననూ, 'ఇవ' అనే వాచకం లేనందువల్ల, ఇందున్నది 'వాచక లుప్తోపమాలంకారం'. మాలినీవృత్తం. 'న న మ య య' అనే గణాలు ప్రతిపాదమందు కలది. 'న న మ య య', యుతేయం మాలినీ భోగిలోకైః- ఈ వృత్త లక్షణమిది.

4. *యద్భ్రూభంగాః ప్రమాణం స్థిర చర రచనా తారతమ్యే మురారేః*
*వేదాంతాస్తత్త్వ చింతాంమురభిధురసి యత్పాద చిహ్నైస్తరంతి।*
*భోగోపోద్ఘాతకేళీ చుళుకిత భగవద్వైశ్వర్యపాన్యాను భావా*
*సానః శ్రీరాస్తృణీతామ మృత లహరిధీ లంఘనీయై రపాంగైః॥*

**అర్థం:** మురారేః= విష్ణువు యొక్క; స్థిర చర రచనా తారతమ్యే= స్థావర జంగమాత్మకమైన సృష్టి యొక్క ఉచ్చనీచ భావమందు; యత్+భ్రూభంగాః= ఏ లక్ష్మియొక్క కనుబొమల కదలికలు; ప్రమాణం= ప్రమాణమో; వేదాంతాః= ఉపనిషత్తులు; తత్త్వచింతాం= పరతత్త్వ విచారాన్ని; మురభిత్+ఉరసి= విష్ణువుయొక్క

వక్షఃస్థలమందు; యత్పాద చిహ్నైః= లక్ష్మియొక్క పాదాల గుర్తులతో; తరంతి= దూరం చేసుకొన్నవో; భోగోపోద్ఘాతకేళీ- అనుభావా/ భోగ= లక్ష్మీదేవియొక్క సకల కల్యాణ గుణానుభవం యొక్క; ఉపోద్ఘాత= ఉపక్రమమనే; కేళీ= లీలచేత; చుళుకిత= చులుకనగా జేయబడిన; భగవత్= విష్ణువుయొక్క; వైశ్వరూప్య= విశ్వరూపం యొక్క అనుభావా= మహిమకలదియో; సా= అట్టి; శ్రీః= లక్ష్మీదేవి; అమృత లహరి ధీలంఘనీయైః/ అమృత లహరిధీ= అమృత ప్రవాహ బుద్ధిని; లంఘనీయైః= మించిన; కటాక్షైః= క్రీగంటి చూపులతో; నః= మనలను; ఆస్తృణీతామ్= కప్పివేయుగాక.

**తా॥** విష్ణువుయొక్క చరాచరాత్మకమైన సృష్టిలో తారతమ్యం ఉండడానికి లక్ష్మీదేవి యొక్క కనుబొమల ముడులే కారణం. హరిహర హిరణ్య గర్భులనే త్రిమూర్తులలో పరతత్త్వమెవరు? అని సందేహం కల్గినప్పుడు ఉపనిషత్తులు, ఎవని వక్షఃస్థలమందు లక్ష్మియొక్క పాదాల గుర్తులు కలవో ఆ విష్ణువే పరతత్త్వమని నిర్ణయించుకొన్నాయి. లక్ష్మీదేవి తన స్వరూపంతో విష్ణువుయొక్క విశ్వరూపాన్ని చులుకనగా జేస్తున్నట్టిది. కాబట్టి, అట్టి లక్ష్మీదేవి అమృత ప్రవాహాన్ని మించిన తన కటాక్షాలను మనమీద ఆచ్ఛాదింపజేయుగాక.

**వ్యాఖ్య:** అద్భుతశక్తిగల లక్ష్మీదేవి తన సుధాతరంగాంతరంగ కటాక్షాల చేత మనలను అభిషేకించవలెనని ప్రార్థన.

1) సృష్టికార్యమందు శ్రియఃపతికి తోడ్పడుతుంది లక్ష్మీదేవి. జీవుల స్థితి గతులలో దేవతలకు ఉచ్చత్వం, మానవులకు నీచత్వం, పశువులలో సింహశార్దూల గజాదులకు ఉచ్చత్వం, గార్దభ వరాహ శునకాదులకు నీచత్వం, పక్షులలోనూ హంసశుకాదులకు ఉచ్చత్వం, కాకగృధ్రాదులకు నీచత్వం కనబడుతున్నది కదా!

అట్లే స్థావర సృష్టిలోనూ, చందన రసాలాశ్వత్థ నారికేళాది వృక్షాదులకు ఉచ్చత్వం, తుమ్మ మొదలైన ముండ్ల చెట్లకు నీచత్వం తారతమ్య సృష్టికి నిదర్శనం.

శ్రియఃపతి పక్షపాతం, నిర్దయ కలవాడు మాత్రం కాడు. సృష్టిలో హెచ్చుతగ్గులకు లక్ష్మీదేవియొక్క భ్రూవిక్షేపాలే ప్రమాణం. చరాచర పదార్థాల యందున్న కర్మలకు లక్ష్మీదేవియొక్క భ్రూభంగాలే ప్రేరకాలు. కాబట్టి లక్ష్మియొక్క

కనుబొమల కదలికలలో వారి వారి కర్మఫలాలు సూచింపబడినందున వాటి ననుసరించి శ్రియఃపతి విశ్వసృష్టి చేస్తాడు.

2) శ్రుతులు అందటికి సమానత్వాన్ని ప్రతిపాదిస్తున్నట్లున్నాయి.

"హిరణ్యగర్భః సమవర్త తాగ్రే"- మొదట బ్రహ్మ ఒకడే ఉండెను.

"విశ్వాధికో రుద్రో మహర్షిః"- రుద్రుడొక్కడే విశ్వాధికుడు.

"ఏకో హవై నారాయణ ఆ సీత్, న బ్రహ్మనే శానః"- నారాయణుడు మాత్రమే ఉండెను. బ్రహ్మలేదు, శివుడు లేదు. ఇట్లు చెప్పబడినప్పటికీ "అస్యే శానాజగతో విష్ణుపత్నీ"- అనే శ్రుతి స్మృతులు విష్ణుపత్నియైన లక్ష్మిని ప్రతిపాదిస్తున్నాయి. ఎవని వక్షఃస్థలమందు లక్ష్మీదేవి పాదాలయందున్న పారాణి గుర్తులుండునో ఆ విష్ణువే పరతత్త్వమని వేదాంతాలు నిర్ణయించాయి. అందువల్ల, లక్ష్మీదేవికి వేదాంత వేద్యత్వం ప్రతిపాదింపబడింది. అంతేకాదు, "లక్ష్మీచరణ లాక్షాంక సాక్షి శ్రీవత్స వక్షసే"- అని పరతత్త్వ నిర్ణయం చేయు సామర్థ్యం లక్ష్మీదేవికే ఉన్నదని విశదీకృతం.

3) పురుష సూక్తం విష్ణువు యొక్క విశ్వరూపాన్ని "సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్ర పాదుడు" అని ఉత్తరానువాకమందు "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" అని వర్ణించింది.

"విష్ణోర్దేహానురూపాంవై కరో త్యేషాఽఽత్మన స్తనుమ్"- విష్ణువుయొక్క శరీరానికి తగినట్లు లక్ష్మీదేవి తన శరీరాన్ని సృజించుకొంటుంది- అని శ్రీస్తుతి. అందువల్ల లక్ష్మీదేవి తన విశ్వరూపంతో అపూర్వమైన విస్మయాన్ని కలిగిస్తూ, విష్ణువుయొక్క విశ్వరూపాన్ని మించిన మాహాత్మ్యం కలది. ఇట్లు శ్లోకంలోని మూడు పాదాలచేత లక్ష్మీదేవియొక్క పరత్వం ప్రతిపాదింపబడింది. 'అజ్ఞాత నిగ్రహా' అని స్పష్టం కదా!

ఆ లక్ష్మీదేవియొక్క కటాక్ష వీక్షణాలు అమృత తరంగాల కంటెను మధురమైనవి. కాబట్టి, ఆ చూపులను మనపైన కప్పవలెను- అని ఆశయం.

ఆజ్ పూర్వకమైన "స్తృఞ్ ఆచ్ఛాదనే" అని ధాతువు. "ఆస్తృణీతాం"- లోట్ ఆత్మనే పది ప్రథమ పురుషైక వచనం. ఇక్కడ సౌలభ్యగుణం సూచితం.

జగన్మాతయొక్క చల్లని క్రీగంటి చూపులు అమృత తరంగాలై మనను అభిషేకించవలెను.

స్రగ్ధరావృత్తం- మ ర భ న య య య- గణాలు కలది.

*"మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్".*

*5. యద్యావత్తవవైభవంతదుచితస్తోత్రాయ దూరే స్పృహా*
*స్తోతుంకే వయ మిత్యదశ్చ జగృహుః ప్రాంచో విరించ్యా దయః।*
*అప్యేవంతవదేవి వాఙ్మన సయోః భాషా నభిజ్ఞం పదం*
*కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తి ప్రశస్త్యైగిరామ్॥*

**అర్థం:** హే దేవి= ఓ లక్ష్మీదేవి!; తవ= నీ యొక్క; వైభవం= మాహాత్మ్యం; యత్= ఏదో; యావత్= ఎంత మాత్రమో; తత్+ఉచిత, స్తోత్రాయ= ఈ రెండు విధాలకు తగిన స్తోత్రం కోసమైన; స్పృహా= కోరిక; దూరే= దూరమందున్నది (తగనిది); ప్రాంచః= ప్రాచీనులైన; విరించి+ఆదయః= బ్రహ్మాది దేవతలు; అదః= ఈ (నీ) వైభవాన్ని; స్తోతుం= స్తోత్రం చేయడానికి; వయం= మేము; కే= ఎవరము; ఇతి, చ= అంటూనే; జగృహుః= స్తుతింప గ్రహించారు; ఏవం, అపి= ఇట్లైనప్పటికీ; వాఙ్మన సయోః= వాక్కు, మనస్సులయొక్క; భాషా+అనభిజ్ఞం= భాషకు గోచరం కానట్టి; తవ= నీ యొక్క; పదం= స్వరూపాన్ని; స్తోతుం= స్తుతించడానికి; కావాచః= కుత్సితమైన వాక్కులు గలవారమై; ప్రయతామహే= ప్రయత్నిస్తున్నాము; గిరాం= వాక్కుల యొక్క; ప్రశస్త్యై= ప్రసిద్ధికోసం; స్వస్తి= శుభమగు గాక.

**తా॥** ఓ శ్రీరంగరాజ్యలక్ష్మీ! నీ వైభవమెంతో గొప్పది. దాన్ని పూర్ణంగా ప్రకాశింపజేసే స్తోత్ర రచనను మేము కోరడమే తగనిది. ప్రాచీనులైన బ్రహ్మాది దేవతలు నీ వైభవం "మా మాటలకూ, మనస్సుకూ తెలియకుండా ఉన్నది"- అంటూనే, వారు తమ శక్తికొలది స్తుతించారు. ఇక మేము దోషంతో కూడిన

అల్పవాక్కులు కలవారమే, అయినా నీ గొప్ప వైభవాన్ని స్తోత్రం చేయడానికి సాహసంతో ప్రయత్నిస్తున్నాం. నిన్ను స్తుతించే మా వాక్కులకు మంగళమవుగాక- అని భట్టరు ప్రార్థిస్తున్నారు.

వ్యాఖ్య: ఎంత పాండిత్యమున్ననూ బాలుడుగా ఉండడం ఉత్తమ లక్షణం- అని శ్రీ పరాశర భట్టర్, వచ్చీరాని మాటలతో జగన్మాతను స్తుతింప బూనుకొన్నందుకు ఆమె క్షమించి, ఆ స్తోత్రానికి ప్రాశస్త్యాన్ని కలిగిస్తుందనే అధ్యవసాయంతో సుశ్లోకించారు.

లక్ష్మీదేవి వైభవం వాఙ్మనస్సులకు గోచరించనిదని, ఆమె గుణాలను వర్ణించడానికి బ్రహ్మకు కూడా తరంకాదని *"నతే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాఽపి వేధసః"*- అని (వి.పు.) వర్ణించింది.

*"యస్యాస్తే మహిమాన మాత్మన ఇవత్వ ద్వల్లభోఽపి*
*ప్రభుః నాలంమాతు మియత్తయా నిరవధిం"*- (కాంతాచతుః శ్లోకి).

నీ వల్లభుడైన విష్ణువు తన మహిమను తాను తెలుసుకొనలేనట్లే, నీ మహిమ ఇంతటిదని పరిగణించలేకపోయాడు- అని శ్రీమద్యాముని మునులు స్తుతించారు. పూర్వాచార్యుల ననుసరించి, స్తోత్ర రచనకు పూనుకొన్నందున శ్రీరంగరాజ మహిషి యొక్క అనుగ్రహం అవశ్యంగా కవికి లభిస్తుందని మహావిశ్వాసం ప్రకటింప బడుతున్నది. ఇందు 'వాఙ్మనస' శబ్దం అకారాంతం- 'అచతుర విచతుర' ఇత్యాది సూత్రం చేత నిపతింపబడింది.

కావాచః= కుత్సితవాచః. "ఈషదర్థేచ, ఇతి 'కు' శబ్దస్య "కా" దేశః. ఈ పదంచేత స్తుతిసామగ్రీ వైకల్యం సూచింపబడింది.

వృత్తం:- శార్దూల విక్రీడితం. మ స జ స త త గ- గణాలుండును.

*"సూర్యాశ్వైర్మసజస్తతాః సగురవః శార్దూల విక్రీడితమ్॥"*

6. *స్తోతారం తముశంతి దేవి! కవయో యో విస్తృణీతే గుణాన్*
*స్తోతవ్యస్య తతశ్చతే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి।*
*యస్మాదస్మదమర్షణీయ ఫణితి స్వీకారతస్తే గుణాః*
*క్షాంత్యౌదార్య దయాదయో భగవతి! స్వాంప్రస్నువీరన్ ప్రథామ్॥*

**అర్థం:** హే భగవతి! దేవి= పూజ్యురాలవైన ఓ లక్ష్మీదేవి!; స్తోతవ్యస్య= సోత్రం చేయదగిన వ్యక్తి యొక్క; గుణాన్= గుణాలను; యః= ఎవడు; విస్తృణీతే= విస్తరింప జేయునో; తం= ఆ వ్యక్తిని; కవయః= కవులు; స్తోతారం= స్తోతగా; ఉశంతి= చెబుతున్నారు; తతః= అందువల్ల; చ= గత శ్లోకమందు చెప్పిన కారణం వల్లను; తే= నీ యొక్క; స్తుతి ధురా= స్తుతిని జేసే భారం; మయి, ఏవ= నాయందే; విశ్రామ్యతి= విశ్రమిస్తున్నది; యస్మాత్= ఎందువల్ల అంటే; అస్మదమర్షణీయ ఫణితి స్వీకారతః/ అస్మత్= నా యొక్క; అమర్షణీయ= సహింపరాని; ఫణితి= వాక్యాల యొక్క; స్వీకారతః = స్వీకరించడంవల్ల; క్షాంతి+ఔదార్య, దయా+ఆదయః= ఓర్పు, ఔదార్యం, దయ, మొదలైన; తే= నీ యొక్క; గుణాః= గుణాలు; స్వాం= తమదైన; ప్రథాం= ప్రశస్తిని; ప్రస్నువీరన్= జనింపజేయనున్నవి.

**తా॥** ఓ భగవతీ! దేవీ! ఒకరి గుణాలను విస్తరించే వ్యక్తిని 'స్తోత' అని కవులు చెబుతారు. నిన్ను స్తుతించే భారం నాయందే ఉన్నది. నిన్ను స్తుతిస్తున్నప్పుడు అల్పుడనైన నా మాటలను నీవు సహిస్తున్నావంటే నీ సహనం, దయ, ఔదార్యం మొదలైన గుణాలు తమ ప్రసిద్ధిని చాటుకొంటున్నాయి.

**వ్యాఖ్య:** స్తుతించేవాడే కవియైనందున లక్ష్మీదేవిని స్తుతించే భారం తనపైన ఉన్నదని కవి ప్రకటన.

"కల్పనా నిపుణః కవిః"– కల్పన చేయడమందు సమర్థుడైన వాడు కవి. ఎవరిని స్తుతింపదలచినాడో, ఆ వ్యక్తియందు లేని గుణాలను కల్పించి స్తుతించే అవకాశం కవికి ఉంటుంది. కాని లక్ష్మీదేవి భగవతి కదా! కల్యాణ గుణాలు కలది. ఉన్న గుణాలనైనా సమగ్రంగా వర్ణించే శక్తి బ్రహ్మాదులకైననూ లేదు.

పరాశర భట్టరు వారు శ్రీరంగనాయకిని స్తోత్రం చేసే భారం తనయందే ఉన్నదని ప్రకటిస్తున్నారు.

లక్ష్మీదేవి "దేవజుష్టాముదారాం"- సకల దేవతలచే సేవింపబడునది. ఉదార గుణం కలది- అని ఋగ్వేద ఖిలమైన శ్రీసూక్తం కీర్తిస్తున్నది. ఆమె జగన్మాత. తాను ఒక బాలుడు కదా! తన దోషయుక్త వాక్కులను వినడానికి స్వీకరించడంవల్ల, లక్ష్మీదేవి యొక్క క్షాంతి, ఔదార్య, దయాది గుణాలు అధికంగా ప్రసిద్ధిని పొందుతున్నాయి- అని కారణాన్ని ప్రకటించారు. కాబట్టి, తమ అహంకారాన్ని నిరసించుకొని, క్రమమైన నమ్రతను ప్రదర్శించారు.

మాతృగుణాలు ఇందు స్తుతింపబడినాయి.

క్షాంతి- తమ వాక్కులలోని దోషాలను, పారుష్యాన్ని వినికూడా శిక్షింపక సహనాన్ని వ్యక్తం చేయడం. ఔదార్యం- యోగ్యత లేకున్ననూ, తమచే స్తోత్ర రచన జేయనీయడమే ఔదార్యం.

దయ- ఇతరుల దుఃఖాన్ని జూచి స్వయంగా బాధపడడం. స్తోత్రంచేసే వ్యక్తి పరిశ్రమకు తాను బాధపడుతూ దయను వ్యక్తం చేయడం. ఆది శబ్దంచేత వాత్సల్యమూ సూచితం. దోషాలను కూడా గుణాలుగా అంగీకరించడమే వాత్సల్యం. ఇందు లక్ష్మీదేవియొక్క గుణ విస్తృతి వ్యక్తం చేయబడింది.

(విస్తృణీతే- వి పూర్వాత్ "స్తృఞ్ ఆచ్ఛాదనే" ఇతి ధాతోః "శ్న" ప్రత్యయే 'ఈ హల్యఘోః' ఇతీత్వే త ఇత్యస్య ఏత్వేకృతే 'విస్తృణీతే' ఇతి రూపం.

ఉశంతి- "వశ కాంతౌ" ఇత్యస్మాద్ధాతోః "గ్రహిజ్యా..." ఇతి సంప్రసారణే "ఝూఽన్తః" ఇత్యన్తాదేశ ఉశన్తీతిరూపం!

ధురా- శబ్దః, ఆకారాంతః। హలంతానా మజన్తత్వం భాగురిః మన్యతే।

ప్రస్నువీరన్- 'ష్ణు ప్రస్రవణే' ఇత్యస్మాద్ధాతోః లిఙాత్మనే పదబహువచనే లిఙః సీయుటః సలోపే ఉవఙి ఝస్య రన్ ఆదేశే 'ప్రస్నువీరన్' ఇతి రూపమ్)

ఈ శ్లోకమందు ముఖ్యంగా స్తోత్రాధికారం సాధింపబడింది. వృత్తం- శార్దూల విక్రీడితం.

7. సూక్తిం సమగ్రయతు నః స్వయమేవ లక్ష్మీః
శ్రీరంగరాజ మహిషీ మధురైః కటాక్షైః।
వైదగ్ధ్య వర్ణ గుణగుంభన గౌరవైర్యాం
కండూల కర్ణకుహరాః కవయో ధయంతి॥

**అర్థం:** శ్రీరంగరాజమహిషీ= శ్రీరంగేశుని పట్టపురాణియైన; లక్ష్మీః= శ్రీదేవి; యాం= ఏ వాక్కును; వైదగ్ధ్య వర్ణ గుణగుంభన గౌరవైః/ వైదగ్ధ్య= చాతుర్యంగల అర్థగౌరవం యొక్క; వర్ణ= అక్షరాల యొక్క; గుణ= మాధుర్యాది గుణాల యొక్క; గుంఫన గౌరవైః= ఘటనాతిశయంచేత; కవయః= పండితులు; కండూల కర్ణకుహరాః = దురదతో కూడిన చెవులచిల్లులు కలవారై; ధయంతి= త్రాగుతున్నారో; అట్టి, నః= మా యొక్క; సూక్తిం= మంచివాక్కును; మధురైః= కమ్మని; కటాక్షైః= కడగంటి చూపులతో; స్వయం, ఏవ= తనంత తానే; సమగ్రయతు= సంపూర్ణంగా నిర్వర్తింప జేయుగాక.

**తా॥** అర్థగాంభీర్యం, మాధుర్యాది గుణాలు, రమణీయ పదాల కూర్పుగల సూక్తులను విద్వత్కవులు చెవుల దురద తొలగే విధంగా వింటారో, అట్టి సూక్తులు గల స్తోత్రాన్ని శ్రీరంగనాయకియే తన కటాక్ష వీక్షణాలతో స్వయంగానే సిద్ధింప జేయుగాక.

**వ్యాఖ్య:** విద్వత్కవులు మెచ్చుకొను విధంగా ఈ స్తోత్రాన్ని సమగ్రంగా సిద్ధింపజేయు భారాన్ని కవి లక్ష్మీదేవిపై వేశాడు.

స్తోత్ర కావ్యనిర్మాణం సమగ్రంగా ఉండడానికి మూడు లక్షణాలు ఇందు చెప్పబడినాయి.

1) అర్థం గంభీరంగా ఉండడం.

2) అక్షరాల కూర్పు రమ్యంగా ఉండడం.

3) ప్రసాద మాధుర్యాది గుణాలు ఉండడం.

ఇట్టి స్తోత్ర కావ్యామృతాన్ని కవులు, పండితులు తమ కర్ణపుటాలతో పానం చేస్తారు. (ధయంతి-ధేట్‌పానే.)

లక్ష్మీదేవియొక్క కటాక్షం లేకుంటే అట్టి స్తోత్రాన్ని తాను నిర్వహించలేనని నివేదిస్తున్నాడు కవి. జగన్మాతయే స్వయంగానే, కవిచేతిలో నున్న కలంబట్టి, స్తోత్ర కావ్యరచనను జేయిస్తూ- తీర్చిదిద్దుతూ- సమగ్రతను కలిగింపవలెనని న్యస్త భరుడైనాడు కవిప్రవరుడు.

(కండూః ఏషాం అస్తీతి కండూలాని. మత్వర్థేలచ్. కండూలాని కర్ణకుహరాణి యేషాంతే= కండూల కర్ణకుహరాః.)

వృత్తం- వసన్తతిలకం.

8. *అనాఘ్రాతావద్యం, బహుగుణ పరీణాహి, మనసో*
*దుహానం సౌహార్దం, పరిచితమివాథాపి గహనమ్।*
*పదానాం సౌభ్రాత్రా దనిమిష నిషేవ్యం శ్రవణయోః*
*త్వమేవ శ్రీర్మహ్యం బహుముఖయ వాణీ విలసితమ్॥*

**అర్థం:** హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!; అనాఘ్రాత+అవద్యం= దోషవాసనలు లేనట్టి; బహుగుణ పరీణాహి= అనేక గుణాలు, అలంకారాలు, వృత్తి, రీతి, పాకాదులు కల్గినట్టి; మనసః= మనస్సుకు; సౌహార్దం= సంతోషాన్ని; దుహానం= కల్గజేయునట్టి; పరిచితం, ఇవ+అథాపి= తెలిసిన దానివలె ఉన్ననూ; గహనం= గాంభీర్యం కలిగినట్టి; పదానాం= పదాల యొక్క; సౌభ్రాత్రాత్= సహోదరత్వంవల్ల; శ్రవణయోః= చెవులకు; అనిమిష నిషేవ్యం= ఆసక్తితో సేవించదగినట్టి; వాణీవిలసితం= సరస్వతీ విలాసాన్ని; మహ్యం= నాకోసం; త్వం, ఏవ= నీవే; బహుముఖయ= బహుముఖాలుగా వర్ధిల్లజేయుము.

**తా॥** దోషరహితమూ, గుణాలంకారాది సహితమూ, రస సమన్వితం, ధ్వని ప్రధానమైన వాక్పాటవాన్ని ఓ లక్ష్మీదేవీ! నీవే నాకు పలు విధాలూ విస్తరింపజేయుము.

వ్యాఖ్య: లక్ష్మీకటాక్షంవల్లనే వాగ్విలాసం వృద్ధిజెంది, స్తోత్ర కావ్యానికి ఉత్తమత్త్వం సిద్ధిస్తుందని ప్రార్థితం.

ఓ లక్ష్మీదేవీ! నా ఈ స్తోత్ర రచనలో పదవాక్య గత దోషాలు దొరలకుండా కటాక్షించు. కవులు ప్రయోగింపనట్టి, సులభంగా అర్థాన్ని బోధింపనట్టి, అశ్లీల ప్రక్రమభంగాది దోషాలు కల్గిన పదాలను ప్రయోగించడం పదదోషం.

1) అనాఘ్రాతా వద్యం కదా! ముక్కంటి – మూడు కన్నులు కల్గిన శివుడనడానికి మారుగా, 'ద్వాదశార్ధార్ధలోచనుడు'– షణ్ముఖుని కున్న పంద్రెండ్ల కన్నులలో సగంలో నున్న సగం కన్నులు కలవాడు అనడం, అర్థ పుష్టిలేని పదంగా భావింపబడుతున్నది.

2) బహుగుణ పరీణాహి– కావ్యశోభకు ఉపమాద్యలంకారాలే కారణం. అట్లే ఓజః ప్రసాద మాధుర్యాది గుణాలు కూడా కావ్యానికి శోభను సమకూర్చుతాయి.

3) మన సః సౌహార్దం దుహానం– మనస్సుకు సంపూర్ణ రసానందాన్ని సమకూర్చే లక్షణం రసాత్మకం.

4) పరిచిత మివాథాపి గవానం– అర్థం తెలిసినట్లున్నప్పటికీ, ఇంక తెలియకుండా ఉన్న అర్థాల గాంభీర్యం కలది ధ్వని. ధ్వని ప్రధానమైనది ఉత్తమ కావ్యం.

5) పదానాం సౌభ్రాత్రాత్ అనిమిష నిషేవ్యం శ్రవణయోః– పదాల పరస్పర మైత్రి– పొంకంగా పదాల పోహళింపు– 'శయ్య' అనబడుతుంది.

*"యా పదానాం పరాన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే॥"*– దీనివలన, చెవులు అత్యంతాసక్తితో వినే యోగ్యతను పొందుతాయి.

అనిమిషనిషేవ్యం– 'నిమేషత్వం' అంటే రెప్పపాటు. ఇది కన్నులకుండే లక్షణం, కాని చెవులకు కాదు కదా! ఇది కవితా చమత్కారం, కాబట్టి ఈ పంచ లక్షణాలుగల కావ్యాన్ని చెవులు సావధానంగా, సాశ్చర్యంగా సేవిస్తాయని అర్థం.

'అనిమిషులు' అంటే దేవతలు అని అర్థం. దేవతలు కూడా భాషా రూపమైనవిలా సకర్మను శ్రద్ధతో సేవిస్తారని సారార్థం.

'శ్రీ గుణరత్నకోశం'- ఉత్తమ కావ్యంగా శోభింపజేయుమని కవితల్లజుడు లక్ష్మీదేవిని ప్రార్థించడమే ప్రశంసనీయం.

వాణీవిలసితం- వెండి, బంగారంలాగా చూడదగిన భౌతిక వస్తువు కాదు. సరస్వతీ విలాసం జ్ఞానద్రవ్యం. *"శ్రోత్రేణ హితద్విందతే"*- (బృహదారణ్యాకోపనిషత్). చెవులతో సేవించ దగినదే కదా!

*"యోవై స్వాం దేవతామతి యజతే"*- అనే శ్రుతి రీత్యా, ఉభయ భ్రష్టులు కారు. ఏ దేవతను ఆశ్రయించి ఆరాధిస్తుంటారో, అట్టి భక్తులు ఇతర దేవతలను కోరనే కోరరు. తాను ఆశ్రయించిన దేవతయే సర్వ ఫలప్రదమని విశ్వసిస్తారు.

*"సక్తుమివ తితఉనా పునంతో- భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి"*. ఇది వేద వాక్కు. పిండిని జల్లెడ పట్టిన రీతిగా పవిత్రీకరించిన ఆర్షవాక్కునందు లక్ష్మి భద్రంగా ఉంటుంది- (శ్రుత్యర్థం).

*"భద్రాహ్యేషాం వాచి లక్ష్మీర్నియుక్తా"*- (ఉ.రా.చ. 4-18). భగవత్సాక్షాత్కారాన్ని పొందిన వారి వాక్కులో మంగళరూపిణియైన లక్ష్మీదేవి నిత్యం నివసించి యుంటుంది.

శ్రీ పరాశర భట్టరు వారు కోరినట్లే శ్రీరంగరాజ మహిషి ఫలసిద్ధిని కలిగిస్తుంది.

శిఖరిణీవృత్తం. 'య మ న స భ ల గ'- గణాలు కలది. *"రసైరుద్రైశ్ఛిన్నా య మ న స భ ల గః శిఖరిణీ"*.

*9. శ్రియః శ్రీః శ్రీరంగేశయ! తవచహృద్యాం భగవతీం*
*శ్రియం త్వత్తోప్యుచ్చైర్వయ మిహఫణామః శ్రుణుతరామ్।*
*దృశౌతే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః*
*పునర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కంచుక శతమ్॥*

**అర్థం:** శ్రియః= సర్వసమాశ్రయణీయమైన లక్ష్మీదేవికే; శ్రీః= ఆశ్రయమైన వాడా!; శ్రీరంగేశయ= శ్రీరంగరాజా!; తవ, చ= నీకు కూడా; హృద్యాం= హృదయంగమ మైనట్టి; భగవతీం= మహిమతో కూడినట్టి; శ్రియం= లక్ష్మీదేవిని; త్వత్తః, అపి= నీ కంటెను కూడా; ఉచ్చైః= ఎక్కువగా; వయం= మేము; ఫణామః= వర్ణించి చెప్పుతున్నాము; ఇహ= ఇక్కడ; శ్రుణుతరామ్= శ్రద్ధతో వినుము; శ్రవణతః = వినడం వల్ల; తే= నీ యొక్క; దృశౌ= కన్నులు; సుఖతరళతారే= సుఖంచేత ఇటునటు కదులుతున్న కనుపాపలు కలవిగా; భూయాస్తాం= అగుగాక; పునః= మరియు; భుజయోః= భుజాలయందలి; కంచుక శతం= కవచాల పరంపర; హర్ష+ఉత్కర్షాత్= సంతోషాధిక్యంవల్ల; స్ఫుటతు= పిగిలిపోవును గాక.

**తా॥** శ్రీరంగరాజా! అందరిచే ఆశ్రయింపబడిన లక్ష్మీదేవికే ఆశ్రయమైన వాడవు. నీ సంతోషం కోసమే ఆమెను నీకంటె నధికంగా వర్ణిస్తున్నాము. అందువల్ల, నీవు కోప పడవలదు. లక్ష్మీదేవి నీకు హృద్యమైనది. ఆమెను వర్ణించిన కొలది నీకు సంతోషం ఎక్కువై నీ కనుపాపలు గిరగిర తిరుగుతుంటాయి. భుజకంచుకాలు క్రమంగా పటపట పగిలిపోతాయి. ఈ స్తోత్రాన్ని నీవు కూడా విన్నందువల్ల మాకు సాక్షివిగా ఉంటావు స్వామీ!

**వ్యాఖ్య:** భర్త యెదుట భార్యను ఎక్కువగా వర్ణిస్తున్నప్పుడు భర్తకు కోపం వచ్చునేమో అని శ్రీరంగ శాయిని అనునయించే శ్లోకమిది.

*శ్రియఃశ్రీః– “భర్తా నామ పరం నార్యాః భూషణం భూషణాదపి”*– భార్యకు భర్త సువర్ణ రజిత రత్నాభరణాల కన్న అనర్ఘమైన ఆభరణం. పత్నిని శోభింప జేసేవాడు పతి యని ప్రసిద్ధి.

అందరు లక్ష్మీదేవిని ఆశ్రయించడంవల్ల ఆమెకు ‘శ్రీ’ యనే పేరు శోభిస్తున్నది. ఆ శ్రీదేవి కూడా శ్రీరంగమందు సుఖంగా శయనించిన శ్రీరంగనాథుణ్ని ఆశ్రయించింది. తత్ఫలితంగా, లక్ష్మీదేవికి స్వరూప లాభం సూచింపబడుతున్నది.

లక్ష్మీదేవికి తన భర్త తప్ప తక్కిన వారందరు శేషభూతులే. శ్రీరంగశాయికి లక్ష్మితోపాటు అందఱు శేషభూతులే కదా! శ్రీరంగ క్షేత్రం అందఱు ఆ దివ్య

దంపతులను సులభంగా సేవించదగిన వైకుంఠంగా భావింపబడుతున్నది. శ్రీ పరాశర భట్టర్ ఈ స్తోత్రాన్ని వారిరువురి సమక్షాన అనుసంధానం చేసి ఆనంద పరచారు.

ఓ శ్రీరంగశాయీ! నీ పత్నియైన శ్రీదేవిని నీ ముందే, నీ కంటెను అధికంగా మేము పొగడుతుంటే నీ మనస్సును చిన్నపుచ్చుకోకూడదు. ఎందుకంటే శ్రీదేవి, తనను లోకులు, లోకేశులు అందఱు ఆశ్రయించినప్పటికీ నిన్ను ఆశ్రయించి, మహాసామ్రాజ్ఞిగా ప్రకాశిస్తున్నది.

హృద్యాం- 1) నీ మనస్సుకు చాలా ఇంపైన ప్రేయసి. 2) నీ యెదలోనే నివసిస్తున్నది. నీ యంతరంగమైన శ్రీదేవియొక్క గుణాలను నిన్ను వర్ణించడం కంటెను మించి వర్ణించడంవల్ల నీకే సంతోషమధికమవుతుంది. నీ కనీనికలు తళతళ మెరుస్తూ చలిస్తుంటాయి. ఆమె కల్యాణ గుణాలను పొగడుతున్న కొలది నీ భుజాలు ఎగురుతుంటాయి. నీ ఆకారం ఉబ్బుతుంది. ఒక్కొక్క వర్ణనకు నీవు ధరించిన కవచాలు వరుసగా చినుగుతునే ఉంటాయి. మా శ్రీగుణరత్న కోశ స్తోత్రాన్ని అధిక హర్షంతో విన్న సాక్షివిగా నిన్ను మేము భావిస్తుంటాము.

**శిఖరిణీ** వృత్తం.

*10. దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః*
*త్వత్సద్గుణౌఘ మణికోశ గృహం గృణంతి।*
*తద్ద్వార పాటన పటూనిచ సేతిహాస*
*సంతర్కణ స్మృతి పురాణ పురస్సరాణి॥*

**అర్థం:** హే దేవి= ఓ లక్ష్మీదేవి!; ప్రథమే= మొదటి వారైన; పుమాంసః= పురుషులు; భగవతీం= మహిమగల; శ్రుతిం= వేదాన్ని; త్వత్, సద్గుణ+ఓఘ, మణి కోశగృహం= నీ యొక్క మంచిగుణాల సముదాయం అనే మణులయొక్క భాండాగారంగా; (గృణంతి= చెబుతున్నారు); సేతిహాస సంతర్కణ స్మృతి పురాణ

పురస్సరాణి!; స+ఇతిహాస= రామాయణం మొదలైన ఇతిహాసాలతో కూడిన; **సంతర్కణ**= వేదార్థ విచారణం చేసినట్టి పూర్వ మీమాంసా శాస్త్రం; స్మృతి= మనుమహారాజు మొదలైన వారిచే చేయబడిన స్మృతులు; పురాణ= పరాశర, వ్యాస మహర్షులచే చెప్పబడిన విష్ణుపురాణ, భాగవతాది పురాణాలు; పురః సరాణి= మొదలైన వాటిని; తద్వార పాటన పటూని చ/ తత్= ఆ భాండాగారం యొక్క; ద్వార= కవాటాన్ని; **పాటన**= తెరవడమందు; పటూని, చ= సమర్థమైన కుంచికలుగానూ; గృణంతి= చెబుతున్నారు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! పూర్వులైన ఋషులు వేదాన్ని నీ గుణ సముదాయం అనే రత్నాల కోశాగారం (నిధి) అనీ; రామాయణ భారతేతిహాసాలను, భాగవతాది పురాణాలను, పూర్వమీమాంసాదులను ఆ కోశాగార ద్వారాన్ని తెరచే తాళపు చెవులు అని కూడా చెబుతున్నారు.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి యొక్క గుణాలకు సపరికరమైన వేదమే ప్రమాణమని స్తుతిస్తూ, ఈ స్తోత్రానికి 'శ్రీగుణరత్న కోశ' మనే పేరు సూచింపబడుతున్నది.

వేదం పూర్వకాండ (కర్మకాండ) అనీ, ఉత్తరకాండ (జ్ఞానకాండ) అనీ రెండు విధాలుగా నున్ననూ, ప్రమేయమైన భగవత్తత్త్వాన్ని తెల్పడానికి స్వతః ప్రమాణమై యున్నది. కాబట్టి, శ్రుతికి భగవతి అనే విశేషణం దాని అపౌరుషేయత్వం, నిర్దోషత్వం అనే మహిమను ప్రకటిస్తున్నది.

*"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్।*
*బిభేత్యల్ప శ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి॥"*

కొద్దిగా వేదాధ్యయనం చేసినవ్యక్తి వల్ల, ఇతడు శబ్దాలకు సముచితమైన అర్థాలను చెప్పజాలక, నన్ను వంచిస్తాడని వేదం భయపడుతుంది. కాబట్టి, పూర్వం ఋషులు, వేదార్థాన్ని విపులంగా తెలిపే ఇతిహాస పురాణాదులను రచించాలని గుర్తించారు.

ఋగ్యజుస్సామాథర్వణమనే వేద సముదాయంలోని వాక్యార్థాలను స్మృతీతిహాస పురాణాదులవల్ల తెలుసుకొన శక్యమవుతున్నదని అర్థం.

వేదం లక్ష్మీదేవియొక్క గుణాలు అనే రత్నాలకు కోశగృహం. ఆ కోశాగార కవాటాన్ని తెరచి చూస్తే అన్నీ జగన్మాతయొక్క గుణరత్నాలే కనిపిస్తుంటాయి ("కోశోఽ స్త్రీ సంచయేఽ పిచ"- అమరం).

"హిరణ్యనిధి" విష్ణువైతే, లక్ష్మీదేవి "హిరణ్మయి". "సమజ్ఞానయే విష్ణవే"- "శ్రద్ధయాదేవో దేవత్వమశ్నుతే!॥" ('శ్రద్ధ' అంటే లక్ష్మియే). "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ।" "హిరణ్య వర్ణాం హరిణీం"- "హిరణ్య ప్రాకారా మార్ద్రాం జ్వలంతీం" (లక్ష్మి జ్వాలా స్వరూపిణియే కదా!)

"దేవజుష్టాముదారాం"- (సర్వదేవ- దేవ వనితలచేతను గొప్పగా సేవింపబడే సామ్రాజ్ఞి.) "ఈశ్వరీం సర్వ భూతానాం" ఇత్యాది వేద వాక్యాలు శ్రీదేవి గుణ వైభవాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

ఈ కోశాగార కవాటాన్ని తెరవడానికి సమర్థమైన కుంచె కోలలు- తాళపు చెవులు- పురాణేతిహాసాలు.

"రాఘవత్వే భవత్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని।
అన్యేషు చావతారేషు విష్ణో రేషా నపాయిని॥"

భగవానుడు శ్రీరాముడై అవతరించగా లక్ష్మీదేవి సీతగానూ, కృష్ణునిగా ఆవిర్భవించినప్పుడు ఆమె రుక్మిణిగా అవతరించింది. ఇతర అవతారాలలోనూ విష్ణునితోపాటు, విడువకుండా, అవతరిస్తునే యున్నదని శ్రీ పరాశర మహర్షి విష్ణు పురాణంలో లక్ష్మీవైభవాన్ని ప్రతిపాదించాడు.

వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణం- సీతాచరితం- వేదమని ప్రసిద్ధి కదా!

"విదితస్సహి ధర్మజ్ఞః శరణాగత వత్సలః।
తేనమైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి॥"

ఓ రావణా! శ్రీరామచంద్రుడు ధర్మజ్ఞుడు, **శరణాగత వత్సలుడు**. నీవు

జీవించాలనుకొంటే, అతనితో స్నేహం చేసుకోవడం మంచిది- అని దుశ్చరితుడైన రావణునికి బుద్ధిజెప్పిన సీతమ్మ గుణోజ్జ్వల కదా!

అగ్నిదేవుడు, "పవిత్ర చరిత్రయైన ఈ సీతను గ్రహింపుము, ఈమెను '*నకించి దభిధాతవ్యా, అహమాజ్ఞాపయామి తే*'- ఏమీ అనకూడదు. నేను ఆజ్ఞాపిస్తున్నాను"- అని రామునితో చెప్పిన వెంటనే శ్రీరాముడు, క్షణకాలం కన్నీటి పర్యంతమై, లోకులకోసం జానకిని శోధించకుండా గ్రహించలేకపోతిని కదా! అని విచారగ్రస్తుడయ్యాడు.

నా మనస్సులో మెదలుతుండే సీత నాయందు చాలా భక్తిగలదని నాకు తెలియును.

*"న చ శక్తః సుదుష్టాత్మా మనసాపిహి మైథిలీమ్।*
*ప్రధర్షయితు మప్రాప్యాం దీప్తామగ్ని శిఖామివ॥"*

(రా.యు.కాం. 118-18)

దుర్మతియైన ఆ రావణుడు పొందశక్యం కాని ఈ సీతను ప్రజ్వలిస్తున్న అగ్నిజ్వాలనువలె మనస్సుతో కూడా ఎదిరించడానికి సమర్థుడు కాడు. ఇట్లు సీతాదేవిని వాల్మీకి శ్రీరామునిచేత 'అగ్నిజ్వాల' అనిపించాడు కదా! భారతం పంచమ వేదమే- వేద వ్యాస భాగవతమందు రుక్మిణిచేత శ్రీకృష్ణుని దగ్గతికి సందేశం పంపబడిన వ్యక్తి పేరు 'అగ్నిద్యోత'నుడే కదా! ఆ బ్రాహ్మణునితోనే శ్రీకృష్ణుడు "తా మానయిష్యే- ఏధసోగ్ని శిఖామివ॥" రుక్మిణిని 'అగ్నిజ్వాలను వలె' తెచ్చుకో గలను- అని పల్కినాడు. ఇదంతయు వేదార్థ ప్రకాశమే కదా!

"*కుమారి దెత్తు విద్వన్నుత! మానుద్రచ్చినవ వహ్ని శిఖన్ వడి దెచ్చు కైవడిన్॥*"- అని బమ్మెరపోతన కూడా రుక్మిణీ రూప లక్ష్మీదేవిని 'అగ్నిశిఖ' యని వర్ణించాడు కదా!

వేదాలయందలి అర్థాన్ని- స్మృతీతిహాస పురాణాలు లక్ష్మీదేవి గుణవైభవాన్ని విస్తరించి చెబుతున్నాయి కాబట్టి శ్రీగుణరత్న కోశాగార కవాటాన్ని తెరవడానికి ఆ స్మృతీతిహాస పురాణాలు 'తాళపు చెవులు'గా చెప్పబడినవి.

ప్రథమే పుమాంసః- పూర్వఋషులే కాక ఆళ్వార్లు, పూర్వాచార్యులు కూడా చెప్పినవన్నీ శ్రీసూక్తులే- శ్రీగుణ వైభవ ప్రతిపాదకాలే. శ్రీ సంప్రదాయమని గమనీయం. వేదసామ్యం చెప్పబడిన శ్రీగుణరత్న కోశాన్ని అర్థం చేసుకోవడానికి, ఋషులు, ఆళ్వార్లు, ఆచార్యవర్యులు చెప్పిన స్మృతీతిహాస పురాణ, దివ్య ప్రబంధాలు కూడా అధ్యయనం చేసిన మహనీయులకే సుగమంగా ఉండగలదని విశదీకరింప బడినది.

వసన్త తిలకావృత్తం.

*11. ఆహు ర్వేదా నమానం కతిచన కతిచా రాజకం విశ్వమేతత్*
*రాజన్వత్ కేచిదీశం గుణిన మపి గుణై స్తందరిద్రాణ మన్యే।*
*భిక్షా వన్యే సురాజం భవమితిచ జడాస్తే తలాతల్యకార్షుః*
*యేతే శ్రీరంగహర్మ్యాం గణ కనక లతే! నక్షణం లక్ష్యమాసన్॥*

**అర్థం:** హే శ్రీరంగహర్మ్య+అంగణ, కనకలతే= శ్రీరంగ భవనం యొక్క ముంగిలి యందున్న బంగారు తీగవైన ఓ లక్ష్మీదేవీ! యే= ఎవరు; తే= నీకు; క్షణం= తృటికాలం కూడా; లక్ష్యం= లక్ష్యం- గురి అయినవారు; న, ఆసన్= కాలేరో; తే= ఆ; జడాః= జ్ఞానంలేనివారు; కతిచన= కొందఱు; వేదాన్= వేదాలను; అమానం= ప్రమాణం కానివాటినిగా; ఆహుః= చెప్పినారు; కతిచ= మరికొందఱు జడులు; ఏతత్= ఈ; విశ్వం= ప్రపంచాన్ని; అరాజకం= ప్రభువు లేనిదానిగా (ఆహుః= చెప్పిరి); కేచిత్= ఇంక కొందఱు జడులు (విశ్వం= జగత్తును); రాజన్వత్= ప్రభువు కలదానిగా (ఆహుః = చెప్పినారు); అన్యే= వేరే కొందఱు; ఈశం= ప్రభువును; గుణినం, అపి= గుణాలు కలవాడైననూ; తం= ఆ సగుణుడైన ప్రభువును; గుణైః= గుణాలచే; దరిద్రాణం= లేనివానిగా (నిర్గుణునిగా) (ఆహుః= చెప్పిరి.); అన్యే= ఇతరులైన జడులు; భిక్షౌ= భిక్షకుని యందు; సురాజం, భవం, ఇతి, చ= రాజు కలదైనదనియు (ఆహుః= చెప్పిరి); (ఏవం= ఈ విధంగా; తే, జడాః= ఆ జడులు); **తలాతలి= తలాతల** యుద్ధాన్ని; అకార్షుః= చేసినారు.

**తా॥** శ్రీరంగని విమానం యొక్క ప్రాంగణమందు హేమలతవలె ప్రకాశిస్తున్న ఓ లక్ష్మీదేవీ! క్షణకాలమైనా, నీ కటాక్ష పాత్రులు కానట్టి జడులు వేదాలు ప్రమాణాలు కావు అన్నారు. కొందఱు దేవుడే లేడన్నారు. మరికొందఱు అనుమాన ప్రమాణం చేతనే దేవుడున్నాడన్నారు. దేవుడు సగుణుడైననూ, నిర్గుణుడన్నారు. మఱికొందఱు భిక్షుకుడే దైవమని హేళనం చేశారు. ఇట్లు నీయందు భక్తిలేని జడులందఱు 'తలాతల' యుద్ధాన్ని చేశారు.

**వ్యాఖ్య:** శ్రీదేవి వైభవానికి శ్రుతియే ప్రమాణం అని చెప్పిన తర్వాత, ఎంతవరకు ఇతర మతం నిరసింపబడదో అంతవరకు తమ మతం– అభిప్రాయం– స్థిరంగా నిల్వదు– అని పరమత నిరసనం చేయబడింది.

'జడులు' అనగా– అజ్ఞాన అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞానం కలవారు. వేదాలు, అపౌరుషేయత్వం, నిత్యత్వం, నిర్దోషత్వం, అఖిల పురుషార్థ వేదకత్వం మొదలైన వాటితో ప్రమాణాలుగా నిరూపింపబడుతున్నాయి.

ఇట్టి వేదాలను బౌద్ధులు, చార్వాకులు 'ప్రమాణాలు కావు' అన్నారు. మఱికొందరు ఈ విశ్వానికి ప్రభువేలేడు– అన్నారు. వీరే సాంఖ్యులు– కాపిలులు. వీరి మతమందు–

"మూల ప్రకృతి రవికృతిః, మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త।
షోడశ కశ్చ వికారో నప్రకృతిః నవికృతిః పురుషః॥"

(సాంఖ్యశాస్త్ర కారిక.)

1) కేవల ప్రకృతి రూపం. 2) కేవలం వికృతి రూపం. 3) ప్రకృతి మఱియు వికృతి రూపం. 4) వీటికి భిన్నమైనది అని పదార్థాలు నాలుగు విధాలుగా విభజింపబడినాయి.

జగన్నిర్మాణం చేయునట్టిది, సత్త్వరజస్తమోగుణాలు సమాన దశలో నున్న రూపమే మూల ప్రకృతి. "ప్రకర్షేణ కరోతీతి ప్రకృతిః" అని వ్యుత్పత్తి. మూల ప్రకృతినే 'ప్రధానం' అంటారు. 'అవికృతి' అంటే ఒకదానినుంచి ఉత్పన్నం కాదు.

మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు (7) ప్రకృతి మఱియు వికృతి రూపాలుగా అవుతున్నాయి. పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు (16) వికారాలే అవుతున్నాయి. పురుషుడు ప్రకృతి రూపుడు కాడు. వికృతిరూపుడూ కాడు. ప్రకృతి వికృతిరూపుడునూ కాజాలడు. ఇట్లు (7+16) ఇరవై మూడు తత్త్వాలతో ప్రకృతి పురుషులు కలిసి, మొత్తం (25) తత్త్వాలు. సాంఖ్యులు వేదాలను ప్రమాణంగా అంగీకరించారు. కాని ఈశ్వరుని అంగీకరించలేదు.

కర్మను మించిన దైవం లేదన్నది మీమాంసకమతం. కాణాదులు అనుమాన ప్రమాణంచేత మాత్రమే ఈశ్వరతత్త్వం తెలుసుకోదగినది అంటూ, ఈశ్వరుని నిజస్థితిని పూర్తిగా తెలుసుకొనలేని వారు. ఇక, కల్యాణ గుణాలు కల భగవంతుణ్ని గుణ దరిద్రుడన్నవారు మాయావాదులు.

పరబ్రహ్మ స్వభావంచేత నిర్గుణుడే, కాని అవిద్యా వాసనవల్ల సగుణ స్వరూపునిగా భావింపబడుతున్నారని అద్వైతులు; శైవులు త్రిమూర్తులకు అతీతుడైన ఒక భిక్షుకుణ్ని ప్రభువుగా అంగీకరించారు. సదాశివుడే పరతత్త్వమన్నారు. కర్మకు వశుడైన సదాశివుడు– స్వోదరపూరణమందును అశక్తుడైన ఒక భిక్షువు– పరతత్త్వం కాజాలడు– అన్నది విశిష్టాద్వైత సిద్ధాంతం.

జ్ఞానం లేనందున ఈ జడులు ఎవరికి తోచిన రీతిగా వారు, పరబ్రహ్మ తత్త్వాన్ని నిరూపించడానికి (తలాతలి) నేలను చేతులతో మోదుతూ వాద యుద్ధం చేస్తున్నారని సుస్పష్టం.

తలైశ్చ తలైశ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవర్తతే– ఇతి= తలాతలి. కేశాకేశి, ముష్టాముష్టి వలె 'తలాతలి' పదం భాసిస్తుంది.

లక్ష్మీదేవిని ఏ జన్మలోనూ సేవించనివారు కాబట్టి ఈ జడులకు వాదులాడుకొనే స్థితి ఏర్పడింది. అభిప్రాయ భేదం ఉన్నంత మాత్రాన అన్యోన్యంగా వాదులాడుకోవడం– జగడమాడడం సముచితం కాదని భట్టర్ వారు ఒక 'చురక' పెట్టినారు.

స్రగ్ధరావృత్తం. మ ర భ న య య య - గణాలు కలది.

"మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిముని యతియుతా స్రగ్ధరాకీర్తితేయమ్॥"

12. *మనసి విలసతాక్ష్ణా భక్తి సిద్ధాంజనేన*
*శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్ష మాణాః*
*నిధిమివ మహిమానం భుంజతే యేఽపిధన్యాః*
*నను భగవతి! దైవీం సంపదం తేఽభి జాతాః॥*

**అర్థం:** హే భగవతి= సకలగుణ సంపన్నవైన; నను లక్ష్మి!= ఓ లక్ష్మీదేవీ!; ధన్యాః= భాగ్యం కలవారు; యే, అపి= ఎవరైతే; భక్తి సిద్ధాంజనేన= భక్తి అనే సిద్ధాంజనం చేత; మనసి= మనస్సునందు; విలసతా= ప్రకాశిస్తున్న; అక్ష్ణా= కంటితో; శ్రుతిశిరసి= వేదాంతమందు; నిగూఢం= దాచబడిన; నిధిం, ఇవ= నిధినివలె; తే= నీ యొక్క; మహిమానం= మహిమను; వీక్షమాణాః= చూస్తున్నవారై; భుంజతే= అనుభవిస్తున్నారో; తే= వారు; దైవీం, సంపదం, అభి= దైవీ సంపదయైన మోక్షానికి అభిముఖులై; జాతాః= ఉన్నారు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ కటాక్షం పొందినవారే భాగ్యవంతులు. సిద్ధులు చేసిన కాటుకను కన్నుల కంటించుకొని పర్వత శిఖరమందు దాచబడిన నిధిని తెలుసుకొని, కొందఱు అదృష్టవంతులు వినియోగించుకొంటారు. భాగ్యవంతులే భక్తి అనే సిద్ధాంజనాన్ని అంటించుకొన్న జ్ఞాన నేత్రంతో ఉపనిషత్తుల్లో రహస్యంగా ఉన్న నీ మహిమను తెలుసుకొని అనుసంధానం చేస్తూ, మోక్షం పొందడానికే పుట్టినవారుగా పరిగణింపబడుతున్నారు.

**వ్యాఖ్య:** లక్ష్మీకటాక్షం పొందనివారు పరస్పరం వాదులాడుకొని ప్రతిహతులౌతారని గత శ్లోకం వివరిస్తే, జగన్మాత మహిమను భాగ్యవంతులే అనుభవిస్తారని ఈ శ్లోకం వివరిస్తున్నది.

పర్వత శిఖరాలపై ధనం-నిధి- నిక్షిప్తమై యుంటుందని ప్రసిద్ధి. ఆ నిధిని పొందడానికి కొందఱు సిద్ధులు చేసిన కాటుకను కన్నులకు పెట్టుకొని, తెలుసుకొన్న

తర్వాత ధనంగా వినియోగించుకొంటారు. ఇది లౌకికం. ఇక పారమార్థిక విషయం చూద్దాం. లక్ష్మీదేవి యొక్క స్వరూప రూపగుణ విభూతియే– మహిమయే ఒక నిధి. ఆ నిధిని– మహిమను తెలుసుకొని అనుభవించ దలచినవారు ఎంతో భాగ్యవంతులు కదా! పూర్వజన్మ సుకృతం, ఆచార్య సమాశ్రయణం, లక్ష్మీ నారాయణుల కటాక్షం కలిగి యుంటేగానీ ఆ దైవీ సంపదను అనుభవించలేరు.

"తద్యథా హిరణ్య నిధిం నిహిత మక్షేత్రజ్ఞాః
ఉపర్యు పరిసంచరంతో నవిందేయుః"– (ఛాం. ఉపనిషత్తు)

బంగారు నిధి క్షేత్రంలోనే యున్నది. క్షేత్రజ్ఞులు– చైతన్యవంతులు కానివారు ఆ నిధిని పైపైన సంచరిస్తున్న వారైనను పొందజాలకున్నారు– అని ఉపనిషద్వాక్యార్థం.

భక్తి అనే సిద్ధాంజనాన్ని మనో నేత్రానికి అంటించుకొని చూస్తే కాని లక్ష్మీస్వరూపం తెలియదు కదా! వేదాంతంలో భక్తిలేనివారి చెవిలో పడకుండా, రహస్యంగా ఉపదేశింపబడే, దైవీ సంపదను పొందిన మహిమ కలవారే మోక్ష ఫలానుభవంకోసమే పుట్టినవారుగా భావింపబడుతున్నారని సారార్థం.

మాలినీవృత్తం– ' న న మ య య' యుతేయం మాలినీ భోగిలోకైః"

13. 'అస్యేశానా జగత' ఇతితేऽధీమహేయాం సమృద్ధిం
శ్రీః శ్రీసూక్తం బహుముఖయతే తాంచశాఖాను శాఖమ్।
ఈష్టే కశ్చిత్ జగత ఇతియః పౌరుషే సూక్త ఉక్తః
తం చత్వత్కం పతి మధిజగా వుత్తరశ్చాను వాకః॥

**అర్థం:** హే శ్రీః! = ఓ లక్ష్మీదేవి!; అస్య= ఈ; జగతః= ప్రపంచానికి; ఈశానా= అధీశురాలు; ఇతి= అని; తే= నీ యొక్క; యాం= ఏ; సమృద్ధిం= ఐశ్వర్యాన్ని; అధీమహే= అధ్యయనం చేస్తున్నామో; తాం, చ= దాన్నీ, దానికంటె మించిన ఐశ్వర్యాన్ని కూడా; శ్రీసూక్తం= శ్రీసూక్తం; శాఖానుశాఖం= శాఖోపశాఖలుగా– సంపూర్ణంగా;

బహుముఖయతే= అనేక విధాలా ప్రతిపాదిస్తున్నది; పౌరుషే, సూక్తే= పురుషసూక్త మందు కశ్చిత్= ఒకానొక పురుషుడు; జగతః= జగత్తును; ఈష్టే= నియమిస్తున్నాడు; ఇతి= అని; యః= ఎవడు; ఉక్తః= చెప్పబడినాడో; తం, చ= ఆతనిని (విష్ణువును) కూడా; ఉత్తరః, అనువాకః, చ= రెండవ అనువాకం కూడా; త్వత్కం= నీకు సంబంధించిన; పతిం= భర్తనుగా; అధిజగౌ= బాగా గానం చేసెను.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఈ ప్రపంచానికి నీవే ఈశ్వరివి, అని సంపూర్ణంగా నీ యొక్క సమృద్ధినీ శ్రీసూక్తం వర్ణిస్తున్నది. అట్లే, అద్వితీయుడైన ఒకడు ఈ జగత్తుకు ప్రభువు, అని పురుషసూక్తంలోని పూర్వభాగం వర్ణిస్తుంటే, ఆ సూక్తమందలి ఉత్తర భాగం మాత్రం, ఆ పురుషుడు (విష్ణువు) నీ భర్తగానూ, శ్రీ సూక్తమందునూ నీ మాహాత్మ్యమే వర్ణింపబడింది.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి 'విశ్వాధీశ ప్రణయిని' అని వేదాలు బహుముఖాలుగా ప్రతిపాదిస్తున్నాయి- అని సుశ్లోకితం.

*"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"*- (4-4-37). 'ఈ విశ్వానికంతటికీ అధీశ్వరి విష్ణుపత్నియే' అని కృష్ణయజుర్వేద వాక్యం విశదపరుస్తున్నది. పురుష సూక్తం నాలుగు వేదాలలోనూ పాఠభేదాలతో నుండడంవల్ల "వేదేషు పౌరుషం సూక్తం" అని ప్రసిద్ధిని పొందింది. ఆ పురుష సూక్తంలోని మొదటి భాగమందు శ్రీమహావిష్ణువునే విరాట్పురుషునిగా- "పురుష ఏ వేదం సర్వం" - "ఉతామృతత్త్వస్యే శానః"- అని వర్ణించి, ఇక రెండవ భాగమైన "అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ" - అనే అనువాకమందలి చివరలో "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ"- అని లక్ష్మీదేవి విష్ణుపత్నిగా వర్ణింప బడింది.

శ్రీసూక్తం ఋగ్వేదంలోని ఖిలసూక్తాలలో పదకొండవ సూక్తంగా ఉన్నది. 'ఒక వేదశాఖాధ్యేత అవసరాన్ని బట్టి మరొక వేదశాఖలోని సూక్తాన్ని గ్రహించి చదివితే, అది ఖిలసూక్తం' అనబడుతున్నది. (పరశాఖీయం స్వశాఖాయాం అపేక్షా వశాత్ పఠ్యతే తత్ ఖిలముచ్యతే) (భా-శాంతి పర్వం).

"యాచసా జగతాం యో నిర్లక్ష్మీ స్తద్ధర్మ ధర్మిణీ।
భగవాన్ వాసుదేవోసా; అద్యయా ప్రతిపాద్యతే॥"

జగత్తుకు జననియై వాసుదేవుని ధర్మ స్వరూపానికి ధర్మపత్నియై లక్ష్మీదేవి మొదటి మంత్రాలతోనే ప్రతిపాదింపబడిందని ఆగమాలు తెల్పుతున్నాయి. శ్రీసూక్తం శ్రీదేవియొక్క వైభవాన్ని పలురకాల ప్రకటిస్తున్నది.

హిరణ్య వర్ణా- బంగారంలాగా పచ్చగా ప్రకాశించే వర్ణం కలది.

హరిణీ- బంగారు ప్రతిమవలె ఔజ్జ్వల్యం, లావణ్యం కలది. 'హరిం నయతి చేత నాన్ ఇతి= హరిణీ- జీవాత్మలు హరియొక్క ఆశ్రయాన్ని పొందునట్లు చేయునట్టిది లక్ష్మీదేవి.

దేవజుష్టా- విష్ణుదేవుని మీదనున్న ప్రీతితో ఆయనను ఆశ్రయించినది. "జుషప్రీతి సేవనయోః"- అని ఉభయత్ర ధాతుః. కాబట్టి బ్రహ్మాది దేవతలచేత ఆశ్రయింపబడునది లక్ష్మీదేవి. ఒకటేమిటి? శ్రీసూక్తం శ్రీదేవి సమృద్ధిని వేయి రకాల కీర్తించింది.

పురుషసూక్తంలో 15 ఋక్కులను, శ్రీసూక్తంలోనూ ఉన్న 15 ఋక్కులతో కలిపి, సంపుటీకరణ విధానంతో శ్రీశ్రియః పతులను ఉపాసించినట్లైతే, వారి కృపకు శీఘ్రంగా పాత్రులవుతారు.

ఈ శ్లోకంలో, 'జగతః ఈష్టే' అన్నచోట 'జగతః' అని 'కర్మణి షష్ఠీ'- జగత్తును శాసించువాడు- అని అర్థం. ('ఈశ-ఐశ్వర్యే' ఇత్యస్మాద్ధాతోః అదాదికాచ్ఛ పోలుకి లటస్తజితకారస్య ఏత్వే 'వ్రశ్చ' ఇతి షత్వే ష్టుత్వేచ 'ఈష్టే' ఇతి రూపమ్) "ఈశ్వరీం సర్వభూతానాం"- (శ్రీసూక్తం) సర్వభూతేశ్వరి శ్రీదేవి- అని అర్థం. శ్రీదేవి వల్ల శ్రియఃపతి కీర్తింపబడుతున్నాడు.

(త్వత్కం పతి మధిజగౌ- తావకం పతిం అధికం గాయతిస్మ) "శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"- అన్న శ్రుతివాక్యం (శ్రద్ధా అంటే లక్ష్మీదేవి). లక్ష్మీదేవి చేతనే లక్ష్మీపతి దేవత్వాన్ని పొందుతున్నాడని, లక్ష్మీదేవి యొక్క సమృద్ధినీ, జగదధీశ్వరత్వాన్నీ వర్ణిస్తున్నది. మందాక్రాంతా వృత్తం.

14. ఉద్బాహుస్త్వా ముపనిషదసావాహనైకా నియంత్రీం
శ్రీమద్రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే।
స్మర్తారోఽ స్మజ్జనని! యతమే సేతిహాసైః పురాణైః
నిన్యు ర్వేదానపిచ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్॥

**అర్థం:** హే అస్మత్ జనని= మాకు తల్లివైన ఓ లక్ష్మీదేవీ!; అసౌ= ఈ, ఉపనిషత్= ఉపనిషత్సముదాయం; ఏకా= ఒక్కటే; ఉద్బాహుః= చేతులెత్తి; త్వాం= నిన్ను; నియంత్రీం= జగన్నియామకురాలుగా; న, ఆహ= చెప్పలేదు; శ్రీమద్రామాయణం, అపి= శ్రీమద్రామాయణం కూడా; త్వత్, చరిత్రే= నీ యొక్క చరిత్రయందు; పరం= అధికంగా; ప్రాణితి= జీవిస్తున్నది; యతమే= ఎవరైతే; స్మర్తారః = స్మృతికర్తలో; తతమే, అపి, చ= వారు కూడా; వేదాన్= వేదాలను; స+ఇతిహాసైః = ఇతిహాసాలతో కూడిన; పురాణైః= పురాణాలతో; త్వత్+మహిమ్ని= నీ మహిమను ప్రతిపాదించడమందు; ప్రమాణం= ప్రమాణమైన వాటినిగా; నిన్యుః= పొందించారు.

**తా॥** ఓ జననీ! నీవు జగదీశ్వరివని ఉపనిషద్వర్గమొకటి మాత్రమే చేతులెత్తి స్పష్టంగా చెబుతున్నదనుకోవద్దు, శ్రీమద్రామాయణం కూడా నీ చరిత్రవల్లనే ప్రఖ్యాతిని పొంది జీవిస్తున్నది. స్మృతి ప్రణేతలైన పరాశరాది మహర్షులెవరైతే కలరో వారు కూడా, భారతాది ఇతిహాసాల ద్వారా, శ్రీవిష్ణుపురాణాదుల ద్వారా వేదాలను నీ వైభవాన్ని తెలుపడంలో ప్రమాణాలైన వాటినిగా ప్రదర్శించారు.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవియొక్క మహిమను వేదాలు ప్రతిపాదించగా, స్మృతీతిహాస పురాణాలు బలపరచినవని వర్ణితం.

శ్రీదేవి 'జగదీశ్వరి, విశ్వమాత' అనే అంశం సత్యం అని వేదం చేయెత్తి స్పష్టంగా ప్రతిపాదించగా, వేదప్రమాణాన్ని స్మృతీతిహాస పురాణాలు విశేషంగా సమర్థించాయి. శ్రీమద్రామాయణమంటే "సీతాయాశ్చరితం మహత్"- సీతాదేవి యొక్క గొప్ప చరిత్ర- అని వాల్మీకి మహర్షి పేర్కొన్నాడు. శ్రీ పరాశర మహర్షి "రాఘవత్వేఽ భవత్సీతా" విష్ణుమూర్తి శ్రీరాముడై అవతరించగా లక్ష్మీదేవియే

సీతగా ఉద్భవించిందన్నాడు. రామాయణానికి జీవనాడి సీతాచరిత్ర. గుణాలే ప్రధానం కాబట్టి సీతమ్మ యొక్క చరిత్ర ద్వారా లక్ష్మీగుణాల వైభవాన్ని వాల్మీకి వర్ణించాడు. ముఖ్యంగా కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనే గుణత్రయం సీతయొక్క మహిమను చాటుతున్నది.

1) కృప:- సీతమ్మను హింసించిన రాక్షస స్త్రీలను చంపుతానన్న హనుమంతునితో ఆమె ఇలా అన్నది:-

*"పాపానాం వాశుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!*
*కార్యం కరుణ మార్యేణ, నకశ్చిన్నాపరాధ్యతి॥"*

'ఓ మారుతీ! పాపాత్ముల పట్లగానీ, పుణ్యాత్ముల పట్లగానీ సజ్జనుడు, చంపదగినవారి విషయంలోనైనా దయను చూపవలెను. తప్పు చేయనివాడు ఉండడు కదా!' (రా.యు.కాం.) తనను హింసించిన వారిని కూడా శిక్షించక, కరుణించవలెనని ఉపదేశించడంవల్ల సీతాదేవి తన కృపను ప్రకాశింపజేసింది. మూర్తీభవించిన కరుణయే లక్ష్మీదేవి- అన్నారు పూర్వాచార్యులు.

2) పారతంత్ర్యం:- తనకు శక్తియున్ననూ స్వతంత్రించకుండడం.

*"అసందేశాత్తు రామస్య తప సశ్చానుపాలనాత్।*
*నత్వాంకుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా॥"* (రా.సుం.కాం.)

ఓ దశకంఠా! రావణా! నీవు బూడిదగా చేయతగినవాడవే. అయినా, నాకు రాముని ఆజ్ఞలేనందువల్లనూ, నేను నా తపస్సును కాపాడుకోవలసి యున్నందు వల్లనూ, నిన్ను నేను భస్మం చేయకున్నాను- అని సీతమ్మ తాను తన పతియొక్క అధీనమందే ఉన్న లక్షణాన్ని ప్రకటించింది.

3) అనన్యార్హత్వం:- స్వామికి మాత్రమే యోగ్యురాలను అనే భావంతో ఉండడం.

*"అహమౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః।*
*వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః॥"* (రా.సుం.)

'బ్రహ్మచర్యాశ్రమంలో వేదాధ్యయనం చేయడానికి వ్రతాన్ని పూర్తిచేసుకొన్న విప్రునికే వేదవిద్య తగియున్నట్లు, సార్వభౌముడైన శ్రీరామునికి మాత్రమే భార్యగా ఉండే అర్హత కలదానను' అని వెల్లడించింది. సీతమ్మ చరిత్రలో లక్ష్మీగుణ వైభవం నిరూపింపబడిందని భావం.

అందుకే 'పరంప్రాణితి'- అంటే శ్రీమద్రామాయణానికి సీతమ్మ చరిత్రవల్లనే ఎక్కువ ప్రసిద్ధి కల్గినది- అని తెల్పబడింది.

(ప్రపూర్వాత్ 'అనప్రాణనే' ఇత్యస్మాద్ధాతోః 'రుదాదిభ్యః సార్వధాతుకే' ఇతి ఇటిణత్వేచ కృతే 'ప్రాణితి' ఇతిరూపమ్.

యతమే, తతమే:-యత్తచ్ఛబ్దౌ 'డతమచ్' ప్రత్యయాంతౌ సర్వనామ సంజ్ఞౌః)

శ్రుతి స్మృతీతిహాస పురాణాలన్నిటియందు లక్ష్మీ గుణవైభవమే వర్ణింపబడి యున్నదని సారార్థం.

మందాక్రాంతావృత్తం. మ భ న త త గ గ - గణాలు కలది.

*15. ఆ కుగ్రామ నియామకాదపి విభోరా సర్వనిర్వాహకాత్*
*ఐశ్వర్యం యది హోత్తరోత్తరగుణం శ్రీరంగ భర్తుః ప్రియే।*
*తుంగం మంగళముజ్వలం గరిమవత్పుణ్యం పునః పావనం*
*ధన్యం యత్తదదశ్చ వీక్షణ భువస్తే పంచషా విప్రుషః॥*

**అర్థం:** శ్రీరంగభర్తుః= శ్రీరంగనాథుని యొక్క; ప్రియే= ప్రియురాలవైన ఓ లక్ష్మీదేవీ!; ఆ కుగ్రామ నియామకాత్= చిన్న గ్రామంయొక్క అధిపతి మొదల్కొని; సర్వనిర్వాహకాత్= సర్వలోక నియంతయైన; ఆ విభోః= బ్రహ్మదేవుని వరకు; ఉత్తరోత్తర గుణం= ఒకదానికంటె మరొకటి గొప్పగా నున్నట్టి; యత్, ఐశ్వర్యం= ఏ ఐశ్వర్యం కలదో; తత్= ఆ ఐశ్వర్యం కూడా; తుంగం= ఉన్నతమైనదియు; గరిమవత్= గొప్పతనం కలదియు; పుణ్యం= పవిత్రమైనదియు; పునః= మఱియు; పావనం= పవిత్రం చేయునదియు; ధన్యం= అదృష్టహేతువైనదియు; యత్= ఏ ఐశ్వర్యం కలదో; అదః,

చ= ఈ ఐశ్వర్యం కూడా; తే= నీ యొక్క; వీక్షణ భువః= చూపులలో పొటమరించినట్టి; పంచషాః= ఐదు లేక ఆరు; విప్రుషః= బిందువులు మాత్రమే.

**తా॥** శ్రీరంగనాథుని ప్రియురాలవైన ఓ లక్ష్మీదేవీ! చిన్న గ్రామాధికారి నుంచి బ్రహ్మదేవుని వరకున్న ప్రతివ్యక్తి యొక్క ఆధిపత్యరూపమైన ఐశ్వర్యమూ, ఇంక ఈ సృష్టిలో విస్తారంగా కనిపించే ఎత్తైన మేరు, హిమవత్, మందరాది పర్వతాలు, మంగళకర వస్తువులును, ప్రకాశించే పదార్థాలును, చేతనైశ్వర్యమును, అచేతనైశ్వర్యమును, ఇంక వేరే ఉన్న ఐశ్వర్యము కూడా, నీ కడగంటి చూపులు అనే ఐదారు అమృత బిందువుల వలన ఉద్భవించినవే.

**వ్యాఖ్య:** సృష్టిలోని అన్ని విధాలా కనబడే ఐశ్వర్యమంతా లక్ష్మీదేవి కటాక్షం వల్ల కలిగినదని సుశ్లోకితం.

ఐశ్వర్యం అంటే ఈశ్వరత్వం- ప్రతి వ్యక్తికి ఉండే కొద్ది, గొప్ప అధికారం. ఇది చేతనైశ్వర్యమనబడును. ఒకదానికంటె మఱొక వస్తువు శ్రేష్ఠమై యుండే ఐశ్వర్యం అచేతనైశ్వర్య మనబడును.

ఒక చిన్నగ్రామానికి అధిపతి కావడానికీ, ప్రపంచానికీ ప్రభువుగా నుండ డానికీ లక్ష్మీదేవియొక్క కటాక్షలేశమే కారణం. జగమంతా జగజగ మెరయడానికి హేతువు.

తుంగం = ఎత్తైన వనస్పతులు- వృక్షజాలం.

మంగళం = చందన కుసుమాది వస్తువులు, ధాన్యాదులు.

ఉజ్జ్వలం = సూర్య, చంద్ర, నక్షత్రాదులు.

గరిమవత్ = మేరు, మందర, హిమవత్పర్వతాదులు.

పుణ్యం = పరలోక సాధకాలైన పవిత్ర యజ్ఞాదులు.

పావనం = పాపరాశిని కడిగి, పవిత్రంచేసే మహానదీ నదాలు.

ధన్యం = వజ్ర, వైడూర్యాదులు- నవనిధులు, గజాంతైశ్వర్యం.

చకారంవల్ల - ఈ రెండు రకాలుగానుండే ఐశ్వర్యాలకంటెను వేరైన ఐశ్వర్యమని అర్థం.

ఆధిపత్య రూపమైన, సంపద్రూపమైన ఐశ్వర్యమూ, ఈ రెండింటికీ భిన్నమైన చైతన్య కళ కూడా లక్ష్మీదేవి దయతో చూచే చూపులలో పొటమరించిన ఐదారు అమృత బిందువుల సేచన మాత్రం చేతనే జనించడంవల్ల ప్రపంచం రమణీయంగా కనబడుతున్నది. ఇదంతా లక్ష్మీకళయే కదా!

(పంచషాః= పంచవాషడ్వా మానం యేషాంతే-పంచషాః.

"సంఖ్యావ్యయేతి" సూత్రేణ బహువ్రీహి సమాసే "బహువ్రీవశా సంఖ్యేయే" ఇత్యాది సూత్రేణ "డచి" "టేః" ఇతి టి లోపే పంచషా ఇతి రూపమ్॥)

శార్దూల విక్రీడిత వృత్తం.

16. *ఏకోముక్తాత పత్రప్రచలమణి ఘణాత్కారి మౌళిర్మనుష్యో*
*దృప్యద్దంతావళస్థో న గణయతి నతాన్ యత్ క్షణం క్షోణిపాలాన్।*
*యత్తస్మైతిష్ఠతేఽన్యః కృపణమశరణో దర్శయన్ దంతపంక్తిం*
*తత్తే శ్రీరంగరాజ ప్రణయిని! నయనోదంచిత న్యంచితాభ్యామ్॥*

**అర్థం:** హే శ్రీరంగరాజ ప్రణయిని= శ్రీరంగనాథుని ప్రియురాలవైన ఓ లక్ష్మీదేవీ!; ఏకః= ఒక; మనుష్యః= మనుష్యుడు; దృప్యత్ దంతావళ స్థః= మదించిన ఏనుగుపైన కూర్చున్నవాడై; ముక్తాతపత్ర-మౌళిః/ ముక్తాతపత్ర= ముత్యాల గొడుగు నందు; ప్రచల= బాగా కదులుతున్న; మణిఘణాత్కారి= మణుల ఘట్టనంచేత ధ్వని చేయబడుతున్న; మౌళిః= తలయందున్న కిరీటం కలవాడై; నతాన్= నమస్కరించిన; క్షోణిపాలాన్= సామంతరాజులను; న, గణయతి= లెక్కచేయడు; ఇతి, యత్= అనుమాట ఏదైతే కలదో; తత్= ఆ విషయం; అన్యః= మఱియొక మనుష్యుడు; అశరణః (సన్)= దిక్కులేనివాడై; కృపణం= దైన్యాన్ని వ్యక్తం చేస్తూ- జాలికలుగునట్లుగా; తస్మై= ఆ ఏనుగుపైనున్న చక్రవర్తి కోసం; దంతపంక్తిం= దంతాల వరుసను; దర్శయన్= చూపుతూ (పండ్లికిలిస్తూ); తిష్ఠతే= (యాచక ముద్రతో) నిలిచియుండును; ఇతియత్= అనే మాట ఏదైతే కలదో; తత్= ఆ విషయం (ఆ చక్రవర్తిత్వం, ఈ

దీనత్వం కూడా); తే= నీ యొక్క; నయన+ఉదంచిత, న్యంచితాభ్యాం= కన్నులను తెరవడం, మూయడం వలన కలుగుతున్నవి.

**తా॥** ఓ శ్రీరంగనాయకీ! నీవు నీ కన్నులను తెరచి చూడడంవల్ల, చూడబడిన వ్యక్తి మదించిన గజంపైన ముత్యాల గొడుగు క్రింద కూర్చుండి కదలుతున్న మణుల రాపిడిచే ఘణఘణమని ధ్వనిస్తున్న కిరీటం కలవాడై, వంగి వంగి నమస్కరించిన సామంతరాజులను లక్ష్యపెట్టడు. అలాగే నీవు నీ కన్నులతో చూడని వ్యక్తి గర్భదరిద్రుడై ఆ మదగజంపైన కూర్చొని యున్న చక్రవర్తి యెదుటనే తన దైన్యాన్ని తెల్పుతూ జాలికలుగునట్లుగా పండ్లికిలిస్తూ యాచనతో జీవిస్తుంటాడు. ఇట్టి స్థితికి నీ అనుగ్రహ, నిగ్రహాలే కారణం కదా! తల్లీ! అని తాత్పర్యం.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి కటాక్షించడంవల్ల ఒకడు చక్రవర్తి కావడానికి, మరొక మనుజుడు ఆమె కటాక్షింపనందువల్ల గర్భదరిద్రుడు కావడానికి కారణాలు అని సుశ్లోకితం.

అధిక సంపదను కలిగియుంటే 'ఏనుగు పాడి' అంటారు. ఏనుగును పోషించగలిగినంత ఐశ్వర్యం కలిగియుండడం. ఈ స్థితిని 'గజాంతైశ్వర్యం' అని కూడా వ్యవహరిస్తుంది లోకం.

అన్నిటికంటె నీచవృత్తి 'యాచకవృత్తి'. లోకంలో తేలికగా నుండేది దూది. ఆ దూదికంటెను చాలా తేలికగా– చులకనగా ఉండేది యాచన చేస్తూ జీవించడమే. ఈ గర్భదారిద్ర్యం పూర్వజన్మలో ఒకరికైనా దానం చేయనందువల్ల, కనీసం ఒక విత్తునైనను నేలలో నాటకపోవడంవల్ల కలుగుతుంది.

*"ద్వారం ద్వారమటన్ భిక్షుః శిక్షిత్వేవన యాచతే।*
*అదత్వా మాదృశోఽభూః, దత్వాత్వం తాదృశో భవ॥"*

ప్రతి గృహప్రాంగణంలో నిల్చి 'భిక్షపెట్టండి' అంటూ బిచ్చగాడు 'ఏ జన్మలోనూ నేను దానం చేయనందువల్ల ఇలా దరిద్రుడనయ్యాను. నీవు నావలె కాకుండా ఉన్నంతలోనే కొంత దానం చేసి నీవు నీవలె ధనవంతునిగా ఉండు' మంటాడట.

ఏకః– అందఱు మనుష్యులే, అయినా ఒకడు చక్రవర్తియై మదగజంపైన అధిష్ఠుడై యుండడం అతని అదృష్టమనే భావన వ్యక్తమవుతున్నది. అతనికి ఐశ్వర్యంతో పాటు, గర్వం కూడా ఉండడం రాజసం ద్యోతకమవుతున్నది. రాజులను లెక్కచేయకపోవడం అతని తామసగుణాన్ని ప్రకటిస్తున్నది.

మరొకడు గర్భదరిద్రుడై ఆ చక్రవర్తి ముందు దంతపంక్తిని చూపుతూ నిల్చియుండడం అతని అశక్తతకు నిదర్శనం. ఐశ్వర్య పరాకాష్ఠకు కారణం లక్ష్మీదేవి యొక్క నయనోదంచితం– కటాక్ష వీక్షణ విస్తృతి. దారిద్ర్య పరాకాష్ఠకు హేతువు ఆమె యొక్క నయన న్యంచితం– కటాక్ష వీక్షణ సంకోచమే.

ఒకడు మహాధనికుడుగానూ, మరొకడు పరమ దరిద్రుడుగానూ ఉండడం, వారి వారి కర్మలకు అనుగుణమని శాస్త్రాలు ఘోషిస్తుండగా, ఇక్కడ లక్ష్మీదేవి యొక్క నయనోదంచిత న్యంచితాల వల్లనే కల్గుతున్నవి అనడం ఎట్లు పొసగును; అంటే, లక్ష్మియొక్క కనుబొమల కదలికలలోని భేదాలు, నయనోదంచిత న్యంచితాలు కూడా వారి వారి కర్మలకు అనుగుణంగానే సంభవిస్తాయి.

స్రగ్ధరావృత్తం– మ ర భ న య య య– గణాలు కలది.

17. *రతిర్మతి సరస్వతీ ధృతి సమృద్ధి సిద్ధిశ్రియః*
*సుధాసఖి! యతోముఖం విచలిషేత్ తవభ్రూలతా౹*
*తతో ముఖ మథేందిరే! బహుముఖీ మహం పూర్వికాం*
*విగాహ్యాచ వశంవదాః పరివహంతి కూలంకషాః౹౹*

**అర్థం:** సుధాసఖి= అమృత సహోదరియైన; హే ఇందిరే= ఓ లక్ష్మీదేవీ!; తవ= నీ యొక్క; భ్రూలతా= (తీగెలవంటి కనుబొమ్మలు) కనుబొమ్మలు అనే తీగ; యతోముఖం= ఎవనివైపు; విచలిషేత్= చలింపగోరునో; తతోముఖం= ఆ వ్యక్తి వైపే; అథ= సాకల్యంగా; రతిః= ప్రీతి; మతి–శ్రియః/ మతి= జ్ఞానం; సరస్వతీ= విద్య (వాక్కు); ధృతి= ధైర్యం; సమృద్ధి= పరిపూర్తి; సిద్ధిః= కార్యసిద్ధి; శ్రియః= సంపత్తు– (ఇవి అన్నీ); బహుముఖీం= అనేక విధాలుగా; అహం పూర్వికాం= నేను ముందు,

నేనే ముందు అనే పరస్పర స్పర్థను; విగాహ్య= పొంది; వశంవదాః= (అతనికి) లోబడినవై; కూలంకషాః= దరులను ఒరయుచున్నవై; పరివహంతి= సంపూర్ణంగా ప్రవహిస్తున్నవి.

**తా॥** ఓ శ్రీరంగనాయకీ! నీ భ్రూలత ఏ వ్యక్తివైపు పయనింపగోరునో ఆ వ్యక్తి రతిర్మతి సరస్వత్యాదులను సంపూర్ణంగా పొంది ప్రకాశిస్తుంటాడు.

**వ్యాఖ్య:** సకల సంపదలు లక్ష్మీదేవియొక్క భ్రూభంగ విలాసానికి అధీనమైనవే- అని సుశ్లోకితం.

*"సశ్లాఘ్యః సగుణీ ధన్యః సకులీనః స బుద్ధిమాన్।*
*సవూరః స చ విక్రాంతోయం త్వందేవి! నిరీక్షసే॥"* (వి.పు.)

ఓ లక్ష్మీదేవీ! నీవు ఎవరిని కటాక్షిస్తావో, అతడే పొగడదగినవాడు. అతడే గుణవంతుడు, ధన్యుడు, అతడే మంచి వంశంలో పుట్టినవాడు, బుద్ధిమంతుడు, శూరుడు, విక్రమం కలవాడు- అని శ్రీ పరాశర మహర్షి చెప్పిన ఈ ప్రామాణిక శ్లోక భావమే శ్రీ పరాశర భట్టర్ వారిచేత వివరింపబడుతున్నది.

*"యస్యాం యస్యాం దిశివిహరతే దేవి! దృష్టి స్త్వదీయా।*
*తస్యాంతస్యామహ మహమికాం తన్వతే సంపదోఘాః॥"* (శ్రీస్తుతి. 15)

ఓ లక్ష్మీదేవీ! నీ కటాక్ష వీక్షణం ఏ యే దిక్కున ప్రసరిస్తుంటే, ఆయా దిక్కుకు సంపదలు నేను ముందు, నేనే ముందు అని పోటీ పడుతూ ప్రవహిస్తుంటాయి- అని వేదాంత దేశికులు స్తుతించారు.

సుధా సఖి- అమృతం పుట్టిన క్షీరాబ్ధినుంచి లక్ష్మీదేవి ఉద్భవించింది. కాబట్టి అమృతంవలె మధురమైనదై జగత్తుకు చైతన్యాన్ని కల్పిస్తున్న ఓ లక్ష్మీదేవీ! అనే అర్థం కలిగియున్న పదమిది.

లక్ష్మియొక్క భ్రూలతకు స్పందించాలనే కోరిక కలిగినంత మాత్రాననే సమస్త వస్తువుల పరిపూర్ణత సిద్ధిస్తుంటే, ఇక వాస్తవంగానే స్పందిస్తే ఆ వ్యక్తి యొక్క సమృద్ధిని గూర్చి చెప్పనక్కర లేదు కదా!

లక్ష్మిని "శీదైక్కడలుళ్ అముదు" (1-2-1) "చల్లని సముద్రంలోని అమృతం"- అన్నారు పైరియాళ్వార్లు.

"విణ్ణవర్ అముదుణ్ణ అదిల్ వరుమ్ పెణ్ణముదుణ్ణ ఎంబెరు మానే"- దేవతలు అమృతాన్ని భుజిస్తే, అమృతం పుట్టిన చోటు నుంచి వచ్చినట్టి లక్ష్మి అనే అమృతాన్ని పొందిన ఓ స్వామీ! అని వర్ణితం. దేవతలు పొందినది బాహ్యమైన అమృతం. సర్వేశ్వరుడు పొందిన ఇందిర అంతరమైన అమృతం కదా!

శ్రీదేవి కటాక్షించిన వెంటనే భక్తి జ్ఞానం, విద్య, ధైర్యం, ఆనందం, భగవద్భాగ వత కైంకర్యం, ఐశ్వర్యం- 'భగవత్సాక్షాత్కారం లభిస్తుంది.

రతిర్మతి సరస్వత్యాదులు లక్ష్మిదేవియొక్క వివిధ రూపాలు- ఆమెతో కలిసి ఎనిమిది విధాలు- అష్టలక్ష్మిరూపాలు అనడం స్పృహణీయం.

రతిః- సంతాన లక్ష్మి; మతిః- జ్ఞానలక్ష్మి; సరస్వతీ- విద్య; (ప్రకృతిం వికృతిం విద్యా- ఆత్మవిద్యా మహావిద్యా; అనేవి లక్ష్మి నామాలే. "భద్రాహ్యేషాం వాచిలక్ష్మీర్నిషక్తా"- సత్పురుషుల వాక్కునందు మంగళకారిణియైన లక్ష్మి నివసిస్తుంది).

ధృతిః- ధైర్యలక్ష్మి; సమృద్ధిః- ధాన్యలక్ష్మి; సిద్ధిః- జయలక్ష్మి; శ్రీః- వరలక్ష్మి లేదా మోక్షలక్ష్మి (విముక్తి ప్రదాయినీ- ఇంతకంటె అధికమైన ఐశ్వర్యమే ముంటుంది) 'అథ' శబ్దానికి సాకల్యం, సమస్తమనే అర్థముంది.

"ప్రశ్న కార్త్స్న్యష్వథో అథ"- (అమరం). లక్ష్మీదేవి ఏ వ్యక్తినైన కటాక్షింప దలచినంత మాత్రాన రతిర్మతి సరస్వతీ ధృతి సమృద్ధి సిద్ధి శ్రీలు ఆ వ్యక్తికి అహమహమికాపేక్షతో వశమైనవై కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తాయి- పుత్ర పౌత్ర శిష్య ప్రశిష్య పర్యంతం వృద్ధిపొందుతాయి- అని లక్ష్మికటాక్ష వీక్షణ ప్రసారాభిముఖ జంఘాలత్వం వివరింపబడింది.

పృథ్వీవృత్తం- జ స జ స య ల గ- గణాలు కలది.

18. సహ స్థిర పరిత్రస వ్రజ విరించ నాకించనైః
అనోకహ బృహస్పతి ప్రబల విక్లబ ప్రక్రియమ్।
ఇదం సద సదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతం
కటాక్ష తదుపేక్ష యోస్తవహి లక్ష్మి! తత్తాండవమ్॥

**అర్థం:** హే లక్ష్మి= ఓ లక్ష్మీదేవీ!; స్థిరపరిత్రస-అకించనైః/ స్థిర= స్థావరాల యొక్క; పరిత్రస= పరిస్పందన శీలమున్న జంగమాల యొక్క; వ్రజ= సమూహాలతో; విరించన= బ్రహ్మనుంచి; అకించనైః, సహ= దరిద్రుని వరకున్న వారితో కూడ; అనోకహ బృహస్పతి- ప్రక్రియం/ అనోకహ= చెట్టునుంచి; బృహస్పతి వరకు ఉన్నట్టి; ప్రబల= బలవంతులు; విక్లబ= బలహీనులు అనే; ప్రక్రియం= ప్రక్రియ (విధానం) కల్గియున్నట్టి; ఇదం= ఈ; నిఖిలం, ఏవ= సమస్త ప్రపంచమే; సత్+అసత్+ఆత్మనా= (మంచి, చెడు) చిత్, అచిత్ అనే రూపాలచేత; నిమ్నోన్నతం, యత్= అధమ ఉత్తమ రూపాలతో కనబడడమేదైతే కలదో; తత్= అది; తవ= నీ యొక్క; కటాక్ష, తత్, ఉపేక్షయోః= కటాక్షం ప్రసరించడం, ప్రసరించకుండడ మనేవాటి యొక్క; తాండవం, హి= నాట్యం కదా!; తత్= ఆ నిమ్నోన్నతమైన- మిట్టపల్లాలుగా ఉండే రూపం.

**తా॥** ప్రపంచమంతా స్థావరజంగమాలుగానూ (స్థావరాలంటే కదలని చెట్లు గుట్టలని అర్థం. జంగమాలంటే సంచరించే మనుష్య పశుపక్ష్యాదులని అర్థం.) చెట్టువలె తెలివిలేనివారితోనూ, బృహస్పతి లాగా గొప్ప ప్రజ్ఞగలవారితోనూ, బలవంతులతో, దుర్బలులతోనూ, అధికైశ్వర్య సంపన్నుడైన బ్రహ్మనుంచి అతి దరిద్రుని దాకా హెచ్చు తగ్గులతో నున్నట్లు కనబడుతున్నది కదా! ఓ లక్ష్మిదేవీ! ఈ తరతమ భావం- అధమంగా ఉత్తమంగా ఉండడానికి కారణం- నీ కడగంటి చూపులు కలుగడం, కలుగకుండడంవల్ల యేర్పడిన తాండవమే కదా! అనుగ్రహ దృష్టి పడినచోట ఉన్నతి, పడనిచోట దుఃస్థితి కలుగుతుంటుంది. ఇది నీ నటనయే సుమా!

లక్ష్మి కటాక్షం లేకపోతే శ్రేయస్సే ఉండదని సారార్థం.

పృథ్వీ వృత్తం.

19. *కాలే శంసతి యోగ్యతాంచిదచితో రన్యోన్య మాలింగతోః*
*భూతాహంకృతి బుద్ధి పంచకరణీ స్వాంత ప్రవృత్తీంద్రియైః।*
*అండానావరణైః సహస్ర మకరోత్ తాన్ భూర్భువస్స్వర్వతః*
*శ్రీరంగేశ్వరదేవి! తే విహృతయే సంకల్పమానః ప్రియః॥*

**అర్థం:** శ్రీరంగేశ్వరదేవి= శ్రీరంగనాథుని దేవేరీ! ఓ లక్ష్మీదేవీ!; కాలే= సృష్టికి ముందున్న కాలం, యోగ్యతాం= సృజించే అర్హతను; శంసతి (సతి)= తెల్పగా; చిత్+అచితోః= జీవ ప్రకృతులు (రెండు); అన్యోన్యం= ఒకటితో మరొకటి; ఆలింగతోః (సతోః) కలిసియున్నవి కాగా; ప్రియః= నీ ప్రియుడు; తే= నీ యొక్క; విహృతయే= క్రీడకోసం; సంకల్పమానః= సంకల్పించువాడై; భూతాహంకృతి- ఇంద్రియైః/ భూత= పంచభూతాలు; అహంకృతి= అహంకారతత్త్వం; బుద్ధి= మహత్తత్త్వం; పంచకరణీ= ఐదు జ్ఞానేంద్రియాలు; స్వాంత= మనస్సు; ప్రవృత్తి+ఇంద్రియైః= కర్మేంద్రియాలు- అనే వీటితోపాటు; ఆవరణైః= ఏడు ఆవరణాలతో; తాన్= ఆ, ప్రసిద్ధాలైన; భూః, భువః స్స్వర్వతః= భూలోక, భువర్లోక, స్వర్లోకాలను కల్గియున్న; సహస్రం= వేలకొలది; అండాన్= బ్రహ్మాండాలను; అకరోత్= చేసెను; సృజించాడు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ ప్రియుడైన శ్రీరంగనాథుడు సృజించడానికి అవసరమైన కాలాన, నీ విహారంకోసమే అధికంగా సృష్టిని చేయాలని సంకల్పించి, పంచభూతాలు, అహంకారం, మహత్తు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, సప్తావరణాలు మొదలైన వాటితోనూ, భూలోక, భువర్లోక, స్వర్లోకాలతో నిండిన పలు వేల బ్రహ్మాండాలను సృజించాడు.

**వ్యాఖ్య:** శ్రియఃపతి లక్ష్మీదేవి యొక్క విహారంకోసమే జగత్సృష్టిని నిర్వహించాడని వర్ణితం.

చిదచితోః అన్యోన్య మాలింగతోః- ప్రళయకాలంలో భగవానుని ఉదరంలో జీవులు జడవస్తువుల వలె ఉండి వాటితో కలిసి యుంటాయి- అని అర్థం.

కాలేయోగ్యతాంశంసతి– సృజించే యోగ్యతను కాలం తెల్పడమంటే కరణ కళేబరయోగం– జీవులకు తగిన దేహాలను కల్పించే అవసరమైన కాలం రాగా– అని అర్థం.

లక్ష్మీదేవి యొక్క క్రీడకోసమే ఆమె ప్రియుడైన భగవానుడు "సోऽ కామయత, బహుస్యాం ప్రజాయేయ ఇతి"– (ఉపనిషత్) నేను అనేకంగా అవుతానని సంకల్పించాడు– దీనివల్ల, లక్ష్మీదేవి యొక్క ముఖోల్లాసమే భగవానుడు తన ప్రయోజనంగా కలవాడని తెలుస్తున్నది కదా!

భూతాహంకృత్యాదులు– భూతాలు ఐదు. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనేవి. వీటికి క్రమంగా ఉండే విషయాలు– గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం అనేవి ప్రకృతి యొక్క వికార రూపమైనది అహంకారతత్త్వం. బుద్ధియే మహత్తత్త్వం.

పంచకరణీ– చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు– అనే అయిదు జ్ఞానేంద్రియాలు. స్వాంతం అంటే మనస్సు.

ప్రవృత్తీంద్రియాలు– వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలు అనే కర్మేంద్రియాలు ఐదు. ("పొంగైంబులనుమ్ పొఱి యైందుమ్ కరుమేందిరియ మైంబూదమ్, ఇంగివ్వుయిరేయ్ పిరగిరుది మానాంగార మనంగళే" (తి.వా.మొ. 10–7–10).

(పొంగు= వృద్ధిపొందుతున్న; ఐంబులనుమ్= ఐదు శబ్దాది విషయాలు; పొఱియైందుమ్= ఐదు జ్ఞానేంద్రియాలు; కర్మేందిరయమ్= కర్మేంద్రియాలు; ఐంబూదమ్= అయిదు భూతాలు; ఇంగు= ఈ సంసారమందు; ఇవ్వుయిరేయ్= ఈ జీవాత్మతో కలిసియున్న; పిరగిరుది= ప్రకృతి; మాన్= మహత్తత్త్వం; అంగారం= అహంకారతత్త్వం; మనంగళ్= మనస్సు.) (తత్త్వాలు 24, జీవాత్మ 25, పరమాత్మ 26వ వాడు) వీటితోనూ, సప్తావరణాలతోనూ, భూలోక, భువర్లోక, స్వర్లోకాలతో కూడిన వేలకొలది బ్రహ్మాండాలను సృష్టించాడు. ఇది శ్రీశ్రియఃపతులకు లీల

కాబట్టి దీన్ని లీలా విభూతి అంటారు. శ్రీదేవి లీలకోసమే ఈ బ్రహ్మాండాలను శ్రియఃపతి సృష్టించాడనడంవల్ల స్రష్ట యొక్క రాసిక్యం ప్రకటితమవుతున్నది కదా!

శార్దూల విక్రీడిత వృత్తం. మ స జ స త త గ- గణాలుంటాయి.

20. *శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం*
*వైష్ణవ్యా గుణమాయయాఽఽత్మనివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్।*
*పుంసా పణ్యవధూ విడంబి వపుషా ధూర్తాని వాయాసయన్*
*శ్రీరంగేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే॥*

**అర్థం:** శ్రీరంగేశ్వరి= ఓ శ్రీరంగనాయకీ!; పూర్వః పుమాన్= పురాణ పురుషుడైన శ్రీరంగనాథుడు; దాస్యాత్మకం= (జీవులకు) దాస్య రూపమైన; విభవం= ఐశ్వర్యాన్ని; విస్మార్య= మరపింపజేసి; శబ్దాదీన్= శబ్దం మొదలైన; విషయాన్= విషయాలను; ప్రదర్శ్య= చూపించి; వైష్ణవ్యా= విష్ణువైన తనకు సంబంధించినట్టి; గుణమాయయా= సత్త్వరజస్తమోగుణాలతో నున్న ప్రకృతితో; ఆత్మనివహాన్= జీవ సమూహాలను; విప్లావ్య= వంచించి; పణ్యవధూ, విడంబి, వపుషా= వేశ్య యొక్క వేషాన్ని ధరించిన; పుంసా= మగవానితో; ధూర్తాన్, ఇవ= కాముకులనువలె; ఆయాసయన్= బాధను కలిగిస్తున్నవాడై; తవ= నీకు; పరిహాసాత్మనే= నవ్వును పుట్టించే; కేళయే= క్రీడకోసం; కల్పతే= సమర్థుడవుతున్నాడు.

**తా॥** ఓ శ్రీరంగనాయకీ! నీ భర్త పురాణ పురుషుడు. జీవులకు స్వాభావికమైన దాస్యాన్ని మరపించాడు. జ్ఞానేంద్రియ కృత్యాలైన శబ్దాది విషయాలను చూపి తనకు చెందిన మాయ అనే ప్రకృతితో జీవులను వంచించి చాలా ఆయాస పెడుతున్నాడు. ఒక అధికారి, ఒక మగవానికి భోగస్త్రీ వేషం వేయించగా, అది వేశ్యకాంతయే అనే భ్రమతో వెంటబడిన విటులను ఆయాసపెట్టినట్లు, ఒక నవ్వులాటగా నున్నది. ఓ దేవీ! ఈ పరిహాసాత్మ క్రీడను నీ వినోదం కోసమే కల్పిస్తున్న సమర్థుడు.

వ్యాఖ్య: భగవానుడు జీవాత్మలను తన మాయతో వ్యామోహ పరచి, లక్ష్మీదేవికి నర్మకేళిని కల్పిస్తున్నాడని సుశ్లోకితం.

దాస్యం అంటే శేషత్వం. అది జీవాత్మలయొక్క స్వరూపం. దాస్యం-కైంకర్యం లేకుండా శేషత్వ రూపమైన అధికారం సిద్ధింపదు. కైంకర్యానికి ఆశ్రయమైనవాడు 'శేషి' యనబడును. కైంకర్యం చేయువాడు శేషభూతుడు. కాబట్టి, దాస్యాన్ని 'శేషత్వ వృత్తి' అని వ్యవహరిస్తారు.

*"విచిత్రాదేహ సంపత్తిః ఈశ్వరాయనివేదితుమ్।*
*పూర్వమేవ కృతా బ్రహ్మన్! హస్తపాదాది సంయుతా॥"*

ఓ బ్రహ్మదేవా! చేతులు కాళ్ళు మొదలైన అవయవాలతో కూడియున్న ఈ దేహం అనే సంపద సర్వేశ్వరునికి నివేదించడానికే పూర్వకాలాన కల్పించబడింది. కాబట్టి, దాస్యమే జీవులకు సహజమైన ఐశ్వర్యం కదా!

శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య- పంచభూతాలను, పంచతన్మాత్రలను- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే పంచేంద్రియ విషయాలను జీవులకు చూపించి, వారు భగవచ్ఛేషత్వమనే తమ ఐశ్వర్యాన్ని మఱచిపోయేటట్లు చేశాడు భగవానుడు.

*"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"*- (భ.గీత) త్రిగుణాత్మకమైన వైష్ణవీ మాయ దాటరానిది- అని భగవానుడే చెప్పినాడు కదా!

*"బ్రహ్మాద్యాః సకలాదేవాః మనుష్యాః పశవస్తథా।*
*విష్ణు మాయా మహావర్త మోహాంధ తమ సావృతాః॥"* (విష్ణుపురాణం)

విష్ణుమాయ ఒక పెద్ద సుడిగుండం. మోహమనే కటిక చీకటితో నిండియున్నది. బ్రహ్మాది దేవతలు, మనుష్యులు, పశువులు ఆ విష్ణుమాయ నుంచి తప్పించుకోలేరని శ్రీ పరాశర మహర్షి సూక్తి.

సర్వేశ్వరుడు స్వతంత్రుడైనందువల్ల శబ్దాది విషయాలకు లొంగిపోయి, దాస్యవృత్తిని మరచేటట్లుగా చేసి, తన మాయతో జీవులందఱిని వ్యామోహ

పరచాడు. ఇందువల్ల జీవులు చాలా ఆయాస పడునట్లు చేశాడు. ఈ వ్యామోహం, ఆయాసపడడం ఎట్లున్నదో ఉదాహరింపబడినది.

ఒక పురుషుడు భోగస్త్రీ వేషం వేసుకొని విహరిస్తుండగా కాముకులు ఆమె దగ్గరికి చేరుకొన్నారు. 'అయ్యో! ఆడ వేషంతో నున్న మగవాడే' అని నిజం తెలిసిన విటులు వంచితులై ఆయాపడుతున్నట్లున్నది. ఇది లీలా విభూతికి చెందిన ప్రక్రియ. వాస్తవంగా, ఇది ఒక పరిహాసాత్మకమైన క్రీడ. భగవానుడు ఈ నవ్వులాటను లక్ష్మీదేవి యొక్క వినోదం కోసమే కల్పిస్తున్నాడని తెల్పబడింది.

శార్దూల విక్రీడిత వృత్తం.

*21. యద్దూరే మనసో యదేవ తమసఃపారే యదత్యద్భుతం*
*యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః।*
*సాయుజ్యస్యయదేవ సూతి రథవాయద్దుర్గ్రహం మద్గిరాం*
*తద్విష్ణోః పరమంపదం తవకృతే మాతస్సమామ్నాసిషుః॥*

**అర్థం:** హే మాతః= ఓ తల్లీ!; యత్= ఏ స్థానం; మనసః= మనస్సుకు; దూరే= దూరమైనదో; యత్+ఏవ= ఏదైతే; తమసః= ప్రకృతికి; పారే= ఆవలివైపున ఉన్నదో; యత్= ఏ చోటు; అతి+అద్భుతం= మిక్కిలి ఆశ్చర్యకరమైనదో; యత్= ఏ స్థలం; కాలాత్= కాలంవల్ల; అపచేళిమం= పరిపక్వం కానిదో; యత్+గచ్ఛతః= ఏ ప్రదేశానికి వెళ్ళేవానికి; సురపురీ= దేవతల నగరమైన అమరావతి; దుర్గతిః= నరకమో; యత్, ఏవ= ఏ ప్రదేశం; సాయుజ్యస్య= మోక్షానికి; సూతిః= పుట్టినిల్లో; అథవా= లేక; యత్= ఏది; మత్+గిరాం= నా మాటలకు; దుర్గ్రహం= అందనిదో; విష్ణోః= విష్ణువు యొక్క; తత్= ఆ; పరమం పదం= ఉత్తమ స్థానమైన వైకుంఠాన్ని; తవకృతే= నీ కొరకే ఉన్నదని; సమామ్నాసిషుః= వేదమూర్తులు పఠిస్తున్నారు.

**తా॥** ఓ జగజ్జననీ! విష్ణుమూర్తి యొక్క ఉత్కృష్టమైన నివాసస్థానం శ్రీవైకుంఠం. ఆ పరమపదం ఎవరి మనస్సుకు గోచరించనిది. ఆ ప్రదేశం పెంజీకటికి ఆవలివైపున ఉన్నది. ఆ చోటు ప్రతిక్షణం ఆశ్చర్యాన్ని గొలిపేది

వ్యధామం. అక్కడ కాలంవల్ల మార్పు కలుగదు. ఆ పరంధామానికి చేరిన వారికి స్వర్గం నరకంగా అనిపిస్తుంది. అది సాయుజ్యమనే మోక్షానికి పుట్టినిల్లు. అట్టి అద్భుత ప్రదేశాన్ని నీ అనుగ్రహం వల్ల వర్ణింపదలచిన నా వాక్కులకు శక్యమవడం లేదు. అంత గొప్ప నిత్యవిభూతి– పరమపదం– నీ స్థానంగానే శ్రుతులు ఉద్ఘోషిస్తున్నాయి.

**వ్యాఖ్య:** లీలా విభూతి లక్ష్మీదేవియొక్క వినోదం కోసమే సృజింపబడినదని చెప్పిన తర్వాత నిత్యవిభూతి– శ్రీవైకుంఠం– లక్ష్మీదేవికి భోగస్థానంగా ఏర్పరచబడిన దని ఆ ప్రదేశ వైభవం సుశ్లోకితం.

యద్దూరే మనసః– పరమపదం యొక్క మహిమ మనస్సులో కూడా ఊహింపనలవికానిది. మనకే కాదు; భగవద్రామానుజులు శ్రీ వైకుంఠ గద్యలో "బ్రహ్మాదీనాం వాఙ్మన సాగోచరే శ్రీమతి వైకుంఠే" – అని వ్యక్త పరచినట్లు, చతుర్ముఖ బ్రహ్మకు గానీ, పంచముఖుడైన పరమశివునికిగానీ, షణ్ముఖుడైన కుమార స్వామికి గానీ, వేయికన్నులు గల ఇంద్రునికిగానీ, దేవతల వాక్కులకు మనస్సుకు కూడా భావింప శక్యం కానిది.

"అన్యై రధన్య పురుషైః మనసాఽనవాప్యమ్"– (వైకుంఠస్తవం) దురదృష్టవంతుల మనస్సుచే పొందరానిది– అన్నారు శ్రీవత్సాంక మిశ్రులు.

యదేవ తమసఃపారే– "క్షయం రజస్య తమసః పరాకే"– అని శ్రుతి పల్కినట్లు, రజస్తమస్సులున్న ప్రకృతియొక్క స్పర్శ కూడా లేనిది వైకుంఠం. ప్రకృతి మండలానికి ఆవలివైపున ఉన్నది. 'తమస్సు' అంటే గాఢాంధకారం. కాబట్టి, పెంజీకటికి ఆవల ప్రకాశిస్తున్న ప్రదేశం.

యదత్యద్భుతం– క్షణం, క్షణం అపూర్వమైన ఆశ్చర్యాన్ని కలిగించే దివ్యలోకమది. స్వామి అందాన్ని జూచి "తురుంబు మెషుందాడి అడిమైయిలే మీణ్డల్లదు నిఱ్క వొణ్ణాతపడి"– (ఈడు) అక్కడ, గడ్డిపరకలేచి కైంకర్యం చేయక నిల్చేది కాదు. అనేక అద్భుతాలకు ఆలవాలం ఆనందధామం.

యత్కాలాదపచేళిమం- పరమ పదమందు కాలంయొక్క ప్రభావం ఉండదు. "యావైనజాతు పరిణామ పదాస్పదం సా". ఎప్పుడూ మార్పు చెందని ప్రదేశం. కాలాన్ని నిర్వహించే సూర్య చంద్రులు అక్కడ ఉండరు. కాలంవల్ల పరిపక్వం కానిది. "న కాలస్తత్ర వైప్రభుః"- కాలంయొక్క పెత్తనమే లేనిది.

*"అత్యర్కానలదీప్తంతత్ స్థానం విష్ణోర్మహాత్మనః।*
*స్వయైవ ప్రభయారాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః॥"*

(భారతం. ఆరణ్యం. 136-18)

పరమాత్మయైన విష్ణువుయొక్క స్థానం సూర్యునికంటెను, అగ్నికంటెను మించి ప్రకాశిస్తుంది. భగవానుని తేజస్సు దేవతలచేతగానీ, రాక్షసులచేతగానీ చూడశక్యం కానిది.

*సురపురీ యద్గచ్ఛతోదుర్గతిః*- అర్చిరాది మార్గంలో ఇంద్రునిచే సత్కరింపబడి నప్పుడు అమరావతి నగరాన్ని జూచి పరమపదానికి చేరుకొన్న ముక్త పురుషునికి అమరావతి (స్వర్గం) నరకంగానే గోచరించింది.

*"ఏతేవై నిరయాస్తాత! స్థానస్య పరమాత్మనః"* (భారతం. శాన్తి. 196-6) పరమాత్మ యొక్క స్థానమైన వైకుంఠాన్ని చూచిన తర్వాత దానిముందు రుద్రులు, ఆదిత్యులు, వసువులు ఇంక ఇతర దేవతలున్న నగరాలు నరకంగా భావింపబడు తుంటాయి.

*సాయుజ్యస్య యదేవ సూతిః*- సాయుజ్యం అనే మోక్షాన్ని ఇచ్చే దివ్య దేశం.

*"సాలోక్యం చాపి సారూప్యం సామీప్యంచ తతః పరం।*
*సాయుజ్యమితి ముక్తిస్తు ప్రోక్తా విద్భిశ్చతుర్విధా॥"*

సాలోక్యం, సారూప్యం, సామీప్యం, సాయుజ్యం అని మోక్షం నాలుగు విధాలుగా ఉంటుంది. సాధన వైషమ్యాన్ని బట్టి ఫలవైషమ్యం ఉంటుంది కదా! వేయిలో నూర్లు ఉన్నట్లు సాయుజ్యంలో తక్కినవి అంతర్భూతాలు.

'సాయుజ్యం' అంటే 'సయుక్' యొక్క భావం. పరమాత్మ అనే భోగ వస్తువునందు పరమాత్మ మరియు ముక్తాత్మ ఇర్వురు భోక్తలై అన్వయించి యున్నందు వల్ల ముక్తాత్మ 'సయుక్' అనబడుతాడు.

గుణరూపాలతో సమానులై ఇర్వురు భోగవస్తువును అనుభవిస్తారు. ఆత్మ పరమాత్మలకు భోక్తవ్యమందు భేదం లేకపోవడం 'సాయుజ్యం'.

*"నిరంజనః పరమం సామ్యముపైతి"*- ప్రకృతి సంబంధం లేనివాడు మిక్కిలి గొప్ప సామ్యాన్ని పొందుతున్నాడు. భగవదనుగ్రహం వల్ల పరమ సామ్యాపత్తిని పొందే స్థలమది.

*"తత్ర గత్వా పునర్నేమం లోకమాయాంతి భారత॥"* (భారతం. ఆరణ్యం. 136-23) పరమ పదానికి పోయిన వారు మళ్ళీ ఈ లోకానికి తిరిగి రారు.

*తద్విష్ణోః పరమంపదం తవకృతే సమామ్నాసిషుః-*

*"వైకుంఠేతుపరేలోకే శ్రియాసార్థం జగత్పతిః।*
*ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైర్భాగవతై సహ॥"* (లింగపురాణ వచనం)

జగన్నాథుడైన విష్ణువు లక్ష్మీదేవితోనూ, భక్తులతో భాగవతులతో కలిసి గొప్ప లోకమైన వైకుంఠమందు వేంచేసి యున్నాడు. *"తద్విష్ణోః పరమం పదం"* *"సదాపశ్యంతి సూరయః"*- అనే వేదమంత్రంలోని వాక్యం ఉన్నదున్నట్లు ప్రయుక్తమైనది.

*"ఒణ్డోడియాళ్ తిరుమకళుమ్ నీ యుమే నిలానిఱ్ప"* (తిరువాయ్ మొషి. 4-9-10) మెరిసే కంకణాలు గల లక్ష్మీదేవీ నీవూ కలసి విహరిస్తుండగా- అనే సూక్తిలో లక్ష్మీదేవిచేత దేదీప్యమానమైన దివ్యదేశమే పరమపదమని- లక్ష్మీ ప్రాధాన్యాన్ని- పూర్వాచార్యులు తెల్పినారు.

దివ్యదంపతులకు నివాసస్థానమైన పరమపదం జగజ్జననియైన లక్ష్మీదేవి యొక్క భోగస్థానంగానే వైదికులు నొక్కి వక్కాణిస్తున్నారు. శార్దూల విక్రీడితం.

22. హేలాయా మఖిలం చరాచర మిదం భోగే విభూతిః పరా
(ధన్యా) పుణ్యాస్తే పరిచార కర్మణి సదాపశ్యంతియే సూరయః।
శ్రీరంగేశ్వరదేవి! కేవల కృపా నిర్వాహ్యా వర్గేవయం
శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్ఫారణే॥

**అర్థం:** హే శ్రీరంగేశ్వరదేవి= శ్రీరంగరాజు యొక్క పట్టపురాణివైన ఓ లక్ష్మీదేవీ!; అఖిలం= సమస్తమైన; ఇదం= ఈ (కనబడే); చర+అచరం= జంగమ స్థావర రూపమైన జగత్తు; హేలాయాం= (నీ) క్రీడలో ఉపయోగపడుతున్నది; పరా= గొప్పదైన; విభూతిః= (శుద్ధ సత్త్వ రూపమైన) నిత్య విభూతి; భోగే= (నీ) భోగమందు వినియోగ పడుతున్నది; యే= ఎవరు; సదా= ఎల్లప్పుడు; పశ్యంతి= (నిన్ను, నీ పతిని) దర్శిస్తున్నారో; పుణ్యాః= ధన్యులైన; తే= ఆ; సూరయః= నిత్యసూరులు; పరిచార కర్మణి= (నీ) సేవ చేయడమందు నియుక్తులై యున్నారు; వయం= (ఈ లోకంలో బుభుక్షు, ముముక్షు రూపంగా ఉన్న మేము; కేవల కృపా నిర్వాహ్యావర్గే/ కేవల కృపా= నీ కృపతోనే; నిర్వాహ్యా= నిర్వహింప- ఉజ్జీవింపజేయ- దగిన; వర్గే= ప్రాణి వర్గంలో చేరియున్నాం; పరమః= ఉత్కృష్టుడైన; పుమాన్= పురుషుడు- భగవానుడు; శేషిత్వే= నీకు స్వామిగా ఉన్న స్థితిలో ఉపయోగపడుతున్నాడు; ఏతే (పైన చెప్పబడిన) ఇవన్నియు; తవ= నీ యొక్క; స్ఫారణే= వైభవ వ్యాప్తియందు; పరికరాః, హి= సాధనాలు కదా!

**తా॥** రంగరాజ మహిషివైన ఓ లక్ష్మీదేవీ! జంగమస్థావరాలుగా కనబడుతున్న ఈ జగమంతా నీ క్రీడలో ఉపయోగపడుతున్నది. వైకుంఠం నీకు భోగస్థానమే. నిన్ను, నీ స్వామిని ఎల్లప్పుడు సేవిస్తూ ధన్యులైన అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు నీ దాసవర్గంలో చేరియున్నారు. బుభుక్షువులు, ముముక్షువులుగా నున్న మేము జీవ సముదాయమందుండి నీ కృపకు పాత్రులమై యున్నాము. నీకు 'శేషి'- స్వామిగా భగవానుడు వేంచేసి యున్నాడు. నీకు ఉపయోగపడని వస్తువు ఈ ఉభయ విభూతులలో లేనే లేదు. ఇది అంతా నీ వైభవాన్నే ప్రకటిస్తున్నది కదా!

**వ్యాఖ్య:** ఉభయ విభూతులు– అందులోని సమస్త పదార్థాలు– లక్ష్మీదేవి యొక్క సంపదయే అని సుశ్లోకితం.

ఇంతకుముందు లీలా విభూతిగానీ, నిత్య విభూతిగానీ లక్ష్మీదేవి యొక్క ఉపయోగంకోసమే అని వేర్వేరుగా రెండు శ్లోకాలలో చెప్పబడినది. ఈ శ్లోకంలో ఉభయ విభూతిలోని సమస్త వస్తువులు లక్ష్మీదేవియొక్క వైభవ వ్యాప్తిని ప్రకటిస్తున్నాయి.

*అఖిలం చరాచరమిదం తవహేలాయాం*– చర స్థిర రూపమైన ఈ లోకమంతా నీ క్రీడయందు ఉపయోగపడుతున్నది. లక్ష్మీదేవికి వినోదం కల్పించే స్థానంగా నున్నది.

*"త్వం న్యం చద్భిరుదంచద్భిః కర్మసూత్రోప పాదితైః।*
*హరే! విహరసి క్రీడా కందు కైరివజంతుభిః॥"*

ఓ హరీ! క్రిందికి పైకి వచ్చునట్టి, కర్మలు అనే సూత్రాలతో బంధింపబడిన జీవులతో నీవు క్రిందికి పోయి మీదికి ఎగిరిపోయే ఆటబంతులతోవలె వినోదిస్తున్నావు– అనీ *"అండాని తత్సు సదృశాని పరశ్శతాని, క్రీడావిధేస్తవ పరిచ్ఛదతామ గచ్ఛన్॥"* క్రీడా విధివైన నీకు ఈ బ్రహ్మాండమంతా ఆటకు స్థానమైనది– అని ఈ విభూతి లీలకోసమని చెప్పబడింది.

*పరా విభూతిర్భోగే*– ఈ లీలా విభూతికంటె మూడురెట్లు గొప్పదైన నిత్యవిభూతి– వైకుంఠం– *"త్రిపాదస్యామృతం దివి"* అని శ్రుతి తెల్పుతున్నది. కాబట్టి ఈ త్రిపాద్విభూతి లక్ష్మీదేవియొక్క భోగానుభవానికి ఏర్పడినది. పరావిభూతి మార్పులేని శుద్ధ సత్త్వాత్మికమైనది. కాబట్టి అది లక్ష్మీదేవికి భోగ్యమైనది. భోగ్యం అంటే సుఖం– ఆనందాన్ని అనుభవించడం. ఆనందానికి ఉపకరణం– సాధనమే భోగోపకరణమనబడుతుంది. అట్లే, ఆనందాన్ని కలిగించే ముఖ్యస్థానం భోగస్థానమని పేర్కొనబడుతుంది. భోగ్యం, భోగోపకరణం, భోగస్థానం కూడా శ్రీదేవికి వైకుంఠమే.

ధన్యాస్తే పరిచారకర్మణి సదాపశ్యంతియే సూరయః– "సదా పశ్యంతి సూరయః"– అనే వేదవాక్యం, వైకుంఠంలో నిత్యసూరులు దివ్యదంపతులను నిరంతరం దర్శిస్తుంటారనే అర్థాన్ని ప్రకటిస్తున్నది. అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు శ్రీ శ్రియఃపతులను సర్వదా దర్శిస్తూ వారి కైంకర్యంలో వినియోగ పడుతుంటారు.

"వర్తిష్యంతే వితమసిపదేవాసుదేవస్య ధన్యాః"– తమస్సులేని విష్ణువు యొక్క స్థానమందు– పరమపదమందు– దివ్యదంపతులకు ఛత్రచామరాది పరికరాలవలె ఉపయోగపడుతు నివసిస్తున్నవారు– నిత్యులు, ముక్తులు, ధన్యులు– భాగ్యశాలురు– అని వేదాంత దేశికుల శ్రీసూక్తి. *"ఆకిలుమ్ పణిశెయ్‌వదు గృహిణిక్కితే"* –(ముముక్షుప్పడి) అయినా, సేవ చేయడం గృహిణికే కదా!

వయం కేవల కృపా నిర్వాహ్యావర్గే:– భోగేచ్ఛ, మోక్షేచ్ఛ– ఈ రెండింటితో బాధపడుతున్నవారు జీవులు. భోగాలను వదలలేక మోక్షపదవిని చేరలేక సతమతమవుతున్న ప్రాణికోటి అంతయు కేవలం లక్ష్మీదేవియొక్క నిర్హేతుక కృపను పొంది ఉజ్జీవింపనున్నది. జీవులు కూడా దాసవర్గమందున్నవారే అని సారార్థం.

పరమః పుమాన్ శేషిత్వే:– జగమంతా దివ్యదంపతులకు శేషభూతమై యున్నది. లక్ష్మీదేవికి పరమపురుషుడైన శ్రియఃపతి శేషియై ఉపయోగ పడుతున్నాడు– అంటే, లక్ష్మీదేవి యొక్క కైంకర్యాన్ని నారాయణుడే స్వీకరించువాడై యున్నాడు.

ఏతే తవ స్ఫారణే పరికరా హి:– ఇట్లు చెప్పబడిన ఉభయ విభూతులు అందున్న పరికరాలన్నియు లక్ష్మీదేవియొక్క వైభవంలోనే అంతర్భవిస్తున్నాయి.

శార్దూల విక్రీడిత వృత్తం.

23. ఆజ్ఞానుగ్రహ భీమకోమల పురీపాలా ఫలం భేజుషాం
యాఽ యోధ్యేతి పరాజితేతి విదితానాకం పరేణస్థితా।
భావైరద్భుత భోగభూమగహనై స్సాంద్రా సుధాస్యందిభిః
శ్రీరంగేశ్వర గేహలక్ష్మి! యువయోస్తాం రాజధానీం విదుః॥

**అర్థం:** శ్రీరంగేశ్వరగేహలక్ష్మి= శ్రీరంగనాథుని గృహలక్ష్మి!; యా= ఏ నగరం; ఆజ్ఞానుగ్రహ భీమకోమల పురీపాలా/ ఆజ్ఞా= ఆజ్ఞచేత; అనుగ్రహ= దయచేత; భీమ= భయాన్ని కలిగించునట్టి; కోమల= సుకుమారులైనట్టి; పురీపాలా= నగర పాలకులను కల్గియున్నదో; భేజుషాం= సేవించే భక్తులకు; ఫలం= పరమ పురుషార్థమైయున్నదో; అయోధ్యా, ఇతి= అయోధ్య, అని; అపరాజితా, ఇతి= అపరాజిత, అని; విదితా= పసిద్ధిని పొందియున్నదో; నాకం= స్వర్గానికి; పరేణ= ఆవలివైపున; స్థితా= ఉన్నదో; సుధా స్యందిభిః= అమృతాన్ని చిందించునట్టి; అద్భుత భోగభూమగహనైః/ అద్భుత= ఆశ్చర్యకరమైన; భోగ= సుఖాలయొక్క; భూమ= ఆధిక్యంచేత; గహనైః= నిండియున్న; భావైః= ద్రవ్యాలతో; సాంద్రా= దట్టంగా వ్యాపించియున్నదో; తాం= ఆ నగరాన్ని; యువయోః= (దివ్యదంపతులైన) మీ ఇర్వురయొక్క; రాజధానీం= రాజధానిగా; విదుః = తెలుసుకొంటున్నారు.

**తా॥** శ్రీరంగ దివ్య విమానానికి అలంకారమైన ఓ లక్ష్మీదేవీ! పరమపదంలో 'అయోధ్య, అపరాజిత' అనే పేర్లతో ప్రసిద్ధ నగరమున్నది. అక్కడ ఆజ్ఞతో భయంకరులుగానూ అనుగ్రహంతో మృదు స్వభావులుగానూ ఉండే నగర పాలకులు ఉన్నారు. ఆశ్రయించిన భక్తులకు మోక్షఫలాన్ని ప్రసాదించే నగరమది. స్వర్గానికిపైన పరమాకాశాన అద్భుత సుఖానుభవాలతో నిబిడమై యుండే ఆ నగరం మీ దివ్య దంపతులకు రాజధాని– అని వైదికులు తెలుసుకొంటున్నారు.

**వ్యాఖ్య:** పరమపదమనే దివ్య దేశంలో 'అయోధ్య, అపరాజిత' అని పేర్కొనబడే నగరం శ్రీ, శ్రియఃపతుల రాజధాని– అని వేదాంత శాస్త్రజ్ఞులకు తెలిసింది.

లక్ష్మీదేవి శ్రీరంగనాథుని ఇల్లాలు. ఇల్లాలు ఇంటికి దీపం కదా! శ్రీరంగరాజ భవనానికి మంగళదీప రేఖయై శోభిస్తున్నది. 'అయోధ్య' అంటే యుద్ధం చేయనలవికానిది. ఆక్రమించడానికి సాధ్యం కానిది- అని అర్థం. 'అపరాజిత' అంటే ఇతరులచేత జయింపశక్యం కానిది. ఎన్నడూ పరాజయాన్ని పొందని నగరమని అర్థం. *"దేవానాం పూరయోధ్యా"* అనీ *"విశాలాఽ పరాజితా"* - అనీ ఉపనిషత్తులు వర్ణిస్తున్నాయి. ఈ పట్టణంలో వేయిస్తంభాలుగల మణిమయమైన మంటపమందు పర్యంకంమీద లక్ష్మీనారాయణులు నిత్యముక్తులతో సేవింపబడుతుంటారని ఛాందోగ్యోపనిషత్తు తెల్పుతున్నది.

*ఆజ్ఞానుగ్రహ భీమ కోమల పురీపాలా:-* ఆ దివ్య నగరపాలకులు ఆజ్ఞచే భయంకరులుగా నుంటారు అనుగ్రహంచేత సుకుమారులుగా ఉంటారు. (ఆజ్ఞానుగ్రహాలతో భీమకోమలులు- అనే క్రమాన్ని పాటించాలి) అంటే, భగవద్భాగవతుల విరోధులను భయపెట్టే ఆకారం కలవారై కఠినంగా శాసించి ప్రవేశింపనీయరు. భగవద్భక్తులను మాత్రం మృదుస్వభావం కలవారై నగరంలో ప్రవేశించడానికి అనుగ్రహిస్తుంటారని అర్థం.

*భేజుషాం ఫలం:-* ('తస్థుషాం' అన్నట్లు 'భేజుషాం' అనే పదం షష్ఠీవిభక్తి బహువచనం. భేజివాన్- భేజివాంసౌ- భేజివాంసః- ఇది ప్రథమావిభక్తి. భేజుషః - భేజుషోః- భేజుషాం- ఇది షష్ఠీ విభక్తి.) దివ్య దంపతులను ఆశ్రయించే- సేవించేవారికి పరమ భోగ్యమైన నగరం. ప్రపన్నులకు ప్రాప్యస్థానమది.

*నాకం పరేణస్థితా:- "పరేణ నాకం నిహితం గుహాయామ్"-* (శ్రుతివాక్యం.) స్వర్గానికి ఆవల పరమాకాశాన అపరాజిత నగరమున్నది.

*"నాకస్య పృష్ఠ మారుహ్యా గచ్ఛేత్ బ్రహ్మసలోకతామ్"-* ప్రకృతిమండలాన్ని దాటి (స్వర్గానికి ఆవలివైపునకు). పరబ్రహ్మ నివసించే స్థానానికి వెళ్ళవలసి యుంటుంది- అని తైత్తిరీయోపనిషత్తు సూచిస్తున్నది.

*భావై రద్భుత భోగభూమగహనైః సాంద్రాసుధాస్యంధిభిః-* ఆ దివ్య నగరం అద్భుతమైన- క్షణం క్షణం కొంగ్రొత్త- సుఖానుభవాలను 'అధికంగా కలిగిస్తూ,

అమృతాన్ని ప్రవహించే పదార్థాలతో నిండియున్న ఆ ముఖ్య పట్టణం- వైకుంఠం- లక్ష్మీనారాయణులిద్దఱికి రాజధానియై విరాజిల్లుతున్నది. వేదాంత విద్వత్తల్లజులకు బాగా తెలిసిన విషయమిది.

శార్దూల విక్రీడిత వృత్తం.

24. *తస్యాంచ త్వత్కృపావ న్నిరవధి జనతా విశ్రమార్హావకాశం*
*సంకీర్ణం దాస్యతృష్ణా కలిత పరికరైః పుంభిరానంద నిఘ్నైః*
*స్నేహా దస్థాన రక్షావ్యసనిభిరభయం శార్ఙ్గ చక్రాసి ముఖ్యైః*
*ఆనందైకార్ణవం శ్రీర్భగవతి! యువయోరాహురాస్థాన రత్నమ్॥*

**అర్థం:** భగవతి= షాడ్గుణ్య మహిమగల; హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!; తస్యాం= 'అపరాజిత' అనే ఆ వైకుంఠ నగరిలో; త్వత్+కృపావత్= నీ దయవలె; నిరవధి జనతా విశ్రమ+అర్హ+అవకాశం/ నిరవధి= మితిలేని; జనతా= జనసమూహం యొక్క; విశ్రమ= విశ్రాంతికి; అర్హ= తగిన; అవకాశం= స్థలం కలదైన; దాస్య, తృష్ణా, కలిత, పరికరైః= కైంకర్యంచేసే ఆశతో గ్రహింపబడిన పరికరాలు- సాధనాలు- కల్గినట్టి; ఆనంద నిఘ్నైః= ఆనందపరవశులైన; పుంభిః= ముక్త పురుషులచేత; సంకీర్ణం= దట్టంగా వ్యాపించియున్నట్టి; స్నేహాత్= ప్రీతివల్ల; అస్థాన, రక్షా, వ్యసనిభిః/ అస్థాన= అవసరం లేనప్పుడు కూడా; రక్షా= రక్షించడమందు; వ్యసనిభిః= ఎల్లప్పుడు మిక్కిలి ఆసక్తిని కలిగియున్న; శార్ఙ్గ, చక్ర, అసి, ముఖ్యైః= ధనుస్సు, చక్రం, ఖడ్గం మొదలైన దివ్యాయుధాలచేత; అభయం= భయంలేనట్టి; ఆనంద+ఏక+అర్ణవం= కేవలం ఆనంద సముద్రమైన; ఆస్థాన రత్నం, శ్రేష్ఠమైన ఆస్థాన మంటపం కూడా; యువయోః= మీ ఇద్దఱిదే అని; ఆహుః= (ఉపనిషత్తులు) చెబుతున్నాయి.

**తా॥** షడ్గుణాల మహిమను కలిగియున్న ఓ లక్ష్మీదేవీ! ఆ దివ్య రాజధానిలోని ఆస్థాన మంటపం కూడా మీ (దివ్య దంపతులకు) ఇద్దఱికి సంబంధించినదే అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఆస్థాన మంటపం నీ కృపవలె అపరిమితమైన జనులకు విశ్రమించదగిన చోటు కలది. ఛత్రచామరాది

పరికరాలతో మీకు కైంకర్యం చేసే ఆసక్తిని కల్గియున్న ముక్తపురుషులతో నిండి యున్నది. భయంలేని స్థానమే అయినా, భగవత్ప్రీతి వల్ల శంఖచక్రాది పంచాయుధాలు మంగళాశాసనం చేయడంలో మిక్కిలి ఆసక్తి కలవైయున్నందున ఆస్థానమంటపం అభయస్థానమై శోభిస్తున్నది. కేవలం ఆనందనిలయంగా ఉండే ఆస్థాన రత్నంగా వేదాంతజ్ఞులు స్తుతించారు.

**వ్యాఖ్య:** దివ్యరాజధానిలోని ఆస్థానమంటపం వర్ణితం.

ఆస్థానరత్నం- *"జాతౌజాతౌ యదుత్కృష్టం తద్రత్న మితికథ్యతే"*- ప్రతి ద్రవ్యజాతిలో ఏది శ్రేష్ఠమై వెలసియుండునో అది రత్నమని చెప్పబడును. ఆస్థాన మంటపాలు ఎన్ని యున్ననూ, శ్రీ శ్రియఃపతులు వేంచేసియున్న చిత్ర విచిత్ర మణిమయమైన సహస్రస్థూణాలతో భాసించే తిరుమామణి మండపమే ఆస్థాన రత్నమనబడినది.

*"అతిప్రమాణే దివ్యాయతనే కస్మింశ్చిద్విచిత్ర దివ్యరత్నమయే దివ్యాస్థానమంటపే"*- (శ్రీ వైకుంఠగద్య) అని భగవద్రామానుజుల శ్రీసూక్తి.

*త్వత్కృపావత్ నిరవధి జనతా విశ్రమార్హావకాశం*- లక్ష్మీదేవి యొక్క కృప అపరిమితమైనది. ఆమె దయవలె ఆస్థాన రత్నం నిత్యముక్తుల సమూహాలు విశ్రమించదగినంత విశాలమైనది. అనేకులతో నిండియున్నను ఇంక వలసినంత స్థలం మిగిలియుంటుంది.

*దాస్యతృష్ణా కలిత పరికరైః ఆనందనిఘ్నైః పుంభిః సంకీర్ణం*- కైంకర్యం చేసే కోరికతో ఛత్ర చామరాది పరికరాలను తమ చేతులతో పట్టుకొని యుండి ఆనందపరవశులైన నిత్యముక్త పురుషులతో క్రిక్కిరిసి యుంటుంది.

*"స్వేన రూపేణాభి నిష్పద్యతే"*- ముక్తుడు స్వస్వరూపాన్ని పొందుతున్నాడు- అని ఉపనిషత్తు తెల్పుతున్నది. స్వస్వరూపాన్ని పొందడమే పురుషార్థం శేషత్వం- దాస్యం- లేకుంటే స్వరూపం నిల్వదు కాబట్టి, స్వరూప ప్రాప్తిఫలంగా సర్వశేషికి చేయబడే కైంకర్యం ఆనంద రూపంగానే ఉంటుంది.

"గృహీత తత్తత్పరిచార సాధనైః నిషేవ్య మాణం పురుషైః"– (స్తోత్రరత్నం) ఆయా పరిచారసాధనాలను గ్రహించి, ఆనందంతో భగవత్సేవ చేయడం కోసం తొందర పడుతున్న ముక్తపురుషులతో నిండుగా వ్యాపించియుంటుంది.

*స్నేహాదస్థాన రక్షా వ్యసనిభిః శార్ఙ్గ చక్రాసిముఖ్యైః అభయమ్:* – సహజంగానే భయమేలేని ప్రదేశం పరమపదం. అట్టి దివ్యస్థలాన్ని 'అభయం' అని పల్కడం విడ్డూరం కదా! అంటే, స్నేహాత్– ప్రేమవల్ల అనబడినది కదా!

జ్ఞానదశ, ప్రేమదశ అని రెండు దశలుంటాయి. జ్ఞానదశలో రక్ష్య రక్షక భావం ఉంటుంది. ప్రేమ దశ ఆ భావం తారుమారవుతుంది. 'మమ్ము రక్షించవయ్యా స్వామీ!' అనడానికి మారుగా 'తండ్రీ! నీవు చల్లగా ఉండాలి'– అని ప్రేమాతిశయం వల్ల పెద్దలకే 'రక్ష' పెట్టడం– మంగళాశాసనం చేయడం అసంగతం కాదు. అది శిష్టాచారమే. శేషత్వానికి పరాకాష్ఠ అని కూడా సంప్రదాయజ్ఞులు తెల్పుతుంటారు.

పరమపదంలో ఏ భయమూ లేకున్ననూ, అక్కడ కూడా ఏదైనా అవద్యం, భయం కల్గుతుందేమోననే శంకను పొంది, ఆ శంక తీరడం కోసం రక్షపెట్టడం– మంగళాశాసనం చేయడమందు ఆసక్తిని కలవైన శంఖచక్ర గదాసిశార్ఙ్గాలు అనే పంచాయుధాలతో భయం తీరిన స్థానం ఆస్థాన రత్నం ఈ సూక్తి వారి వారి అభినివేశమందలి గొప్పతనాన్ని తెల్పుతుంది.

*ఆనందైకార్ణవం:* – దుఃఖమేలేని చోటు. అర్ణవం అంటే సముద్రం. ఆధిక్యమనే అర్థాన్ని సూచిస్తుంది. పరమానంద నిలయమని భావం. ఇట్టి వైభవంగల ఆస్థాన మంటపం శ్రీ శ్రియఃపతులకు దివ్య భోగస్థానమని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి.

స్రగ్ధరావృత్తం. మ ర భ న య య య– గణాలు కలది.

*25. తత్రస్రక్ స్పర్శగంధం స్ఫురదుపరిఫణా రత్నరోచిర్వితానం*
*విస్తీర్యానంత భోగం తదుపరి నయతా విశ్వమేకాధి పత్యమ్।*
*తైస్తైః కాంతేన శాంతోదితగుణ విభవై రర్హతాత్వామసంఖ్యైః*
*అన్యోన్యాద్వైత నిష్ఠా ఘన రస గహనాన్ దేవి! బధ్నాసి భోగాన్॥*

**అర్థం:** హేదేవి= ఓ శ్రీరంగనాయకీ!; తత్ర= ఆ అస్థాన మండపమందు; స్రక్ స్పర్శ గంధం= పూలమాల యొక్క స్పర్శవలె సుకుమార స్పర్శను, దాని యొక్క సువాసనవంటి సువాసనను కల్గినట్టి; స్ఫురదుపరి-వితానం/ స్ఫురత్= ప్రకాశిస్తూ; ఉపరి= మీది భాగాన ఉండే; ఫణారత్న= పడగల యందలి మణుల యొక్క; రోచిః= కాంతులే; వితానం= మేల్కట్టుగా కల్గినట్టి; అనంత భోగం= ఆదిశేషుని యొక్క శరీరాన్ని; విస్తీర్య= పరచుకొని; తత్+ఉపరి= ఆ పడకమీద (కూర్చొని); విశ్వం= సమస్త ప్రపంచాన్ని; ఏక+ఆధిపత్యం (ఏకాతపత్రం-పారాంతరమున్నది) ఏకచ్ఛత్రాధి పత్యాన్ని; నయతా= నడుపుతున్నట్టి; అసంఖ్యైః= లెక్కలేనట్టి; తైః తైః= ఆయా ప్రసిద్ధాలైనట్టి; శాంతోదిత గుణవిభవైః= 'శాతోదిత దశ'లోని గుణాల వైభవాలతో; త్వాం= నిన్ను గూర్చి (నీకు); అర్హతా= తగినవాడైన; కాంతేన= ప్రియుడు, మనోహరుడైన శ్రీమన్నారాయణునితో; అన్యోన్యా-గహనాన్/ అన్యోన్య= పరస్పరం; అద్వైత నిష్ఠా= ఒకటిగా నుండే స్థితి చేత; ఘన= అధికమైన; రస= ఆనందం చేత; గహనాన్= నిండి యున్నట్టి; భోగాన్= సుఖాలను; బధ్నాసి= అనుభవిస్తున్నావు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఆస్థానమండపమందు పూలమాలవలె మృదువైన, సువాసన కల్గినట్టి, పడగలయందలి మణుల కాంతులే చాందినీగా కల్గిన శేష సర్పంమీద కూర్చుండి సమస్త ప్రపంచాన్ని ఒకే గొడుగు క్రింద ఆధిపత్యంతో పాలన చేస్తున్నవాడు శ్రీమన్నారాయణుడు. 'శాంతోదిత' దశ యందు వైశ్వరూప్యమైన తన గుణాలను అనుభవించే నీ ప్రియుడైన ఆ స్వామితో కూడి ఏకీభావంచేత గాఢానురాగానందాన్ని అనుభవిస్తున్నావు.

**వ్యాఖ్య:** ఆస్థానమంటపాన్ని వర్ణించిన తర్వాత, ఆ మండపమందు ఆదిశేషుని మీద ఆసీనుడై విశ్వపాలన చేస్తున్న నారాయణునితో కూడి ఘన రస భోగాలను లక్ష్మీదేవి అనుభవిస్తున్నదని వర్ణితం.

శ్రీ శ్రియఃపతులకు పాన్పుగానుండే ఆదిశేష సర్పం అస్థానమంటపం మీద ఉన్న రీతి మొదట వర్ణింపబడింది.

'భోగం' అంటే ఉన్న నానార్థాలలో పాము శరీరం, పడగ అనే అర్థాలున్నాయి. 'అనంతభోగం, విస్తీర్య'- అంతం లేని గుణాల వైభవంగల

సర్వేశ్వరునికి ప్రధాన కింకరుడైన ఆదిశేషుని గుణవైభవం కూడా స్వామి వంటిదే కాబట్టి, అనంతుడని శేషుడు వ్యవహరింపబడుతున్నాడు. ఆదిశేషుని శరీరం అవసరమున్నంత పరచుకోవడానికి తగినంత విశాలంగా ఉన్నది. ఎత్తుగా నున్నది. పూలమాలవలె చల్లగా, తెల్లగా, మెత్తగా, సువాసన కలిగియున్నది. అనంతుని పడగలయందున్న మణుల కాంతులు మేల్కట్టుచాందినీగా వ్యాపించి ఉన్నాయి.

భగవానుడు శేషశయ్య మీద కూర్చుండి పడగల క్రింద ఏకచ్ఛత్రాధిపత్యంగా లీలావిభూతిని, నిత్య విభూతిని సమస్త ప్రపంచాన్ని- పరిపాలిస్తున్నాడు.

*శాంతోదిత గుణవిభవైః*- పాంచరాత్ర సంహితాలలో శ్రియఃపతికి 'శాంతోదిత దశ, నిత్యోదిత దశ' అనే రెండు స్థితులున్నాయని చెప్పబడుతున్నది. తరంగాలు లేని జలాశయంవలె అధిక శాంతంగా ఉండే స్థితి 'శాంతోదితదశ'- తన వైశ్వరూప్యగుణ వైభవాన్ని తాను అనుభవించే భగవానుని స్థితి 'నిత్యోదిత దశ'.

*అన్యోన్యాద్వైతనిష్ఠా*:- నీకు తగిన కాంతుడు- అని లక్ష్మీదేవిని గూర్చి భక్తులు స్తుతిస్తుంటారు. నీకు తగిన కాంత- అని లక్ష్మీనాథుని స్తోత్రం చేస్తుంటారు. ఒకరి కొకరు తగినవారని అర్థం. 'అద్వైత నిష్ఠా' అంటే శరీరాలు వేర్వేరుగా ఉన్నా ఇద్దఱి మనస్సు ఒక్కటే అనబడే స్థితి. శాంతోదిత దశలో లక్ష్మీపతి లక్ష్మీదేవితో కలిసి- ఏకీభావంతో- అద్వైత స్థితిలో అధికమైన ఆనందాన్ని పొందుతుంటారు దివ్యదంపతులు.

ఈ శ్లోకంలో అనంతుని శేషత్వమూ, శ్రీ శ్రియఃపతుల ఐకరస్యమూ స్తుతింప బడింది. స్రగ్ధరావృత్తం.

*26. భోగ్యావామపి నాంతరీయకతయా పుష్పాంగ రాగైస్సమం*
*నిర్వృత్త ప్రణయాతి వాహన విధౌ నీతాః పరీవాహ తామ్၊*
*దేవి! త్వామను నీళయా సహమహీదేవ్యః సహస్రం తథా*
*యాభిస్త్వం స్తనబాహు దృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే॥*

**అర్థం:** హే దేవి= ఓ లక్ష్మీదేవీ!; వాం, అపి= మీ యిద్దఱికినీ; పుష్ప+అంగరాగైః = పూలతో, చందనం, కస్తూరి మొదలైన మై పూతలతో; సమం= సమానంగా; న+అంతరీయకతయా= విడిచి ఉండని వారవడంచేత (అవశ్య భోగ్యవస్తువులవడం చేత); భోగ్యాః= ప్రియమైనవారు; నిర్వృత్త ప్రణయ+అతివాహనవిధౌ= నిండుప్రేమ ఎక్కువగా ప్రవహించడమనే పద్ధతియందు; పరీవాహతాం= తూములు-మత్తడి కాలువలుగా ఉండే స్థితిని; నీతాః= పొందించబడినవారు; త్వాం= నిన్ను; అను= అనుసరించి; నీళయాసహ= నీళాదేవితోపాటు; మహీ= భూదేవి; తథా= అట్లే (భూనీళల విధంగా); సహస్ర= వేలకొలది; దేవ్యః= దివ్యపత్నులు; సంతి= ఉన్నారు; యాభిః= ఏ దివ్యపత్నులతో; స్వాభిః= నీకు సంబంధించిన; స్తన బాహు దృష్టిభిః, ఇవ= స్తనాలు, బాహువులు, నయనాలు అనే అవయవాలతో వలె; త్వం= నీవు; ప్రియం= ప్రియుడైన శ్రీరంగనాథుణ్ని; శ్లాఘసే= సంతోషింపజేస్తున్నావో.

**తా॥** ఓ శ్రీరంగనాయకీ! మీ ఇద్దఱికి కూడా పూలమాలలు, చందనం మొదలైన అంగరాగాల (పౌడర్ల) యందు ఎంత ఇష్టమో, ఆదరమో, అంత ఇష్టమూ, ఆదరమూ కలవారు భూనీళాది దివ్యపత్నులు. మీ ప్రేమ అనే ప్రవాహం ఎక్కువైనప్పుడు, ఆ ప్రవాహానికి నిర్గమన మార్గాల- తూము- మత్తడి- వంటివారు. అట్టివారైన భూనీళాది దివ్యపత్నులెందఱో నిన్ను అనుసరిస్తున్నారు. నీవు వారియందు అసూయపడకుండా నీ స్తన బాహు నేత్రాలతో సమానమైన వారందఱి తోనూ నీ ప్రియుడైన శ్రీరంగనాథ భగవానుణ్ని ఆనందింపజేస్తున్నావు.

**వ్యాఖ్య:** శ్రీదేవి మాత్రమే కాదు, తనను అనుసరించియున్న భూనీళాది సపత్నులెందఱితోనో తన విభుని ఆనందింపజేస్తుందని శ్రీదేవియొక్క ఔదార్యం సుశ్లోకితం.

ఒక పురుషునికి ఒక భార్యకంటె ఎక్కువ భార్యలు ఉన్నట్లైతే వారిలో పరస్పరంగా ఎంతో అసూయ, మాత్సర్యం ఉండి వారు భర్తకు నరకయాతనను అనుభవింపజేయడాన్ని లోకంలో చూస్తుంటాం కదా!

శ్రీపతికి పట్టపురాణియైన శ్రీదేవితో పాటు భూదేవి, ఆమె వెంట నీళాదేవి, వేలకొలది దివ్యపత్నులూ ఉన్నారు. వీరు శ్రీ శ్రియఃపతులిద్దఱికీ భోగ్యభూతులే.

పుష్పాదులు, చందనం, కస్తూరి, ఇత్తరు మొదలైన మైపూతలు ఆవశ్యంగా మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించి ఉత్తేజింపజేస్తాయి కదా!

*వామపి నాంతరీయకతయా పుష్పాంగ రాగైస్సమం భోగ్యాః*– శ్రీ శ్రీపతుల కిద్దఱికి కూడా అంగరాగాలతో సమానమై అవశ్య భోగ్యంగా ఉన్నవారు భూనీళాది దివ్యపత్నులు.

'నాంతరీయకత'– అంటే అవినాభావం– విడిచి ఉండనిరీతి– అని అర్థం. శ్రీ శ్రియఃపతులు కలిసి ఆనందించే సమయాన తక్కిన దివ్యపత్నులు స్రక్ చందనాది అంగరాగాలవలె భోగ్యోపకరణాలై అన్వయిస్తారని అర్థం. కాబట్టి, ఈ పదం శ్లోకానికి ప్రాణప్రదం. పారతంత్ర్యంలో ఉన్న దివ్యపత్నులు అన్యోన్య స్పర్ధను పొందక, కలిసి సేవ చేయడం వల్ల సవతుల సౌహార్దం తెల్పబడినది.

*నిర్వృత్త ప్రణయాతి వాహన విధౌ నీతాః పరీవాహతామ్:*– చెరువులోకి ప్రవాహించేరి నీటి మట్టం పెరిగిపోతుంటే, పెరుగుతున్న నీటిని... తూము– లేక మత్తడి నుంచి బయటకు పంపడంవల్ల, చెరువుకు గండ్లు పడకుండా, చెరువులో పరిమితమైన నీరు నిల్చి పంటలకు వినియోగపడుతుంది.

*"పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా"*– (ఉ.రా.చ. 3–29). చెరువులో నీటిమట్టం పెరుగుతున్నప్పుడు చెరువుకట్ట తెగిపోకుండా నీటిని బయటకు పంపడమే ప్రతీకారం– అన్నాడు భవభూతి.

చెరువులో నిల్చిన నీరు శ్రీదేవిగానూ, జలనిర్గమనమార్గం ద్వారా బయటకు పంపబడిన నీరు శ్రీదేవియొక్క సవతులుగానూ భావించాలి. నీరంతా ఒక్కటే కాబట్టి లోపలనున్న నీటికి, బయటకు పంపబడిన నీటికి భేదమే లేదు– ఉండదు. పరిమితిని మించి చెరువులో నీటిమట్టం పెరిగిన సందర్భంలో నీటిని బయటకు పంపడం ఎంత ఆవశ్యకమో, శ్రీ శ్రియఃపతుల ప్రేమరసం పొంగిపోతున్నప్పుడు చిన్న చిన్న కాలువలవంటివారైన దివ్య సపత్నులూ అంతే ఆవశ్యకం.

రాసిక్యంలో– స్వామిని సేవించడంలో అందఱు ఒకే విధమైన ఆర్తి కలవారు. ఇట్టి దివ్య పత్నులు ఎవరు?

*దేవి! త్వామనునీళయాసమామహీ దేవ్యః సహస్రం తథా:-* దేవీ అని సంబోధనవల్ల లక్ష్మీదేవి 'కృతాభిషేక' అంటే భగవానునికి ఎందఱు భార్యలున్నప్పటికీ 'పట్టపురాణి' లక్ష్మీదేవియే- అనే అభిప్రాయం గల పదమది.

అనునీళయా సహమహీ- అనడంవల్ల ('సహయుక్తేఽ ప్రధానే'- అనే అనుశాసనాన్ని బట్టి) నీళకంటె భూదేవికి ప్రాధాన్యం సూచితం లక్ష్మిని భూదేవి అనుసరిస్తుంది. భూదేవిని నీళాదేవి అనుసరిస్తుంది. ఇతర సపత్నులు నీళాదేవిని అనుసరిస్తుంటారు. అందఱు కలిసి లక్ష్మీదేవిని ఆశ్రయిస్తారని స్ఫురిస్తుంది.

శ్రీకృష్ణావతారంలో కృష్ణునికి జాంబవతి, మిత్రవింద, సత్యభామ మొదలైన వారు; నరకాసురుని చెరసాలనుంచి విడిపించబడిన పదహారువేల వనితలు కృష్ణునికి భార్యలే కదా!

లక్ష్మీదేవి తన సపత్నులను సంభావించే విధానం నాల్గవ పాదం వివరిస్తుంది.

*యాభిస్త్వం స్తన బాహు దృష్టిభిరివస్వాభిః ప్రియం శ్లాఘసే:-* లక్ష్మీదేవి తన సవతులను తన అవయవాలవలె సంభావిస్తుంది. భూదేవి లక్ష్మీదేవి యొక్క స్తనాలతో సమానం, నీళాదేవి లక్ష్మీదేవియొక్క బాహువులతో సమానం, ఇతర సపత్నులకు లక్ష్మీదేవి యొక్క దృష్టితో సామ్యం చెప్పబడింది. లక్ష్మీదేవి అవయవి. ఇతర సపత్నులు ఆమె అవయవాలే. కాబట్టి, భూనీళాది దివ్య సపత్నులతో ఆశ్రయింపబడుతున్న లక్ష్మీదేవి తాను సంతోషిస్తూ, తన దివ్యాయవ సౌష్ఠవ సౌందర్యంతో తన ప్రియుని సంతోషింపజేస్తున్నది. అట్లే, తన అవయవ సౌందర్యంతో సమానమైన సవతుల సౌందర్యంతో కూడా లక్ష్మీదేవి తన భర్తను ఆనందింపజేస్తూ, తాను కూడా ఆనందిస్తున్నది.

ఒక వనిత తన భర్తతో తానుపొందే సుఖాన్ని తన సవతులు దోచుకుంటున్నారని ఓర్వలేక సవతులపైన మాత్సర్యాన్ని పెంచుకొని, తన నాథునిపైన కోపాగ్నిని వర్షించడం లోకపరిపాటి. కాని, లక్ష్మీదేవి మాత్రం ఈ

లోకంలో అవతరించినప్పుడుగానీ, పరలోకంలో నివసించినప్పుడుగానీ, తన నా(శయించిన భూనీళాది సపత్నులతో వైషమ్యం లేకుండా కలిసియుండి, తన నాథుని ఆనందిపజేస్తూ, తన సుఖాన్ని తన సవతులకు పంచుతూ, తానూ ఆనందిస్తున్నది. శ్రీరంగనాయకి యొక్క ఇంతటి ఔదార్యం వాఙ్మనస్సులకు అగోచరం కదా! శార్దూల విక్రీడితవృత్తం.

*27. తే సాధ్యా స్సంతిదేవా జనని! గుణవపుర్వేషవృత్త స్వరూపైః*
*భోగైర్వా నిర్విశేషాస్సవయస, ఇవయే నిత్యనిర్దోష గంధాః।*
*హే శ్రీః! శ్రీరంగభర్తు స్తవచ పద పరీచార వృత్త్యై సదాపి*
*ప్రేమప్రద్రాణ భావావిల హృదయ హఠాత్కార కైంకర్యభోగాః॥*

**అర్థం:** జనని= తల్లివైన; హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!; యే= ఎవరు; నిత్య నిర్దోష గంధాః= ఎల్లప్పుడు ఏ మాత్రం దోషం అనే వాసన లేనివారో; గుణ వపుర్వేష వృత్త స్వరూపైః/ గుణ= కల్యాణ గుణాలతో; వపుః= దివ్యమైన ఆకారాలతో; వేష= శంఖ చక్రాద్యలంకారాలతో; వృత్త= నడవడులతోను; స్వరూపైః= జ్ఞానానందామలత్వం గల ఆత్మస్వరూపాలతోను; వా= మరియు; భోగైః= అనుభవాలతో; నిర్విశేషాః= ఎట్టి భేదం లేనివారు కావుననే; సవయసః, ఇవ= సమాన వయస్సు కల్గిన మిత్రులవంటి వారో; సదా, అపి= ఎల్లప్పుడు కూడా; ప్రేమ ప్రద్రాణ- భోగాః/ ప్రేమ= భక్తిచేత; ప్రద్రాణ= ద్రవిస్తున్న; భావ= మనోవికారం వల్ల; ఆవిల= కలతను పొందిన- స్వచ్ఛమైన; హృదయ= హృదయాలచేత; హఠాత్కార= బలవంతంగా చేసే; కైంకర్య= కైంకర్యం అనే; భోగాః= అనుభవాలను కలవారో; తే= అటువంటివారైన; సాధ్యాః= సాధ్యులనే; దేవాః= దేవతలు (నిత్యసూరులు); శ్రీరంగభర్తు= శ్రీరంగనాథునికి; తవ, చ= నీకు కూడా (మీ యిద్దఱి యొక్క); పద పరీచార వృత్త్యై= పాదాలను సేవించడం కోసం; సంతి= ఉన్నారు.

**తా॥** ఓ జననీ! శ్రీరంగనాయకీ! నీకు, నీ భర్తకు (ఇద్దఱికీ) శ్రీపాద కైంకర్యం చేయడానికి సాధ్యులు అనబడే నిత్యసూరులున్నారు. వారు ప్రకృతి సంబంధం లేనివారు కాబట్టి ఏ దోషంలేనివారు. గుణాలు, శరీరం, వేషం,

స్వరూపం, భోగం మొదలైన వాటిలో పరస్పరం సమానులై, భగవంతునితో సమాన వయస్సుగల మిత్రులవంటివారుగా కనబడుతారు. అట్టి నిత్యసూరులు ఎవరి ప్రేరణ లేకుండా, సహజమైన ప్రేమార్ద్ర భావంతోనే వెంట వెంట మీకు పరిచర్య చేయనున్నవారు.

**వ్యాఖ్య:** శ్రీ శ్రియఃపతుల పాదసేవచేసే పరిచారకుల ప్రభావం సుశ్లోకితం.

విశిష్టాద్వైత సంప్రదాయంలో దివ్యదంపతుల నిద్దఱిని సేవించడం నియమం. ఒక భగవతినిగానీ, లేదా, ఒక్క భగవానుణ్ణిగానీ విడివిడిగా సేవించడం అపచారం... శూర్పణఖ ఒక్క శ్రీరాముణ్ణి మాత్రమే కోరి సుప్పనాతి అయింది. రావణుడు ఒక్క సీతమ్మనే కోరి చెడిపోయిన సంగతి ప్రసిద్ధం కదా! కాబట్టి, "*శ్రీరంగభర్తుః తవ చ పదపరీ చారవృత్త్యై*"– నీకు, నీ భర్తకు పాదసేవ చేయువారు కూడా గొప్ప మహిమ కలవారని సత్సంప్రదాయ రీతిని ఈ శ్లోకమందు వివరించారు.

శ్రీవిష్ణుమూర్తిని ఆరాధించేవారు, కైంకర్యపరులు విష్ణువుతో సమాన రూపగుణ వేషధారులై యుండవలెను. "*యత్ర పూర్వేసాధ్యాః సంతి దేవాః*"– (పురుషసూక్తం). ఏ పరమపదమందు సనాతనులైన తేజోమూర్తులున్నారో వారు సాధ్యులు– అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు. ఎవరికి భగవత్కైంకర్యం నిరంతరం సాధ్యమైనదో వారు సాధ్యులు– నిత్యాత్మలు.

ఈ సాధ్యదేవత లెట్టివారో వారి రూపగుణ వృత్తులు తెల్పబడుతున్నవి.

*నిత్యనిర్దోష గంధాః*– ఏ మాత్రం దోషమనే వాసన లేనివారు. ప్రకృతి–సంసారబంధముండడమే దోషం. సంసారులకు క్లేశ కర్మ విపాక ఆశయాలుంటాయి.

1) 'క్లేశం'– అంటే, అజ్ఞానం, అహంకారం, రాగం, ద్వేషం అభినివేశం. ఈ క్లేశపంచకం 'చిత్తమాలిన్యం' అనబడును.

2) కర్మ–పుణ్యపాపకర్మలు, రాట్నపు బావివలె సంసార చక్రమందే త్రిప్పుతుంటాయి.

3) విపాకం– జాతి, గుణం, ఆయుష్యం మొదలైనవి.

4) ఆశయం– పుర్వానుభవాన్నిబట్టి శిష్ట సంస్కారమో, దుష్టసంస్కారమో కలిగియుండడం.

నిత్యసూరులకు క్లేశాది దోషాలుగానీ, సంసారమందు ఎప్పుడైనా ఉండడం గానీ, లేనట్టి పరిశుద్ధాత్మలు వారు. నిత్యసూరుల యొక్క గుణరూపాదులు భగవద్గుణ రూపాదులతో సమానంగా ఉంటాయి. 'పరమం సామ్యముపైతి'– అని ఉపనిషత్తు బోధిస్తుంది. భగవానుని గుణాష్టకం ఉపనిషత్ప్రసిద్ధం.

1) అపహత పాప్మత్వం– పుణ్యపాపాలు లేకుండడం.

2) విజరత్వం– ముసలితనం లేకుండడం.

3) విమృత్యుత్వం– చావు– మరణం లేకుండడం.

4) విశోకత్వం– దుఃఖం కల్గకుండడం.

5) విజిఘత్వం– ఆకలి లేకుండడం.

6) అపి పాసత్వం– దప్పిక కల్గక ఉండడం.

7) సత్యకామత్వం– కోరికలు ఫలించడం.

8) సత్య సంకల్పత్వం– ఫలించే సంకల్పాన్ని కల్గియుండడం.

పరమపదానికి చేరిన ముక్తాత్మలకు కూడా ఈ 'గుణాష్టకం' ఆవిర్భవిస్తుంది. 'స్వస్వరూపావిర్భావం' అని అంటారు. 'షాడ్గుణ్యమూర్తి' అని భగవానుణ్ని స్తుతిస్తుంటారు. 'గుణాష్టకమే' కాక షడ్గుణాలు కూడా ప్రత్యేకంగా చెప్పుకోదగినవి ఉన్నాయి (అనంత కల్యాణ గుణమహోదధియే అయినా, పాంచరాత్రా గమాన్నిబట్టి, వ్యూహాత్మకమైన ఆరు గుణాలు శ్లాఘ్యమానమైనవి).

షడ్గుణాలు– జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి తేజస్సు అనేవి ఆరు గుణాలు.

వపుః– శరీరం, అవయవ సౌష్ఠవంగల దివ్యమంగళ విగ్రహం.

వేషం- శంఖ చక్రాదులను, ఊర్ధ్వపుండ్రాలను ధరించడం.

వృత్తం- నడవడి- ఆజ్ఞ, అనుగ్రహం మొదలైన వ్యాపారమే ఉంటుంది కాబట్టి, చేసే కర్మలకు వశం కాకుండడం.

స్వరూపం- రూపం అంటే ఆకారం. ఆత్మయొక్క ఉనికికి 'స్వరూపం' అని పేరు. (స్వరూప, రూప అనే పదాల అర్థం గమనింపదగినది.) జ్ఞానం, ఆనందం, అమలత్వం- స్వచ్ఛత-గా ఉండడమే నిత్యపరిశుద్ధాత్మ స్వరూపం.

సవయసః- సమాన వయస్సు- ఇరవై నాల్గు తత్త్వాలు కలది ప్రకృతి. (25) ఇరవై అయిదవ తత్త్వం పురుషుడు. జీవాత్మ 25 ఏండ్ల వయస్సు కల్గియుండడం. భగవానునిది (26) ఇరవై ఆరవ తత్త్వం. కాబట్టి పరమాత్మ 26 ఏండ్ల వయస్సు కల్గి యుండడం. కాబట్టి, నిత్య ముక్తాత్మలూ, పరమాత్మ మిత్రులుగా నుంటారు.

భోగైః- సుఖానుభవం- భగవదనుభవం, విభూతి అనుభవాలు కలిగి యుండడం. ఇట్టి అనుభవాలతో- నిర్విశేషాః- గుణ రూపాదులలో కొంచెం కూడా ఆత్మలకు, పరమాత్మలకు తరతమ భేదం లేకుండా పరమ సామ్యం ఉంటుందని ఛాందోగ్యోపనిషత్తు నొక్కి చెబుతున్నది. *"భోగః సుఖే స్త్ర్యాది భృతౌ"*- (అమరం). మిత్రులుగా ఎందుకున్నారు? అంటే, *"సదా పశ్యంతి సూరయః"*- ఎల్లప్పుడు భగవానుని సేవిస్తుంటారు- అని శ్రుతి పల్కినట్లే, *"సదాఽపి శ్రీరంగ భర్తుః తవచ పద పరీచారవృత్త్యై"*- ఎల్లప్పుడు లక్ష్మీనారాయణుల పాదసేవ చేయడమే వారి వృత్తి కదా!

*ప్రేమ ప్రద్రాణ భావా విలహృదయ హఠాత్కార భోగాః*- నిత్యసూరుల మనస్సు భగవంతుని పట్ల ఉన్న ప్రేమ- భక్తిచేత హఠాత్తుగా కరిగి- ఆర్ద్రీ భూతమై- దివ్యదంపతుల పాదసేవ చేయక నిల్వలేని స్థితిని పొందియుంటుంది. కాబట్టి, ప్రీతి కారిత కైంకర్యాలను హృదయపూర్వకంగా చేస్తూ ఉండడమే భోగంగా భావించినవారు, సూరులు. శ్రీవైకుంఠమందు నిత్యసూరుల కైంకర్యంతో శ్రీశ్రియః

పతులు ఆనందాన్ని అనుభవిస్తుంటే, ఆనందకందళితులైన దివ్య దంపతులను సేవిస్తూ నిత్యముక్తాత్మలు ఆనందసాగర నిమగ్నాంతరంగులవుతుంటారు.

స్రగ్ధరా వృత్తం.

*28. స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్ర వదనే*
*త్వదా శ్లేషోత్కర్షాత్ భవతిఖలు నిష్కర్ష సమయే।*
*త్వమాసీః మాతః శ్రీః! కమితురిదమిత్థం త్వవిభవః*
*తదంతర్భావాత్ త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి॥*

**అర్థం:** చంద్రవదనే= చంద్రునితో సమానమైన ముఖం కలిగినట్టి; మాతః= తల్లివైన; హేశ్రీః= ఓ లక్ష్మీదేవీ!; నిష్కర్ష సమయే= నిర్ణయించునప్పుడు; భగవతః= భగవానుని యొక్క; ఇదం= ఈ; స్వరూపం= దివ్యాత్మ స్వరూపమూ; స్వాతంత్ర్యం= నిరంకుశమైన అధికారమూ; త్వదాశ్లేషోత్కర్షాత్/ త్వత్= నీ యొక్క; ఆశ్లేష= సంబంధం యొక్క; ఉత్కర్షాత్= అతిశయంవల్ల; భవతి, ఖలు= కలుగుతున్నది కదా!; కమితుః= ప్రియుడైన శ్రీరంగనాథుని యొక్క; ఇదం= ఈ స్వరూపమూ, స్వభావమూ; ఇత్థంత్వ విభవః= ఇటువంటిదనే వైభవం; త్వం= నీవు; ఆసీః= అయి ఉన్నావు; శ్రుతిః, అపి= వేదం కూడా; త్వాం= నిన్ను; తత్+అంతర్భావాత్= ఆ భగవానుని వైభవంలో అంతర్భవించడం వల్ల; పృథక్= వేరుగా; న, అభిధత్తే= పేర్కొనడం లేదు.

**తా॥** జననీ! ఓ శ్రీరంగనాయకీ! భగవానుని స్వరూపం, స్వాతంత్ర్యం నీతో కలిసియున్నందు వల్లనే (భగవానునికి) నిర్ణయింపబడుతున్నది. భగవానుని స్వరూప స్వభావాల వైభవం నీవే అయి ఉన్నావు. శ్రియఃపతి యొక్క పరతత్త్వతా నిర్ణయకోటిలో నీవూ అంతర్భవించి యున్నావు. అందువల్లనే వేదం నిన్ను ఆ పరమాత్ముని కంటే వేరుగా చెప్పలేదు.

**వ్యాఖ్య:** భగవానుని స్వరూప నిరూపక ధర్మమే లక్ష్మీదేవి అని సుశ్లోకితం.

భగవంతుని స్వరూప, స్వాతంత్ర్యాల నిర్ణయం అతనియందు నిత్యం నివసిస్తున్న లక్ష్మీదేవిని చూచియే జరుగుతున్నది. శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని

సత్పురుషులు తీర్మానిస్తున్నారని భావం. పరతత్త్వ నిర్ణయానికి శ్రియఃపతిత్వమే లక్షణం అని స్పష్టీకృతం.

*కమితుః ఇదమిత్థంత్వ విభవః త్వం ఆసీః*- భగవానుని ఇదంత్వ విభవంగానూ, ఇత్థంత్వ విభవంగానూ నీవే అయి ఉన్నావు-

*ఇదంత్వ విభవః*- ఇతను సర్వేశ్వరుడు అనే గొప్పతనం. *ఇత్థంత్వ విభవః* - ఇటువంటివాడు సర్వేశ్వరుడు అనే మహిమ. ఇట్లు ప్రియుడైన సర్వేశ్వరుని యొక్క స్వరూప, స్వభావ ఉభయ వైభవాలను నిర్ణయించేది లక్ష్మీదేవియే అని అర్థం. ఇదే శాస్త్రార్థ నిష్కర్షం.

*తదంతర్భావాత్ త్వం నపృథగ భిధత్తే శ్రుతిరపి:*- శ్రీసూక్తంలో తప్ప, అనంత వేదాల్లో లక్ష్మీదేవిని ఉద్దేశించి వేరుగా పేర్కొనలేదు. కారణమేమి? అంటే పరదైవమైన భగవంతునిలోని భాగమే కాబట్టి, భగవంతుని స్మరించినప్పుడే లక్ష్మీదేవిని స్మరించినట్లే అవుతుంది. భగవానుడు లక్ష్మీకాంతుడు. కమల నయనుని కాంత లక్ష్మీదేవి. 'శ్రియఃపతి' పదంలోనే శ్రీదేవి నామం అంతర్భవించి యుండడం వల్ల వేదం లక్ష్మీదేవిని ప్రత్యేకంగా పేర్కొనలేదని చెప్పబడినది.

ఈ శ్లోకంలో ఉన్న మూడు సంబోధన పదాలు సాభిప్రాయాలు. చంద్రవదనే- భగవంతునికీ, ఆశ్రితులకు కూడా ఆనందాన్ని కలుగజేస్తుంది. తాను భగవంతుణ్ని ఆశ్రయించి, అతడే పరతత్త్వమని తీర్మానించడం వల్ల భగవానునికి ఆహ్లాదం. ఆశ్రితులను భగవత్సన్నిధిలో చేర్చడం వల్ల ఆశ్రితుల కానందం. మాతః- తల్లి. కొలిచేది అని అర్థం. శ్రీమన్నారాయణుని స్వరూపం ఇట్టిది. ఆయన స్వాతంత్ర్యం- స్వభావ ఇంతటిది అని వాటి ప్రమాణ పరిమాణాలను ప్రకటిస్తుందని భావం.

శ్రీః- అనే పదం యొక్క వ్యుత్పత్త్యర్థాలనుబట్టి, లక్ష్మీదేవి భగవత్స్వరూప నిరూపణ కోటిలోనే యున్నందున, శ్రుతి శ్రీమన్నారాయణునికంటె ఆమెను వేరుగా పేర్కొనలేదని సూచితం.

శిఖరిణీ వృత్తం- య మ న స భ ల గ- గణాలుంటాయి.

29. తవ స్పర్శాదీశం స్పృశతికమలే! మంగళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీరసియతః।
ప్రసూనం పుష్యంతీ మపి పరిమళర్ధిం జగదిషుః
న చైవం త్వా దేవం స్వదత ఇతి కశ్చిత్కవయతే॥

**అర్థం:** హే కమలే!= ఓ లక్ష్మీదేవీ!; తవ= నీ యొక్క; స్పర్శాత్= స్పర్శవల్ల; మంగళ పదం= మంగళమనే శబ్దం; ఈశం= భగవానుని; స్పృశతి= స్పృశిస్తున్నది; ఇదం= ఈ మంగళపదం; తవ= నీకు; ఉపాధేః= ఏదో ఒక కారణం వల్ల; న, ఉపనిపతితం= వచ్చిపడినది కాదు; యతః= ఎందువల్ల? (అంటే); శ్రీః= మంగళంగానే; అసి= ఉన్నావు; ప్రసూనం= పూవును; పుష్యంతీం= పోషించే; పరిమళ+ఋద్ధిం, అపి= సువాసన యొక్క సమృద్ధిని కూడా; జగదిషుః= చెప్ప- వర్ణింప- గోరేవాడైన; కశ్చిత్= ఏ ఒక్కడు (కవి); ఏవంత్వాత్= ఇట్లుండడంవల్ల; ఏవం స్వదతే, ఇతి= ఈ విధమైన పరిమళం యొక్క సమృద్ధి పూవుకు హృద్యంగా ఉన్నది- అని; న, చ, కవయతే= వర్ణించడం లేదు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ సంబంధంవల్లనే భగవానుడు మంగళపదంతో నిర్దేశింపబడుతున్నాడు. నీ కారణంగానే మంగళపదం భగవానునికి చెల్లుతున్నట్లు, నీకు మాత్రం ఆ మంగళపదం ఎవరికారణంగానో రాలేదు. ఎందుకంటే, నీవే మంగళస్వరూపిణివి. ఇందుకు దృష్టాంతమేమి? అంటే, పుష్పం యొక్క శోభను సువాసన అతిశయింపజేస్తుంది. ఆ సువాసనకు వేరొక కారణాన్ని ఏ కవి కూడా వర్ణించి యుండలేదు. ఆ సువాసన నీవలెనే స్వతస్సిద్ధమైనది కదా!

**వ్యాఖ్య:** సహజంగా మంగళదేవతయైన లక్ష్మీసంబంధంవల్ల లక్ష్మీపతికి మంగళపదం నిర్దేశింపబడుతున్నదని సుశ్లోకితం.

*"మంగళం భగవాన్ విష్ణుః మంగళం మధుసూదనః।*
*మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః॥"*

*'పవిత్రాణాం పవిత్రం యో మంగళానాంచ మంగళమ్"*- అని నారాయణున్ని 'మంగళాయతనుడు'గా కీర్తించడం, లక్ష్మీదేవి ఆయన వక్షఃస్థల

మందు నిత్య నివాసం చేయడంమే కారణం. లక్ష్మీదేవికి ఈ మంగళ పదం ఔపాధికం- ఎవరి అనుగ్రహం వల్లనో వచ్చినది కాదు. లోకంలో మంగళ వస్తువేదయినా లక్ష్మీదేవి యొక్క అధీనమే. ఆమె స్వతః మంగళదీపరేఖ.

ఉత్తరార్థం ఒక దృష్టాంతంతో నిరూపిస్తున్నది. పుష్పానికి గొప్పతనం పరిమళం వల్లనే కల్గుతుంది. మల్లె, జాజి, సంపెంగ, పొగడపూలు మంచివి అని ప్రసిద్ధిని పొందదానికి కారణం వాటికిగల సువాసనయే కదా! కాని, సువాసనకు గల కారణం ఎవ్వరూ చెప్పలేరు. అది స్వతఃసిద్ధం.

పుష్పంకంటె సువాసన విడిగా ఉండకుండా పుష్పశోభను అధికం చేస్తున్నట్లే, నారాయణుని కంటె లక్ష్మీదేవి విడిగా ఉండకుండా ఆయనకు మంగళత్వాన్ని ఆపాదిస్తున్నది.

పుష్పరూపంగా ఉన్నవాడు నారాయణుడు. సుగంధ రూపంగా ఉన్నది లక్ష్మీదేవి. ఆ దివ్యదంపతులు పూపు- తావి లాగా ఒకరినొకరు విడిచియుందరు- అనడం వ్యంగ్యం. ఈ శ్లోకభావాన్ని బోధిస్తున్నది 'కమలే' అనే సంబోధనాంత పదం.

శిఖరిణీ వృత్తం.

*30. అపాంగాభూయాంసో యదుపరి పరంబ్రహ్మ తద భూత్*
*అమీ యత్ర ద్వ్రిత్రా స్సచ శతమఖాది స్తదధరాత్।*
*అతః శ్రీ! రామ్నాయ స్తదుభయముశం స్త్వాం ప్రణిజగౌ*
*ప్రశస్తిస్సా రాజ్ఞో యదపిచ పురీకోశ కథనమ్॥*

**అర్థం:** హేశ్రీః= ఓ లక్ష్మీదేవీ!; తవ= నీ యొక్క; భూయాం సః= ఎక్కువైన; అపాంగాః= క్రీగంటి చూపులు; యత్+ఉపరి= ఏ వస్తువుమీద ప్రసరిస్తాయో; తత్= ఆ వస్తువు; పరం, బ్రహ్మ= సర్వోత్కృష్టమైన బ్రహ్మ పదార్థంగా; అభూత్= అయ్యెను; అమీ= ఈ నీ కడగంటి చూపులు; యత్ర= ఏ వస్తువునందు; ద్విత్రాః= రెండు

మూడు పడుతున్నవో; సః, చ= అది కూడా; తత్+అధరాత్= ఆ పరబ్రహ్మ కంటె తర్వాతదైన; శతమఖ+ఆదిః= ఇంద్రుడు మొదలైన పదార్థంగా; అభూత్= ఆయెను; అతః= ఇందువల్ల; తత్+ఉభయం= ఆ పరబ్రహ్మ రూపమైన ఇంద్రరూపమైన రెండు పదార్థాలను; ఉశన్= చెబుతూ; ఆమ్నాయః= వేదం; త్వాం= నిన్ను; ప్రణిజగౌ= బాగా చెప్పెను; పురీకోశ కథనం= పట్టణ కోశాగారాన్ని ప్రశంసించడం; యత్= ఏ దైతే కలదో; సా, చ= అదికూడా; రాజ్ఞః= రాజు యొక్క; ప్రశస్తిః= ప్రసిద్ధియే కదా!

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ కటాక్షం అధికంగా ఏ వస్తువు మీద ప్రసరించెనో ఆ వస్తువు పరబ్రహ్మగా అయినది. అదే నీ కటాక్షం కొంచెం తక్కువగా ప్రసరించగా అది ఇంద్రాది రూపమయినది. కాబట్టి బ్రహ్మరూపాన్ని, ఇంద్రాది లోకపాలురను- ఆ రెండు పదార్థాలను వేదం కీర్తించింది. ఆ విధంగా వేదం ప్రశంసించడం, నిన్ను ప్రశంసించడమే కదా! పట్టణంలోని కోశాగారం సంపదతో నిండియున్నదని వర్ణించినచో, ఆ వర్ణన ఆ నగరపాలకుడైన ప్రభువుయొక్క ప్రశస్తినే- గొప్పతనాన్నే చెబుతున్నట్లు అవుతుంది కదా!

**వ్యాఖ్య:** రాష్ట్రకోశాగారం నిండుగా నున్నదని అంటే ఆ రాష్ట్ర ప్రభువు యొక్క ప్రశస్తినే తెల్పుతున్నట్లు, లక్ష్మీకటాక్షంవల్ల సత్తనుపొందిన పరబ్రహ్మ మరియు ఇంద్రాది లోకపాలుర వైభవాన్ని వేదం వర్ణించిందంటే, లక్ష్మీదేవి యొక్క వైభవం కటాక్ష తారతమ్య రూపం వర్ణితం. శ్రీదేవి యొక్క సంపూర్ణ కటాక్షంవల్ల పరబ్రహ్మ రూపమేర్పడింది. ఆమె యొక్క కడగంటి చూపులలోని రెండు మూడు కణాలే ప్రసరించడంవల్ల, తక్కువగా పడినందువల్ల- ఆ వస్తువులు ఇంద్రాది లోకపాలుర రూపాలుగా ఉద్భవించాయి.

ధనాగార వర్ణనం రాజు యొక్క ప్రశస్తిని తెల్పడమనేది సామాన్య నిర్దేశం; దీనిచేత పరబ్రహ్మాదులను వేదం వర్ణించడంవల్ల, అది లక్ష్మీదేవియొక్క ప్రశస్తియే అను విశేషం సమర్థింపబడినది.

సామాన్య వాక్యంచేత విశేషవాక్యం సమర్థించడం అర్థాంతరన్యాసాలంకార లక్షణం.

(ప్రణి జగౌ= స్పష్టంగా చెప్పెను- అని అర్థం. ప్ర, ని పూర్వకమైన 'గై శబ్దే' అను ధాతువుయొక్క 'లిట్' పరస్మైపద ప్రథమ పురుషైక వచనం.)

య మ న స భ ల గ- గణాలు కల్గియున్న - 'శిఖరిణీ' వృత్తం.

*31. స్వతఃశ్రీ! స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్*
*తదాయత్తర్ధిత్వేఽ ప్య భవ దపరాధీన విభవః।*
*స్వయాదీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం*
*న కుంఠ స్వాతంత్ర్యం భవతి చ న చాన్యాహిత గుణమ్॥*

**అర్థం:** హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!; త్వం= నీవు; విష్ణోః= విష్ణు భగవానునికి; స్వతః= సహజంగానే; స్వం= సొత్తువుగా; అసి= ఉన్నావు; తతః,ఏవ= అందువల్లనే; ఏషః= ఈ; భగవాన్= శ్రీరంగనాథుడు; త్వత్+ఆయత్త+ఋద్ధిత్వే, అపి= నీ అధీనంలో ఉండే గొప్పతనం (ఐశ్వర్యం) కలవాడైననూ; అపర+అధీన, విభవః= పరాధీనం కానట్టి, వైభవం కలవాడు; అభవత్= అయినాడు; రత్నం= రత్నం; స్వయా= తనదైన; దీప్త్యా= కాంతితో; మహా+అర్ఘం= గొప్ప విలువ కలది; భవత్+అపి= అయినప్పటికీ; విగుణం= గుణంలేనిది; న= కాదు; కుంఠస్వాతంత్ర్యం, చ= పోయిన స్వాతంత్ర్యం (ప్రాముఖ్యం) కలది కూడా; న= కాదు; అన్య+ఆ హిత; గుణం= ఇతరులవల్ల కలిగిన అతిశయం; న, చ, భవతి= కల్గియుండడమే లేదు.

**తా॥** ఓ శ్రీదేవీ! నీవు విష్ణు భగవానుని సొమ్మువైయున్నావు. ఆకారణంవల్లనే, ఆయన ఐశ్వర్యమంతా నీ అధీనమందే ఉన్నది. అయినా, ఆ స్వామి పరాధీన వైభవం కలవాడు కాదు. ఎట్లు? అంటే; రత్నం యొక్క గొప్ప విలువ దాని కాంతి వల్లనే కలిగియున్నప్పటికీ రత్నం అమూల్యంగానే ఉంటుంది. రత్నం తన గుణాన్ని గానీ, ప్రాముఖ్యాన్ని గానీ కోల్పోదు. రత్నం యొక్క శ్రేష్ఠమైన గుణం ఇతరులచేత సంక్రమించినది కానే కాదు.

**వ్యాఖ్య:** లక్ష్మీకటాక్షం వల్లనే భగవానుని వైభవం ప్రశంసింపబడుతున్నది. అయితే భగవదైశ్వర్యం లక్ష్మీదేవి అధీనమైయున్నందున, ఆయన గుణ సంపద,

స్వాతంత్ర్యాది వైభవం ఇతరులచే సంక్రమించినదే- పరాధీనమైనదీ- అని భావించే అవకాశమున్నది. అట్టి భావనను- శంకను- దృష్టాంతబలంతో పరిహరిస్తున్న శ్లోకమిది.

లక్ష్మీదేవి ఎవరు? విష్ణుపత్ని- విష్ణుభగవానుని సొమ్ము 'స్వం' అంటే సొమ్ము. 'స్వం' కలవాడు స్వామి. తన సొమ్మును తాను ఇష్టమున్నట్లు వినియోగించు కొంటాడు కదా! భగవానునికి లక్ష్మీదేవియందు స్వత్వమున్నది.

*"స్వత్వమాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితం।*
*ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావం చ సదాస్మర॥"*

ఆత్మలు సొమ్ముగా ఉండడం, పరబ్రహ్మ స్వామిగా ఉండడం స్వాభావికం.

*"దాస భూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః॥"*- జీవ సమూహమంతా పరమాత్మకు దాసవర్గమవడం సహజమైనదే కదా! లక్ష్మీదేవి కూడా భగవానునికి మాత్రమే దాసురాలై, ఇతరులకు స్వామినియై ఉంటుంది. తత ఏవ- అందువల్లనే, మనమందరం లక్ష్మీదేవికి శేషభూతులం, నారాయణునికి లక్ష్మి శేషభూతురాలు. కాబట్టి, శ్రీమన్నారాయణుడే 'సర్వ శేషి' అనడం సంప్రదాయం.

ఇతరులవల్ల కల్గినది కానందున కేవలం తనదైన లక్ష్మీదేవికి అధీనమైన సంపద కలవాడు భగవానుడు- అని స్తుతింపబడినాడు. అట్లు చెప్పినంత మాత్రాన భగవానుడు పరాధీన విభవం కలవాడు కాడు, స్వతంత్ర వైభవశాలియే- అని 'దృష్టాంతం' తో సమర్థింపబడుతున్నది.

*రత్నం స్వయాదీప్త్యా మహార్ఘం భవదపిన విగుణం భవతి:*- రత్నం తన కాంతివల్లనే గొప్ప విలువను కలిగి యుంటుంది. అయినా రత్నం గుణహీనం కావడం లేదు. అన్యాధీన వైభవాన్ని కల్గినది కూడా అవడం లేదు. రత్నం యొక్క స్వరూపాన్ని నిరూపించే కాంతివల్ల కలిగే గొప్ప విలువ రత్నం యొక్క అధీనమయ్యే ఉంటుంది తప్ప పరకీయం కాదు కదా!

ఇక్కడ, రత్నం విష్ణువు. కాంతి లక్ష్మీదేవి. రత్నమందలి ఒక భాగమైన కాంతి, రత్నం యొక్క విలువను పెంచినట్లే, భగవానుని క్షణమైనా విడిచి యుండని లక్ష్మీదేవి భగవద్వైభవాన్ని పెంచుతున్నది. అయినా రత్నానికి వలె భగవానుని ప్రాముఖ్యానికి కొరత లేదు- అని సారార్థం.

అది దంపతుల తత్త్వం ఒకరిని విడచి మరొకరు ఉండని తత్త్వం కదా! సూర్యునికి గానీ, రత్నానికిగానీ కాంతివల్లనే గొప్పతనం.

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా"- సూర్యునికి కాంతివలె శ్రీరామునికి నేను- అని సీతాదేవి రావణుని చూచి పలికింది.

శ్రీరాముడు కూడా "అనన్యాహి మయా సీతా భాస్కరేణ ప్రభాయథా"- సూర్యునికి కాంతి యెట్లో, నాకు సీత అట్లే- అని వ్యక్త పరచాడు. (ఇది శ్రీమద్రామాయణంలో ప్రసిద్ధమే.)

ఆళ్వార్లు "మణియే మణిమాణిక్కమే"- అని శ్రీరాముణ్ణి రత్నంగా సంబోధించడం గమనీయం. సీతవల్లనే కదా రామరత్నం కీర్తింపబడుతున్నది.

శిఖరిణీవృత్తం.

32. *ప్రశకన బలజ్యోతిర్జ్ఞా నైశ్వరీ విజయ ప్రథా*
*ప్రణత వరణ ప్రేమక్షేమంకరత్వ పురస్సరాః*
*అపి పరిమళః కాంతి ర్లావణ్య మర్చిరి తీందిరే*
*తవ భగవతశ్చైతే సాధారణా గుణ రాశయః॥*

**అర్థం:** హే ఇందిరే= ఓ లక్ష్మీదేవీ!; ప్రశకన-పురస్సరాః/ ప్రశకన= గొప్పశక్తి; బల= బలం; జ్యోతిః= తేజస్సు; జ్ఞాన= జ్ఞానం; ఐశ్వరీ= ఐశ్వర్యం; విజయ= వీర్యం; ప్రథా= ప్రసిద్ధి; ప్రణతవరణ= ఆశ్రితులను స్వీకరించడం; ప్రేమ= ఆశ్రితులపట్ల ప్రీతి; క్షేమంకరత్వం= ఆశ్రితులకు క్షేమంకల్గజేయడం; పురస్సరాః= మొదలైన; ఏతే= ఈ ఆత్మ (స్వరూప) గుణాలు; పరిమళః= సువాసన; కాంతిః= సౌందర్యం; లావణ్యం=

సామూహికమైన అందం; అర్చిః= మెఱుపు; ఇతి= అనే; గుణరాశయః, అపి= కల్యాణ గుణ సమూహాలు కూడా; తవ= నీకు; భగవతః, చ= భగవంతునికినీ; సాధారణాః= సమానాలుగా ఉన్నాయి.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! శక్తి, బలం, తేజస్సు, జ్ఞానం, ప్రభుత్వం, విజయప్రథ (జయశీలత్వం యొక్క ప్రశస్తి), ఆశ్రితులను స్వీకరించడం, ఆశ్రితుల యందు ప్రీతి, ఆశ్రితులకు ఇష్ట సాధనత్వం, అనిష్ట నివారకత్వం అనే క్షేమాన్ని కల్గజేయడం మొదలైన గుణాలు ఆత్మ (స్వరూపానికి సంబంధించిన) గుణాలు, మరియు సౌగంధ్యం, సౌందర్యం, లావణ్యం, అర్చిస్సు అంటే ఇతర వస్తువులను ప్రకాశింప జేయడం మొదలైన గుణాలు శరీరానికి సంబంధించినవి. ఈ రెండు విధాలైన గుణరాశులు లక్ష్మీనారాయణులిద్దఱికి సమానంగా ధరింపబడి యున్నాయి.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి యొక్క స్వరూపాన్ని చెప్పిన తర్వాత స్వరూపాన్ని ఆశ్రయించి ఉండే గుణాలను, దివ్యమంగళ విగ్రహాన్ని ఆశ్రయించి ఉండే గుణాలను చెప్పుతూ లక్ష్మీనారాయణులిద్దఱికీ సాధారణంగా ఉన్న కొన్ని గుణాలను ఈ శ్లోకం వివరిస్తున్నది.

మొదటి చరణంలో 'ప్రశకనబలజ్యోతిర్జ్ఞానైశ్వరీ విజయ ప్రథా' అని షాడ్గుణ్యం నిర్దిష్టమైనది. ప్రశకనం అంటే శక్తి. 'శక్తి' అంటే, ఎంతటి ఘనకార్యాన్ని కూడా తేలికగా పూర్తిచేయగల్గడం. 'బలం' అంటే ఆయాసపడకుండా అన్నిటినీ లీలగా ధరించడం. జ్యోతిః అంటే తేజస్సు– ఎవరిచేతనూ తిరస్కరింపబడనట్టి, మఱొకరి సహాయం లేకుండా పని పూర్తిచేసే సామర్థ్యం; జ్ఞానం అంటే ఒకే సమయాన అన్ని విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా తెలుసుకోవడం. ఐశ్వరి అంటె ఐశ్వర్యం– తనకిష్టమైన రీతిలో అన్నిటినీ అందఱినీ నియమించే ప్రాభవం. విజయం అంటే వీర్యం. ఇతరులను వినోదంగా గెల్చే ప్రక్రియ. విజయం యొక్క ప్రశస్తియే 'విజయప్రథ'. "శత్రోః ప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః"– అని రావణుని చేత శ్రీరాముని విక్రమం ప్రశంసింపబడినట్లు, పగతుర చిత్తాన్ని కూడా రంజింప జేసే జయశీలమైన ప్రసిద్ధగుణం. సీతాదేవి యొక్క విజయప్రథ శతకంధర సంహారమందు (వాసిష్ఠ రామాయణంలో) సువ్యక్తమే.

ఇక రెండవ చరణంలో- ప్రణతవరణం అంటే నమ్రులై ఆశ్రయించిన వారిని అంగీకరించడం; ప్రేమ అంటే ప్రణతులపట్ల ఉండే ప్రీతి- ఆశ్రితుల వియోగాన్ని సహించలేని గుణం. క్షేమంకరత్వం అంటే ఆశ్రితులకు ఇష్టంకాని వాటిని తొలగించి, ఇష్టమైన వాటిని కలిగించడం. ఈ కల్యాణ గుణాలు దివ్యాత్మ స్వరూప గుణాలుగా అనుసంధింపబడినవి. అంతస్సౌందర్యాన్ని వృద్ధిపరచేవి కాబట్టి అంతఃకరణ గుణాలని చెప్పదగినవి.

మూడవ చరణంలో దివ్య విగ్రహం- శరీరం యొక్క గుణాలు అనుసంధింప బడినవి. పరిమళం అంటే సౌగంధ్యం- ఎల్లప్పుడు సువాసన ఘుమ ఘుమగా గుబాళిస్తుంది.

ప్రతి అవయవ సౌందర్యం కాంతి అనబడుతుంది. "తోళ్ కండార్ తోళే కండార్, తాళ్ కండార్ తాళే కండార్"- (కంబరామాయణం) బాహువులను చూచినవారు బాహువులనే చూచారు. పాదాలను దర్శించినవారు పాదాలనే దర్శించారు- అన్నట్లు ఉండే ప్రత్యంగ సౌందర్యం. లావణ్యం అంటే సముదాయ శోభ. ఒక్కొక్క అవయవమందలి సౌందర్యం అంతా శరీరం నిండా వ్యాపించి యున్న అంగిసౌందర్యం హృదయావర్జకం కదా! అర్చిస్సు ఇతరులను ప్రకాశింప జేసే ఉజ్జ్వల గుణం. మొదట తమ శరీర గుణమైన ఔజ్జ్వల్యంతోనూ, వెనువెంటనే, ఆత్మగుణమైన జ్ఞానంతోనూ తమను సేవించేవారిని ప్రకాశింపజేయడం. ఆశ్రితులకు ఉపయోగపడునట్టిది.

ఇందిరే! అని లక్ష్మీదేవి సంబోధింపబడినది. "ఇది-పరమైశ్వర్యే"- అని ధాత్వర్థం. 'ఐశ్వర్యవతి' అని అర్థం. లక్ష్మీనారాయణులిద్దటికీ స్వరూపగతమైన, దివ్య శరీర గతమైన గుణాలు సమానంగా ఉన్నాయి. భగవానుడు ఇష్టప్రాప్తి, అనిష్ట నివారణం అనే (క్షేమంకరత్వం) గుణాలను సాక్షాత్తుగా చేయగల్గినవాడు కాగా, సామాన్యంగా లక్ష్మీదేవి అనిష్ట నివారణను భగవానుని పురస్కరించుకొని చేయించగలుగుతుంది.

*"సహధర్మచరీం శౌరేః సంమంత్రిత జగద్ధితాం।*
*అనుగ్రహయీం వందే నిత్యమజ్ఞాత నిగ్రహామ్॥"* (యతిరాజసప్తతి)

శౌరికి సహధర్మచారిణి కదా! జగత్తుకు హితాన్ని బాగా ఆలోచిస్తుంది. అనుగ్రహమే లక్ష్మీరూపంగా కనబడుతున్నది. ఎప్పుడూ నిగ్రహాన్ని- కోపాన్ని- తెలియనట్టిదైన లక్ష్మీదేవికి స్తుతిస్తూ నమస్కరిస్తున్నాను అన్నారు శ్రీ వేదాంత దేశికులు.

హనుమంతుని తోకకు నిప్పు పెట్టబడినదని తెలిసిన సీతమ్మ హనుమకు, తనకు (అందటికి) ఇష్టమైన పనిని- *"శీతోభవ హనుమతః"*- అని పల్కి నిప్పును నీరుగార్చగలిగింది.

అలాగే, రావణున్ని *"దగ్ధోభవ దశానన"*- అని (రావణా! నీవు దగ్ధమయిపో) అని పల్కి భస్మం చేసి తనను రక్షించుకొనే శక్తి కలదే అయిననూ, భస్మం చేయగల్గలేదు. కారణం కూడా సీతమ్మనే ప్రకటించింది.

*"అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్।*
*నత్వాకుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా॥"*

దశగ్రీవా! శ్రీరాముడు ఆజ్ఞాపించలేదు. తపస్సును నియతంగా పాలిస్తున్నాను. కాబట్టి, నిన్ను నేను బూడిద చేయగలిగినా, చేయడం లేదు- అన్నది. శ్రీరామపత్ని యైనందువల్ల శ్రీరామునిచే నిర్వహింప దగిన విరోధి నిరసన కోసం తన శక్తిని ఉపయోగించడానికి స్వతంత్రించలేదు కదా!

'గుణరాశయః'- రాశి అంటే సమూహమని అర్థం. 'రాశయః' అని బహువచన పదం కదా! దీనివల్ల ఇట్టి కల్యాణ గుణాలు సముద్రంలోని రత్నాల రాశులవలె లెక్కకు మిక్కిలిగా నున్నవన్నమాట.

న స మ ర స ల గ - గణాలు కలది- హరిణీవృత్తం.

*33. అన్యేఽపి యౌవనముఖా యువయోస్సమానాః*
*శ్రీరంగమంగళ విజృంభణ వైజయంతి।*
*తస్మిం స్తవ త్వయి చతస్య పరస్పరేణ*
*సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదంతే॥*

**అర్థం:** శ్రీరంగ మంగళ విజృంభణ వైజయంతి= శ్రీరంగమందు ఉత్సవాలను విస్తరింపజేసే ధ్వజం వంటి దేవతామూర్తివైన ఓ లక్ష్మీదేవీ!; అన్యే= ఇతరమైన; యౌవన ముఖాః, అపి= యౌవనం మొదలైన గుణాలు కూడా; యువయోః= మీ ఇద్దరికీ; సమానాః= సమానాలు; తవ= నీ యొక్క గుణాలు; తస్మిన్= శ్రీరంగనాథునిలో; తస్య= ఆ స్వామియొక్క గుణాలు; త్వయి, చ= నీలో కూడా; దర్పణే, ఇవ= అద్దమందు వలె; పరస్పరేణ= అన్యోన్యంగా; సంస్తీర్య= ప్రతిఫలించి; ప్రచురం= అధికంగా; స్వదంతే= ఆస్వాదింపబడుతున్నవి- మీ ఇద్దరికి ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

**తా॥** శ్రీరంగనిలయమందు ఉత్సవాది శుభకార్యాలను అధికంగా కల్గజేసే పతాకవైన ఓ లక్ష్మీదేవీ! గత శ్లోకమందు చెప్పబడిన రెండురకాల గుణాలు కాక మిగిలిన యౌవన, సౌకుమార్యం మొదలైన గుణాలు కూడా మీ యిద్దరికి సమానాలై ఉన్నాయి. నీ గుణాలు నీ పతియందు, నీ పతియొక్క గుణాలు నీ యందును అద్దంలో వలె ప్రతిబింబించి, మీ యిర్వురికి అన్యోన్యంగా ఆనందాన్ని విశేషంగా కల్గిస్తున్నాయి.

**వ్యాఖ్య:** వైజయంతి అంటే ఇక్కడ ధ్వజం, పతాక అని అర్థం.

లక్ష్మీదేవి శ్రీరంగనిలయంలో ఉత్సవాదీ శుభకార్యాలను విరివిగా వ్యాపింపజేసే ధ్వజం వంటిదని సంబోధింపబడింది. దేవాలయాలలో నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, నక్షత్రోత్సవ, బ్రహ్మోత్సవాలు ఆగమ శాస్త్రోక్తంగా జరుపబడుతాయి. ఉత్సవాలు ధ్వజారోహణతో ఆరంభమై ధ్వజావరోహణంతో సమాప్తమవుతాయి. (లక్ష్మీదేవి అట్టి ధ్వజం మాత్రం కాదు) వేర్వేఱు దేవతామూర్తులకు వేర్వేఱు ధ్వజాలు- వాహనాలు ఉంటాయి. లక్ష్మీదేవి మాత్రం

విలక్షణమైన ధ్వజం అని స్తుతింపబడుతున్నది. ముఖ్యంగా 'వైజయంతి' అంటే 'విజయ చిహ్నం' అని అర్థం. శుభకార్యాలను శ్రీరంగ క్షేత్రమందు ఎక్కువగా కల్పించే సామర్థ్యం కలది. భగవదుత్సవాలను సేవించే భక్తులకు సకల శుభాలను కలిగించే దేవతామూర్తి అనే భావం గమనింపదగినది.

అన్యేఽపి యౌవనముఖాః సమానాః- లక్ష్మీనారాయణులవి ప్రాకృత శరీరాలు కావు. వారి శరీరాలకు బాల్యకౌమార జరాది దశలుండవు- వికారం పొందనివి. కాబట్టి వారు నిత్య యౌవనులు, వికసించిన పూలరేకులవలె వారి దివ్యమైన అవయవాలు చాలా సుకుమారమైనవి. అన్యే, అపి- అనడంవల్ల, గత శ్లోకంలో చెప్పబడిన ప్రశకన బలాది గుణాలు మరియు పరిమళాది గుణాలు- ఈ రెండు రకాల గుణాలే కాక, మిగిలిన గుణాలు (ఈ శ్లోకమందు చెప్పబడిన యౌవన, మార్దవాది గుణాలు) కూడా పరస్పరంగా అద్దంలో ప్రతిబింబిస్తున్నవి. గుణాలన్నీ ఇద్దఱికి సమానమైనవే.

తన సౌందర్యాన్ని అద్దంలో తాను చూచుకొన్నప్పుడే కదా! తనకానందం కలుగుతుంది. అట్లే, తన గుణాలను లక్ష్మి తన పతియందు అద్దంలో వలె ప్రతిబింబించగా చూచుకొని ఆనందపడుతున్నది. నారాయణుడు కూడా తన గుణాలను లక్ష్మీరూపమందు ప్రతిఫలించగా చూచుకొని ఆనందపడడం ఈ శ్లోకమందు విశేషంగా వర్ణింపబడినది. సమానంగా ఆనందాన్ని కల్గజేసే వారిద్దఱివి, పరస్పర ప్రతిబింబరూపాలని విశదపరచినది ఈ శ్లోకం. కవి కాళిదాసు శ్లోకం స్మరణీయం.

పరస్పరాక్షి సాదృశ్యం అదూరోజ్ఝిత వర్త్మసు।
మృగద్వంద్వేషు పశ్యంతౌ స్యందనాబద్ధ దృష్టిషు॥ (రఘు. 1స. 40 శ్లో.)

వసిష్ఠాశ్రమానికి సుదక్షిణా దిలీపులు రథంమీద వెళ్ళుతుండగా, దారికి దగ్గరగానున్న మగ ఆడు జింకలు రథంవైపే చూస్తున్నాయి. అప్పుడు ఈ రాజదంపతులు ఆ జింకల జంటల కన్నులూ, తమ కన్నులూ ఒక్కరీతిగ నున్నవని చూచుకొంటూ వెళ్ళినారు- అని వర్ణించాడు.

'పరస్పరాక్షి సాదృశ్యం'- అంటే, మగ జింకల కన్నులయందు సుదక్షిణ, దిలీపుని కన్నుల సామ్యాన్ని; దిలీపుడు, ఆడు జింకల కన్నులందు సుదక్షిణ కన్నుల సామ్యాన్ని చూచి సంతోషిస్తూ వెళ్ళినారు- అని భావం.

ఈ వర్ణనలో మూడవ వ్యక్తి యొక్క ప్రసక్తి/ ప్రమేయం స్పష్టంగా నున్నది. శ్రీ పరాశర భట్టర్ మాత్రం, లక్ష్మీనారాయణులే, మూడవ వ్యక్తి లేకుండా, తమ గుణాలను రెండవ వారియందు దర్పణంలో చూచి ఆనందించారని వర్ణించడం, (భట్టర్) అనితరసాధారణ శక్తి కలవారనడానికి తార్కాణం.

వసంత తిలకావృత్తం.

*34. యువత్వాదౌతుల్యేఽప్య పరవశతా శత్రుశమన*
*స్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్త్వసులభాన్।*
*త్వయి స్త్రీత్వైకాంతాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా*
*క్షమాదీన్వా భోక్తుం భవతియువయోరాత్మని భిదా॥*

**అర్థం:** యువత్వ+ఆదౌ= యౌవనం మొదలైన గుణాలు; తుల్యే, అపి= (మీ యిద్దఱికి) సమానాలే అయినా; భగవతి= శ్రీరంగనాథుని యందు; పుంస్త్వసులభాన్= పురుషత్వానికి సులభాలైన; అపర- భాన్/ అపరవశతా= ఇతరుల అధీనంలో లేకపోవడం- స్వాతంత్ర్యం; శత్రుశమన= పగతురను నశింపజేయడం; స్థిరత్వ= దృఢంగా ఉండడం; ఆదీన్= మొదలైన; గుణాలను; కృత్వా= భావనజేసి; త్వయి= నీ యందు; స్త్రీత్వ+ఏకాంతాన్= స్త్రీత్వానికే ఉండదగిన; మ్రదిమ-క్షమాదీన్, వా/ మ్రదిమ= మృదువైన హృదయం- మార్దవం; పతి పారార్థ్యం= పతికి పరతంత్రయై ఉండడం; కరుణా= దయ; క్షమా= సహనం; ఆదీన్, వా= మొదలైన గుణాలను కూడా; కృత్వా= ఆలోచించి, భావించి; భోక్తుం= (మగ, ఆడ గుణాలను) అనుభవించ డానికి; యువయోః= మీ ఇద్దఱి యొక్క; ఆత్మని= స్వరూపమందు; భిదా= భేదం; భవతి= కలుగుతున్నది.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఇంతవరకు జెప్పిన యౌవనం, సౌందర్యం మొదలైన గుణాలు మీ ఇద్దఱికి సమానమే అయినా పురుషునికి తగిన స్వాతంత్ర్యం, విరోధి నిరసనం, స్థిరత్వం అనే గుణాలు విష్ణువునందు ఉండి, స్త్రీకి ఉండదగిన మృదుహృదయం, పతివ్రతాత్వం, దయ, ఓర్పు అనే గుణాలు నీలో ఉండి మీ యిర్వుర స్వరూప భేదాన్ని భక్తులకు తెల్పుతున్నాయి.

**వ్యాఖ్య:** స్త్రీ పురుష స్వరూప భేదాన్ని తెలిపే గుణాలు కొన్ని ఉన్నాయని సుశ్లోకితం.

యౌవనాది గుణాలు శ్రీశ్రియఃపతులిద్దఱియందును సాధారణ గుణాలుగా వర్ణింపబడినందున, వారి స్వరూప భేదం తెలియడం లేదు. ఇతడు మగవాడు, ఈమె మగువ అని తెలియజేసే గుణాలు స్వరూప భేదకాలు. పురుషునికి ఉండే స్వాతంత్ర్యం, శత్రువులను నశింపజేయడం, స్థిరత్వం అనే గుణాలు శ్రీహరి యందున్నాయి. కాబట్టి పురుషోత్తముడని వ్యవహరింపబడుతున్నాడు. స్త్రీకి ఉండే పతివ్రతాత్వం (భర్తకు అనుకూలంగా ఉండడం); దయ– పరదుఃఖ దుఃఖిత్వం; ఓర్పు అనే గుణాలు లక్ష్మీదేవి యందున్నాయి కాబట్టి "నారీణాం ఉత్తమావధూః"– స్త్రీలలో శ్రేష్ఠురాలు అనే ప్రసిద్ధిని పొందింది.

'వా' అనే పదం (చ) కూడా అనే అర్థమిస్తుంది. ఇక్కడ అది వికల్పార్థంగా వాడబడలేదు.

శత్రుశమనం, స్థిరత్వం రెండు వేర్వేఱు పదాలు కావని శత్రు శమనందు స్థిరత్వం– పగవారిని నాశనం చేయడంలో పట్టువిడువక ఉండడం– అని ఒకే సమాస పదంగా– ఒకే గుణమని– భావించడం సముచితం.

*"అప్యహంజీవితం జహ్యాంత్వాం వాసీతే! సలక్షణాం।*
*నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః॥"*

"సీతా! నా ప్రాణాలనైనా వదలుకొంటాను. లక్ష్మణునితో పాటు నిన్ను కూడా విడచిపెడతాను. కాని ముఖ్యంగా బ్రాహ్మణులకిచ్చిన మాటను మాత్రం తప్పను"– అని శ్రీరాముడన్న మాటలో విరోధులను నిరసించే పట్టుదలను–

ప్రతిజ్ఞను ప్రమాణంగా గ్రహింపదగును. ఇట్టి గుణాలు మగవారికి- భగవంతునికే ఉండతగినవని వర్ణింపబడినాయి.

ఇక సాధారణంగా పురుషులు కఠిన హృదయులై ఉంటారు స్త్రీలు సహజంగా సున్నితమైన మనస్సును కల్గియుంటారు. కరుణ, క్షమ భగవానునికి కూడా ఉండగలవు- అని చెప్పిననూ, స్వామి అప్పుడప్పుడు ఈ పాపిని నరకంలోకి త్రోసివేస్తాను (క్షిపామి) అనియు నేను సహించను, క్షమించను (నక్షమామి) అని నిగ్రహించే సమర్థుడు, నిరంకుశుడు. కాబట్టి మ్రదిమ, పతిపారార్థ్యం, కరుణ, క్షమ అనే గుణాలు స్త్రీలకు (ఐకాంతికాలు) మాత్రమే ఉండదగినవి.

శ్లోకంలోని చివరిపాదమందు 'భోక్తుం' పదానికి మారుగా 'భోక్తుః' అని కొందఱు పఠిస్తారు. 'భోక్తుః' అనే పదం ఏక వచనమే అయినా, జాత్యేకవచనంగా భావించి 'అనుభవించేవారికి' అనే అర్థం చెబుతారు. సంస్కృత వ్యాఖ్యానంలో "అనుభవితౄణాం ఇతిశేషః"- ఉన్నది. 'శేషః' అంటే అధ్యాహారం- (లేని పదాన్ని తెచ్చిపెట్టుకోవడం). 'భోక్తుం' అనే పదంతో అన్వయం కుదురుతున్నప్పుడు వేరే పదాన్ని తెచ్చిపెట్టుకొనే శ్రమ అనవసరం కదా! శ్రీపతి పురుషత్వానికి తగిన కల్యాణ గుణాలు, శ్రీదేవిలోని స్త్రీత్వానికి తగిన కల్యాణ గుణాలు భక్తులకు అనుభవించడానికి వేర్వేఱు గోచరిస్తూ, ఆనందాన్ని కలుగజేస్తున్నాయి.

శిఖరిణీ వృత్తం 'య మ న స భ ల గ'- గణాలు కలది.

*35. ఘన కన కద్యుతీ యువదశా మపి ముగ్ధ దశాం*
*యువతరుణత్వయో రుచిత మాభరణాది పరమ్।*
*ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్యహరౌ*
*త్వయిచ కుశేశయో దరవిహారిణి! నిర్విశసి॥*

**అర్థం:** హే కుశేశయ+ఉదర, విహారిణి= కమలం నడుమ విహరించే ఓ లక్ష్మీదేవీ!; ఘన, కనక, ద్యుతీ= మేఘం యొక్క బంగారం యొక్క కాంతుల వంటి

కాంతులు కల్గినట్టి; యువదశాం= యౌవనదశను; ముగ్ధదశాం, అపి= లేత ప్రాయాన్ని కూడా; యువ తరుణత్వయోః= యౌవన తారుణ్యాలకు; ఉచితం= తగినది; అసమానదేశ, వినివేశి= (మీ ఇద్దఱికీ) సమానమైన అవయవాల యందు ఉండనిదైన; పరం= గొప్పదైన; ఆభరణ+ఆది= వస్త్రాభరణాలు మొదలైన దానిని; హరౌ= విష్ణువునందు; త్వయి, చ= నీ యందును; విభజ్య= వేరు చేసి; నిర్విశసి= ఆనందిస్తున్నావు; ధ్రువం= నిశ్చయం.

**తా॥** తామరపూవు నడుమ నివసించే ఓ లక్ష్మీదేవీ! మీ యిద్దఱి (విష్ణువు యొక్క, లక్ష్మీదేవి యొక్క) శరీర కాంతులు వేర్వేఱు, ప్రాయములు వేఱు, అవయవాలను అలంకరించుకొనే వస్త్రాభరణాలు వేర్వేఱుగా ఉండి శోభిస్తున్నందున నీవు ఆనందాన్ని అనుభవిస్తున్నావు.

**వ్యాఖ్య:** దివ్యదంపతుల కల్యాణ గుణాలలో భేదాన్ని వర్ణించిన తర్వాత ఈ శ్లోకమందు రూపభేదం, అలంకార భేదం వర్ణింపబడుతున్నది.

లక్ష్మీదేవి 'కుశేశయోదర విహారిణి' అని సంబోధింపబడింది.

"*సహస్ర పత్రం కమలం శతపత్రం కుశేశయం*"- (అమరం) కుశే, శేతే ఇతి= కుశేశయం, (శీఙ్-స్వప్నే) నీళ్ళయందు ఉండేది. తామరపువ్వు సుకుమారమైనది. అంతకంటే ఆ పువ్వు నడుమ విహరించే లక్ష్మి ఇంకా సుకుమార మైనది. అలర్మేల్మంగా! పద్మాలయా! అన్న భావమే ఇందున్నది.

విష్ణువుయొక్క రూపం 'నీలతోయదం'- కార్ కలన్దమేని- నీలమేఘం యొక్క వన్నెవంటి వన్నె కలది. లక్ష్మీదేవి యొక్క రూపం 'హిరణ్యవర్ణా'- పసిడివంటి మిసిమి కలది (ద్యుతీ.ద్వి.వి. ద్వివచనం) విష్ణువు యొక్క దశ యౌవన దశ. లక్ష్మీదేవి ప్రాయం ముగ్ధ దశలో నున్నది- యౌవన దశకంటె లేత వయస్సు కలది అని అర్థం. ఆ దివ్యదంపతుల పరువం మారదు. ఎల్లప్పుడు ఒక్కరీతిగానే ఉంటుంది. నిత్యమైనది.

ఆభరణాలూ, వాటిని ధరించే స్థానాలు కూడా స్త్రీలకూ పురుషులకూ వేర్వేఱుగా ఉంటాయి. చెవిపూలు, ముక్కెర, ముంజేతి కంకణాలు, నడుముకు

ఒడ్యాణం, కాళ్ళకు అందెలు, కడియాలు, గళమున మంగళసూత్రం, ఎదపైన రత్నహారాలు, పాదాంగుళాల్లో మట్టెలు, నుదుట తిలకం, పాపిడి పూవు, కన్నులకు కాటుక, పసుపు కుంకుమ, శిగలో చూడామణి, తురిమిన పూలహారం, పట్టు రవిక, చీర, మకరికా పత్రాలతో చిత్రితమైన స్తనాద్యవయవాల సౌందర్యం లక్ష్మీదేవికి ఉండడం స్వాభావికం. విష్ణుమూర్తి పీతాంబరం, రత్న ఖచితమైన బంగారు మొలత్రాడు, పట్టుధట్టి, అరుణవర్ణోత్తరీయం, ఎదలో కౌస్తుభమణి, ముక్తాహారాలు, మణికట్టు కనకాభరణం, అంగుళీయకం, బాహువులకు కేయూరాలు, భుజకీర్తులు, గ్రైవేయకం, మకర కుండలాలలు, ఊర్ధ్వపుండ్రం, తెల్లని యజ్ఞోపవీతం. మణిమయ మకుటం, పంచాయుధ ధారణం– సర్వాంగ సౌందర్యంతో శోభించడం సహజం, సముచితం కదా!

'అసమానదేశి వినివేశి'– అనే పదం, స్త్రీ పురుషులకు గల నగల భేదం రీతిగా, వాటిని ధరించే స్థానాలలోనూ భేదమున్నదని తెల్పుతున్నది.

ఇట్లు, లక్ష్మీదేవికిని, లక్ష్మీపతికిని రూప భేదాలను లక్ష్మీదేవియే కల్పించి, తాను ఆనందిస్తుంది, భక్తులకు 'ఈమె భగవతి, ఇతడు భగవానుడు' అని భక్తులకు తెలుసుకొనే అవకాశం కల్పించి, ఆనందాన్ని కలుగజేస్తున్నదని సుశ్లోకితం. ధ్రువం, నూనం అనే పదాలు ఉత్ప్రేక్షావాచకాలు.

నర్కుటక వృత్తం– న జ భ జ జ ల గ– గణాలు కలది.

*"హయ దశభిర్నజౌ భ జ జ లా గురు 'నర్కుటకమ్' ".*

*36. అంగం తే మృదుశీతముగ్ధ మధురోదారైర్గుణైర్గుంభతః*
*క్షీరాబ్ధేఃకి మృజీషతా ముపగతా మన్యే మహార్ఘాస్తతః।*
*ఇందుః కల్పలతా సుధా మధుముఖా ఇత్యావిలాం వర్ణనాం*
*శ్రీరంగేశ్వరి! శాంత కృత్రిమ కథం దివ్యం వపుర్నార్హతి॥*

**అర్థం:** శ్రీరంగేశ్వరి!= ఓ రంగనాయకీ!; తే= నీ యొక్క; అంగం= శరీరాన్ని; మృదు= రోదారైః/ మృదు= సౌకుమార్యం; శీత= చల్లదనం; ముగ్ధ= సౌందర్యం; మధుర= మాధుర్యం; ఉదారైః= ఔదార్యం మొదలైన; గుణైః= గుణాలతో; గుంఫతః= ఘటించుతున్న; క్షీరాబ్ధేః= పాలసముద్రానికి; ఇందుః= చంద్రుడు; కల్పలతా= కల్పతరువు; సుధా= అమృతం; మధు= మద్యం (సుర); ముఖాః= మొదలైనవి; ఋజీషతాం= సారంలేని స్థితిని; ఉపగతాః, కిం= పొందినవా! ఏమి?; తతః= అందువల్లనే; మహార్ఘాః= గొప్ప విలువ కల్గినవిగా; మన్యే= తలచుతున్నాను; ఇతి= అని; ఆవిలాం= కలుషితమైన; వర్ణనాం= వర్ణనను; శాంత కృత్రిమ కథం= కృత్రిమ ప్రశంసకు విషయం కానట్టి; దివ్యం= అప్రాకృతమైన; వపుః= (నీయొక్క) రూపం; న, అర్హతి= తగినది కాదు.

**తా॥** ఓ లక్ష్మీదేవి! పాలకడలిని చిల్కినపుడు నీవు అందుండి ఉద్భవించావు. నీతో పుట్టిన చంద్రుడు, కల్పలత, అమృతం, మద్యం మొదలైన వస్తువులలో ఉండే మృదు శీత ముగ్ధ మధురోదార గుణాలను సారంగా గ్రహించి నీ రూపాన్ని సముద్రుడు సృష్టించాడేమో అనే భావిస్తున్నాను. అందువల్లనే ఆ చంద్ర కల్పలతాది వస్తువులు గొప్ప విలువ కల్గినవని కవులు ఉత్ప్రేక్షగా వర్ణిస్తుంటారు. కాని, నీ శరీరం అప్రాకృత వస్తువుల సారంగా పల్కడం తగినది కాదు; కృత్రిమ ప్రశంస ఏ మాత్రం లేని నీ దివ్యరూపాన్ని చంద్ర కల్పలతాదుల సారమని వర్ణించడం దోషయుక్తమైనదని తాత్పర్యం.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి మృదుశీత ముగ్ధ మధురోదార గుణాలు కలదని వర్ణిస్తూ, కవులు ఈ గుణాలు ఉండడానికి గల కారణాన్ని కృత్రిమంగా వర్ణించడం దోషభూయిష్ఠమని సుశ్లోకితం.

లక్ష్మీదేవి క్షీరసముద్రరాజ తనయ. లక్ష్మితోపాటు ఆ పాలసముద్రమందే చంద్రుడు, కల్పతరువు, అమృతం, సుర మొదలైనవి ఉద్భవించాయి. చంద్రునిలో మార్దవం, శైత్యం అనే గుణాలున్నాయి. కల్పలతలో ఔదార్యమున్నది. సుధలో, మధువులో మాధుర్యమున్నది. క్షీర సముద్రుడే చంద్రుడు, కల్పలత మొదలైన వాటిలో ఉన్న ఒక్కొక్క గుణాన్ని పిండి, వాటి సారాలను ముద్దజేసి లక్ష్మీరూపాన్ని

నిర్మించాడా ఏమి? అని భావింపబడింది. అంతే కాదు; చంద్ర కల్పలతాది వస్తువులను పిండి, సారాన్ని తీసిన తర్వాత వాటిలో మిగిలిన పిప్పి ముద్దలు కూడా గొప్ప విలువ కలవిగా లోకం భావిస్తున్నది.

లక్ష్మీదేవి సారసర్వస్వమని వర్ణించడం భావ్యమనుకొన్ననూ, చంద్రాది పదార్థాల సారాన్ని గ్రహించి లక్ష్మీదేవి శరీరం నిర్మితం అనడంవల్ల ఆమె రూపం కృత్రిమం అని స్ఫురిస్తుంది. కాబట్టి, కృత్రిమ కథా ప్రసక్తి ఏ మాత్రం లేని లక్ష్మీదేవి యొక్క దివ్యమైన- అప్రాకృతమైన రూపాన్ని ప్రాకృత వస్తువుల సారంగా వర్ణించడం సముచితం కాదు. దోష భూయిష్ఠమైనది- అన్నారు భట్టర్.

ఋజీషతాం- సారంలేని స్థితిని పిప్పియొక్క స్వభావాన్ని- అని అర్థం. గుంఫన్- అనే ప్రథమైకవచనమైతే, 'గుంఫతః' షష్ఠీ విభక్త్యేక వచనం. మన్యే- ఉత్ప్రేక్షా వాచకం, వృత్తం శార్దూల విక్రీడితం.

*37. ప్రణమదనువిధిత్సా వాసనా నమ్ర మగ్రే*
*ప్రణయి పరిచిచీషా కుంచితం పార్శ్వకేన।*
*కనక నికష చంచచ్చంపక స్రక్ సమాన*
*ప్రవర మిద ముదారం వర్ష్మ వాచామభూమిః॥*

**అర్థం:** హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!; అగ్రే= శిరస్సున; ప్రణమ-నమ్రం/ ప్రణమత్= నమస్కరించే వారిని; అనువిధిత్సా= అనుసరించే కోరిక యొక్క; వాసనా= సంస్కారం చేత; నమ్రం= కొంచెం వంగియున్నది; పార్శ్వకేన= ఇరుప్రక్క భాగాలచేత; ప్రణయి-కుంచితం/ ప్రణయి= ప్రియుడైన శ్రీరంగనాథుని యొక్క; పరిచిచీషా= సేవ చేయు కోరిక చేత; కుంచితం= సంకోచాన్ని పొందియున్నది; కనకనికష- ప్రవరం/ కనకనికష= మంచి బంగారు రేఖతో; చంచత్= ప్రకాశించే; చంపక స్రక్= సంపెంగ పూలదండతో; సమాన ప్రవరం= సమాన గోత్రం కలదైన; ఉదారం= ఔదార్య గుణమున్నట్టి; ఇదం= ఈ అప్రాకృతమైన; (తవ= నీ యొక్క); వర్ష్మ= శరీరం; వాచాం= మాటలకు; అభూమిః= స్థానమైనది కాదు- అందనిది.

**తా॥** లక్ష్మీదేవి యొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యం వాచామ గోచరమని వర్ణితం.

మొదటి పాదం లక్ష్మీదేవి యొక్క శిరోభారం ఉండే రీతిని తెల్పుతున్నది. రెండవ పాదం, పార్శ్వ భాగం సన్నగిలి యున్న విధానాన్ని స్పష్ట పరచినది. ముఖ్యంగా లక్ష్మీదేవి భగవంతునికీ భక్తులకూ మధ్యవర్తినియై వ్యవహరిస్తున్నది. 'భక్తుల కోరికను నెరవేర్చగలనో లేదో' అనే భయమూ, తన పతికి పరిచర్య చేసే ఆసక్తియూ సూచింపబడినవి.

"కనకనికష చంచచ్చం పకస్రక్సమాన ప్రవరం"– అనే సమాస పదంతో లక్ష్మీదేవి దివ్యరూప సన్నివేశం సూచితం. బంగారం కేటిదో, చొక్కమో తేల్చకోవడానికి ఒరపిడి ఱాయిమీద గీయడం పరిపాటి. మేలిమి బంగారమే అయితే, నికషోపలం మీద గీయబడిన రేఖ చంపక పుష్పం యొక్క వన్నెవలె ప్రకాశిస్తుంది. కాబట్టి, మేలిమి బంగారు రేఖవంటి ఉజ్జ్వల సౌందర్యం, అట్లే, సంపంగి పూదండతో సామ్యాన్ని వర్ణించడంవల్ల, సౌగంధ్యమూ చెప్పబడినది. కాబట్టి లక్ష్మీదేవి యొక్క దివ్యదేహ సౌందర్యం మాటలతో వర్ణింప నలవికానిదని అగ్గలంగా ఉగ్గడింపబడినది. మాలినీవృత్తం.

"న న మ య య" యుతేయం మాలినీ భోగిలోకైః– (లక్షణం).

*38. ఏకం న్యంచ్య నతిక్షమం మమపరం చాకుంచ్య పాదాంబుజం*
*మధ్యేవిష్టర పుండరీక మభయం విన్యస్య హస్తాంబుజమ్।*
*త్వాంపశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్య కూలంకష*
*స్ఫారాపాంగ తరంగమంబ! మధురం ముగ్ధం ముఖం బిభ్రతీమ్॥*

**అర్థం:** హే అంబ! = ఓ జననీ!; మమ= నాకు; నతిక్షమం= నమస్కరించడానికి తగినట్లున్న; ఏకం= ఒకటైన; పాద+అంబుజం= (కుడి) చరణ పద్మాన్ని; న్యంచ్య= క్రిందికి చాపి; పరం= రెండవదైన (ఎడమ) పాదకమలాన్ని; ఆకుంచ్య, చ= (అడ్డంగా) మడచియు; హస్త+అంబుజం= పాణిపద్మాన్ని; అభయం= అభయ ముద్రగా; విన్యస్య=

ఉంచి; మధ్యే విష్టర పుండరీకం= సింహాసనంగా ఉన్న పద్మం యొక్క మధ్యన; నిషేదుషీం= కూర్చొని యున్నట్టి; కారుణ్య-తరంగం/ కారుణ్య= దయతో; కూలంకష= దరుల నొరసి ప్రవహించే; స్ఫార= విశాలమైన; అపాంగ= కటాక్షాలు అనే; తరంగం= కెరటాలు కల్గినట్టి; మధురం= ఇంపైన; ముగ్ధం= సుందరమైన; ముఖం= ముఖాన్ని; బిభ్రతీం= ధరించియుండే; త్వాం= నిన్ను; ప్రతికలం= ప్రతిక్షణం; పశ్యేమ= చూస్తుంటాం.

**తా॥** ఓ తల్లీ! లక్ష్మీదేవీ! నీవు కెందామరపూవును సింహాసనంగా చేసుకొని దాని నడుమ కూర్చొని యున్నావు. నీ దక్షిణ పాదపద్మాన్ని సింహాసనం నుంచి, నా వంటి దాసులు నమస్కరింప యోగ్యంగా క్రిందికి చూపియుంచావు. ఇక వామ పాదాన్ని అడ్డంగా మడచుకొని యున్నావు. నీ హస్తకమలాన్ని భక్తుల ఎదలోని భీతిని తొలగించే అభయ ముద్రగా ప్రదర్శిస్తున్నావు. పొంగిపొరలే ప్రవాహంలో దరుల నొరసే తరంగాలవలె ఉన్నట్టి నీ కృపాపూర్ణ కటాక్షాలను ప్రసరిస్తున్న మనోజ్ఞమైన నీ ముఖమండలాన్ని నిత్యం సేవిస్తుంటాము.

**వ్యాఖ్య:** ఆధిరాజ్య సూచకమైన ఉనికిగల లక్ష్మీదేవిని ధ్యానించే శ్లోకమిది.

లక్ష్మీదేవి పద్మాలయ, పద్మాసన, "త్వత్పాద పద్మం మయి సన్నిధత్స్వ"- పద్మాసనాసీనయై తన నాశ్రయించిన వారి తలమీద తన దక్షిణ పాదతలాన్ని ఆనించి, దక్షిణ కరకమలమందు వారికి అభయముద్రను ప్రదర్శిస్తున్నది. వాత్సల్యంతో కటాక్ష వీక్షణాలను ప్రసరిస్తున్న లక్ష్మీదేవి యొక్క ముగ్ధ ముఖ మండలాన్ని నిరంతరం సేవించి తరించవలెనని ధ్యానం చేస్తుంటారు. విశ్వాన్ని రక్షించే పీఠమందు ఆసీనురాలు కదా! ప్రపన్నులకు ప్రసన్నురాలు, కాబట్టి 'అంబ'- తల్లీ! జగజ్జననీ! అని సంబోధింపబడింది.

మధ్యేవిష్టర పుండరీకం- ఇది అవ్యయీభావ సమాసపదం. 'విష్టరం' అంటే ఆసనం. విష్టరమే పుండరీకం. కాబట్టి 'విష్టర పుండరీకం' అనబడింది. "*పుండరీకం సితాంభోజం*"- (అమరం) పుండరీకం అంటే తెల్లని తామర పువ్వు- అని నిఘంటువు తెల్పుతున్ననూ 'శబరభాష్యం' మాత్రం 'ఎఱ్ఱని కమలం' అనే

అర్థాన్ని బోధిస్తున్నది. 'విష్టర పుండరీకస్య మధ్యే'= మధ్యే విష్టర పుండరీకం' అయింది. మధ్యే అనే అవ్యయం పూర్వపదంగా నిల్చింది. 'పూర్వపదావ్యయీ భావ సమాసం' అయింది.

'నిషేదుషీం' అంటే ఉపవిష్టయైనట్టి– అని అర్థం. వైదికపదమైననూ కవుల ప్రయోగంలో నున్నది. "నిషేదుషీ మాసన, బంధధీరః"– అని కాళిదాస మహాకవి రఘువంశ కావ్యమందు ప్రయోగించాడు. 'లిట్' రూపంమీద 'క్వసు' ప్రత్యయం చేరగా ఏర్పడిన రూపమిది. ఈ కారాంత స్త్రీలింగం ద్వితీయైకవచనాంతం (నిషేదుషీం– నిషేదుష్యౌ– నిషేదుషీః). ఇది మూడు లింగాలలో ఒకే రూపమున్న 'త్వాం' (మూడవ పాదాది పదం) అనే సర్వనామ వాచకానికి విశేషణం. 'మధురం' అంటే ప్రియమైనదని అర్థం.

"స్వాదు ప్రియౌతు మధురం"– (అమరం). 'ముగ్ధం' అంటే సుందరమని అర్థం. "ముగ్ధః సుందర మూఢయోః"– (అమరం).

శార్దూల విక్రీడితం. మ స జ స త త గ– గణాలు కలది.

*39. సురభిత నిగమాంతం వందిషీయేందిరాయాః*
*తవ కమల పలాశ ప్రక్రియం పాదయుగ్మమ్।*
*వహతి యదుపమర్దై ర్వైజయంతీ హిమాంభః*
*ప్లుతిభిరివ నవత్వం కాంతబాహాంతరాళే॥*

**అర్థం:** (హేశ్రీః= ఓ లక్ష్మీదేవీ!); ఇందిరాయాః= ఐశ్వర్యవతివైన; తవ= నీ యొక్క; సురభిత నిగమాంతం= పరిమళింపజేయబడిన ఉపనిషత్తులు కల్గినట్టి; కమల పలాశ, ప్రక్రియం= తామరపూరేకు యొక్క ప్రకారాన్ని కల్గినట్టి; పాదయుగ్మం= చరణద్వయాన్ని; వందిషీయ= నమస్కరిస్తాను, స్తుతిస్తాను; యత్+ఉపమర్దైః= ఏ శ్రీదేవి యొక్క చరణాల స్పర్శలచేత; కాంత, బాహ+అంతరాళే= ప్రియుడైన విష్ణువు యొక్క బాహువుల మధ్యన–వక్షఃస్థలంలో; వైజయంతీ= వనమాల; హిమ+అంభః, ప్లుతిభిః, ఇవ= మంచునీటి జల్లుల చేతవలె; నవత్వం= కొత్తదనాన్ని; వహతి= వహిస్తున్నదో.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీవు ఐశ్వర్యం కలదానవు. నీ పాదాలు వేదాంతాలను పరిమళింపజేస్తుంటాయి. తామరపూరేకులవలె ఎఱ్ఱని కాంతియు, సౌకుమార్యమూ కల్గినట్టివి. విష్ణుభగవానుని వక్షఃస్థలమందు నిత్యం నివసించే దానవు. కాబట్టి, నీ ప్రియుని గళమందు పాదయుగళంవరకు వ్రేలాడుతున్న వైజయంతి అనే మరొక పేరుగల వనమాల నీ పాదాల స్పర్శచేత నిత్యప్రత్యగ్రంగా భాసిస్తున్నది. ఇట్టి నీ పాద యుగ్మాన్ని నమస్కరిస్తాను, స్తుతిస్తాను.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవిని సేవించడం వల్ల కల్గిన ఆనందంచేత ఆమె పాదయుగ్మమే శరణమని సుశ్లోకితం.

లక్ష్మీదేవి ఐశ్వర్యవతి అనే అర్థం కల్గిన పదం 'ఇన్దిర'. 'ఇది పరమైశ్వర్యే'- అనే ధాతువునుంచి నిష్పన్నమైనది. 'ఇందతి ఇతి= ఇందిరా' అని వ్యుత్పత్తి కలది.

"పద్మే స్థితాం, పద్మవర్ణాం"- అని శ్రీసూక్తం. పద్మాలయ యొక్క పాదద్వయం ప్రత్యేకంగా ఇందుస్తుతింపబడినది. కాళ్ళకు దండం పెడితే కడుపులో ఆర్ద్రత పెరుగుతుంది. చంపడానికి కత్తినెత్తిన శత్రువైనను మెత్తబడక మానడు కదా!

జగజ్జననియైన శ్రీదేవి యొక్క చరణాలను ఆశ్రయిస్తే ముక్త్యైశ్వర్యమూ లభిస్తుంది. ఉపనిషత్తులు పరతత్త్వాన్ని గూర్చి చర్చించి, చివరకు ఎవరి ఎదలో లక్ష్మీదేవియొక్క పాదాలు కనబడునో ఆ మూర్తియే పరతత్త్వమని నిర్ణయించుకొని తత్త్వచింతనను మానుకొన్నవి- అని *"వేదాంతాస్తత్త్వచింతాం మురభిదురసి యత్పాద చిహ్నై స్తరంతి"*- ఈ స్తోత్రకావ్యంలోనే నాల్గవ (4) శ్లోకం వివరించెను.

నారాయణ స్వరూపాన్ని- పరత్వాన్ని నిరూపిస్తూ, వేదాంతాలనే పరిమళింప జేసేవి లక్ష్మీదేవి పాదాలు. లక్ష్మీదేవి *"విష్ణోః శ్రీ రనపాయినీ"*- అన్నది విష్ణు పురాణం.

"పూవార్ తిరుమకళ్ పుల్కియ మార్పా"- పూవులు నిండుగా కల్గిన లక్ష్మీదేవి నివసించే వక్షఃస్థలం కలవాడా! అని ఆళ్వార్లు శ్రియఃపతిని స్తుతించారు.

"అక్లకిల్లేన్ ఇఱైయు మెన్ఱు"- పతిని క్షణకాలమైననూ విడిచి ఉండలేనని పలికేది లక్ష్మీదేవి.

వామనావతారమందు "కృష్ణాజినేన సంవృణ్వన్ శ్రియం వక్షఃస్థల స్థితాం"- వక్షస్సులో ప్రకాశించే లక్ష్మీదేవిని వామన బ్రహ్మచారి జింకచర్మంతో కప్పుకొంటూ వెళ్ళినాడని పురాణ వచనం.

శ్రీ వేదాంత దేశికులు 'దేహళీశ స్తుతిలో "భిక్షోచితం ప్రకటయన్ ప్రథమాశ్రమంత్వం కృష్ణాజినం యవనికాం కృతవాన్ ప్రియాయాః"- భిక్షకు యోగ్యమైన బ్రహ్మచర్యాన్ని ప్రకటిస్తూ, తన ప్రియురాలైన లక్ష్మికి జింక చర్మాన్ని తెరగా ఆవరింపజేశాడు- అని వ్యక్తం చేశారు.

*"లక్ష్మ్యా సహహృషీకేశః దేవ్యాకారుణ్య రూపయా।*
*రక్షకః, సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే॥"*

హృషీకేశుడైన భగవానుడు కరుణా స్వరూపయైన లక్ష్మితో కూడిన వాడై రక్షకుడవుతున్నాడు అని స్పష్టంగా తెల్పబడింది.

*"అనుగ్రహమయీం వందే నిత్య మజ్ఞాత నిగ్రహామ్"*- నిగ్రహించడమే తెలియనిదీ, మూర్తీభవించిన కృపయే అయిన లక్ష్మీదేవికి నమస్కరిస్తున్నాను- అన్నటువంటి సూక్తులు చాలా ఉన్నాయి.

"కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్"- వధింపదగిన కాకాసురుణ్ని శ్రీరాముడు కృపతో రక్షించాడు- అన్న చోట 'కృపా' అనేది సీతాదేవికి వాచకం కదా!

*"ఇవళ్ సన్నిధియాలే కాకం తలైప్పెత్తదు,*
*అదిల్లామై యాలే రావణన్ ముడిందాన్॥"* (ముముక్షుప్పడి.)

సీతాదేవి శ్రీరాముని దగ్గఱ ఉన్నప్పుడు కాకాసురుడు బతికాడు. ఆమె దగ్గఱ లేనందువల్ల రావణుడు నశించాడు- ఇత్యాది సూక్తులు పిరాట్టి మహిమను విశదంగా తెల్పును కదా!

'వైజయంతి' అనే వనమాల భగవానుని దివ్యమంగళ విగ్రహమందు విరాజిల్లుతుంటుంది.

*"పంచరూపాతుయామాలా వైజయంతీ గదాభృతః।*
*సాభూతహేతు సంఘాతాభూత మాలాచ వైద్విజ॥"* (వి.పు.-122-72)

విష్ణుమూర్తి గళమందు ధరించిన 'వైజయంతి' అనేది ముత్యాలు, మాణిక్యాలు, మరకత మణులు, ఇంద్రనీల మణులు, కెంపులు (వజ్రాలు) అనే ఐదు రూపాలతో కూడిన మాల. అది పంచతన్మాత్రలు మఱియు పంచభూతాల సమూహానికి సంకేతంగా ఉన్నమాల- అని విశదీకరింపబడింది.

ఈ వైజయంతి అనే వనమాల వక్షఃస్థలంలో లక్ష్మీదేవి పాదాలయొక్క సంఘర్షణను పొందినా, వాడిపోకుండా నిగనిగలాడుతుంది. ఇందుకు లక్ష్మీదేవి యొక్క పాదాల మృదుత్వం, సౌకుమార్యం కారణమని వ్యక్తీకరింపబడినది.

*కమల పలాశ ప్రక్రియం పాదయుగ్మమ్:-* చల్లగా నీళ్ళమీద ఉండి వికసించిన తామరపూరేకుల వంటి మార్దవం, సౌకుమార్యం, సౌగంధ్యం, అరుణిమ కల్గియున్నవి శ్రీదేవి పాదాలు. *"పంజెన శివక్కుమెన్ కాల్ పావై"*- పత్తిని తొక్కినా కందిపోయే సుకుమారమైన పాదాలు కలది లక్ష్మీదేవి. కరుణార్ద్ర పుష్కరిణియైన విష్ణువక్షఃస్థలమందు చలించే ఇందిర యొక్క పాదస్పర్శ వైజయంతికి చల్లని నీటి బిందువులను చల్లినట్టి అనుభూతిని కలిగించడంవల్ల ఆ వనమాల అప్పుడే వికసించిన పూలదండలాగా ఆహ్లాదకరమైన శోభను కల్గియున్నదని సారార్థం.

విష్ణుభగవానుని వక్షఃస్థలాన్ని విడిచియుండక పోవడమే మహదైశ్వర్యమని పిండితార్థం. అట్టి పిరాట్టి పాదాలను శరణు పొందడమే పరమార్థం.

'న న మ య య'- గణాలున్న మాలినీవృత్త రచిత శ్లోకం.

40. త్వత్ స్వీకార కలావలే పకలుషా రాజ్ఞాం దృశోదుర్వచాః
నిత్యం త్వన్మధుపానమత్త మధుపశ్రీ నిర్భరాభ్యాం పతిమ్।
దృగ్భ్యామేవహి పుండరీక నయనం వేదో విదోమాస తే
సాక్షాల్లక్ష్మి! తవావలోక విభవః కాక్వాకయా వర్ణ్యతే॥

**అర్థం:** హే లక్ష్మి= ఓ లక్ష్మీదేవీ!; త్వత్ స్వీకార–కలుషాః/ త్వత్= నీ యొక్క; స్వీకార= అనుగ్రహ దృష్టిలోని; కలా= కొద్ది భాగంవల్ల కల్గిన; అవలేప= గర్వంతో; కలుషాః= కాలుష్యాన్ని- ఎఱుపు వన్నెను- పొందినట్టి; రాజ్ఞాం= రాజుల యొక్క; దృశః= కనుచూపులు; దుర్వచాః= వర్ణింపరానివిగా అవుతున్నాయి; నిత్యం= ఎల్లప్పుడు; త్వన్మధుపాన–నిర్భరాభ్యాం/ త్వత్= నీ యొక్క రూపం అనే; మధు= మకరందాన్ని; పాన= తాగడంచేత; మత్త= మదించిన (ఎఱుపును పొందిన); మధుప= తుమ్మెదల యొక్క; శ్రీ= కాంతితో; నిర్భరాభ్యాం= నిండినవైన; దృగ్భ్యాం, ఏవ, హి= కన్నులతోనే కదా; తే= నీ యొక్క; పతిం= భర్తయైన విష్ణువును; వేదం= వేదం; పుండరీక నయనం= పుండరీకాక్షునిగా; విదామాస= తెలుసుకొన్నది; సాక్షాత్= నేరుగా; తవ= నీ యొక్క; అవలోక విభవః= దృగ్వైభవం; కయా, కాక్వా= ఏ విధంగా; వర్ణ్యతే= వర్ణింపబడును? వర్ణింప శక్యం కాదని భావం.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ కటాక్షం కొద్దిగా ప్రసరించినంతనే రాజుల కన్నులు మత్తెక్కినందువల్ల అవి వర్ణింప శక్యం కానివై యుండును. నీ యొక్క రూపమనే మకరందాన్ని పానం చేసిన తుమ్మెదల వలె రక్తిమ గల్గిన నేత్రాలు గల నీ భర్తను వేదం పుండరీకాక్షుడుగా ప్రశంసించింది. తల్లీ! నీ కటాక్ష లేశమే ఇంత ప్రభావం కల్గియుండగా నేరుగా నీ కటాక్ష వైభవం వర్ణింప నలవికానిదని తాత్పర్యం.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి కటాక్షవైభవం వర్ణనాతీతమని సుశ్లోకితం.

లోకపాలకులు మొదల్కొని నేడు దేశాలను పాలించే మేటి నాయకులను లక్ష్మీదేవి స్వల్పంగా కటాక్షించినంతనే వారికి సకల సంపదలు, అధికారాలు లభిస్తున్నాయి. తత్ఫలితంగా ఆ పాలకుల కన్నులు నెత్తికెక్కి, అఖర్వగర్వంగల వారి దృష్టి వర్ణింప శక్యం కాకున్నది.

ఇంతకుముందు (15 మరియు 30) రెండు శ్లోకాలలోని విషయం కూడా ఇక్కడ స్మరింప దగినదే.

లక్ష్మీదేవి పద్మమైతే నారాయణుడు మధుపం- తుమ్మెద. పద్మమందలి మకరందాన్ని పానంచేసే మధుపం మఱొక చోటికి పోదు కదా! లక్ష్మీదేవి యొక్క దివ్య శరీర సౌందర్యమనే పూదేనెను ఆస్వాదించడంవల్ల భగవానుని కన్నులకు రక్తిమ సంక్రమించింది. అట్టి నేత్రసౌందర్యంగల నారాయణుడు 'పుండరీకాక్షుడు' అని వేదమే ఒక్కమాట మాత్రం పల్కింది. ("తస్యయథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"- ఛాందోగ్యోపనిషత్తు.)

భగవానుడు పిరాట్టిని నిరంతరం అనురాగంతో చూడడంవల్ల ఆయన కన్నులకు ఇట్టి అతిశయం కల్గింది. వేదమే అధికంగా చెప్పలేనిదై యుండగా లక్ష్మీ కటాక్ష వైభవాన్ని సాక్షాత్తుగా వర్ణించడం మనకు ఏ రీతిగా సాధ్యమవుతుంది? సాధ్యం కాదు.

శార్దూల వృత్తం.

*41.* *ఆనందాత్మభి రీశ మజ్జన మదక్షీబాలసై రాగళ*
*ప్రేమార్ద్రై రపి కూలముద్వహ కృపా సంప్లావితాస్మాదృశైః*
*పద్మే! తే ప్రతిబిందు బద్ధకలిక బ్రహ్మాది విష్కంభకైః*
*ఐశ్వర్యోద్గమగద్గదైర శరణం మాం పాలయాలోకితైః॥*

**అర్థం:** హే పద్మే!= ఓ లక్ష్మీదేవీ!; తే= నీ యొక్క; ఆనంద+ఆత్మభిః= ఆనంద రూపాలైనట్టి; ఈశ-అలసైః/ ఈశ= భగవంతుణ్ణి; మజ్జన= (చూపులలో) ముంచడం వల్ల కల్గిన; మద= సంతోషమనే మద్యంతో; క్షీబ= మత్తిల్లినట్టి; అలసైః= అలసినట్టివైన; ఆగళ ప్రేమ+అర్ద్రైః= కంఠంవరకు ప్రేమతో తడిసినట్టి; అపి= మఱియు; కూలముద్వహ- దృశైః/ కూలం+ఉద్వహ= దరులను మించి ప్రవహించే; కృపా= దయా జలంతో; సంప్లావిత= స్నానం చేయించబడిన; అస్మాదృశైః= మావంటి దాసులు కల్గినట్టి; ప్రతిబిందు-విష్కంభకైః/ ప్రతిబిందు= ఒక్కొక్క కృపాబిందువు కోసం;

బద్ధకలిక= కలహించే; బ్రహ్మాది విష్కంభకైః= బ్రహ్మ మొదలైన పాలకులు కల్గినట్టి; ఐశ్వర్య+ఉద్గమ, గద్గదైః= సంపద యొక్క ఉత్పత్తివల్ల తొట్రుపాటును కల్గినట్టి; ఆలోకితైః = చూపులతో; అశరణం= వేరే గతిలేని; మాం= నన్ను; పాలయ= రక్షించుము.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ కడగంటి చూపులు ఆనందరూపాలు. నీ చూపులు భగవానుని దివ్యరూపాన్ని నిరంతరం చూడడం వల్ల సంతోషాన్ని పొందుతూనే అలసిపోతున్నాయి. అంతేకాదు పరిపూర్ణ ప్రేమతో కూడినవి. నీ సేవకుల పట్ల దయ కలవి. బ్రహ్మాది లోకపాలకులకు స్పర్ధను కల్గించునట్టివి. అపరిమితమైన ఐశ్వర్యాన్ని అనుగ్రహించేవి. అందువల్ల అటువంటి నీ కటాక్ష వీక్షణాలను అనన్య గతికుడనైన నా (వంటి దాసవర్గం) పైన ప్రసరింపజేసి నన్ను కాపాడుము.

**వ్యాఖ్య:** ఆరు విధాలుగా వర్ణింపబడిన కడగంటి చూపులతో లక్ష్మీదేవి, వేరే దిక్కులేని తన (దాసుల)ను రక్షింపవలెనని ప్రార్థించబడిన శ్లోకమిది.

లక్ష్మీకటాక్ష వీక్షణాలకు ఆరు విశేషణ పదాలున్నవి.

1) *ఆనందాత్మభిః*– ఆనందమే కడగంటి చూపుల రూపాన్ని దాల్చినందువల్ల లక్ష్మీదేవి ఏ వైపు చూచినా, ఆ వైపు ఆనందమే కల్గుతుంది.

2) *ఈశమజ్జన మదక్షీబాలసైః*– లక్ష్మీదేవి తన కటాక్ష దృష్టులలో విష్ణుమూర్తిని (తన పతిని) ముంచెత్తుతున్న కొలది సంతోష మధికమై మాంద్యమేర్పడి, అలసట చెందుతున్నవి. 'క్షీబ' శబ్దం మత్తతోనున్న వ్యక్తిని తెల్పుతుంది. *"మత్తే శౌండోత్కటే క్షీబాః"*– (అమరం). *"క్షీబృమదే"*– క్షీబతి (మాద్యతే) ఇతి= క్షీబః.

మద్యపానం చేత మత్తు కల్గి ఒడలు తెలియలేని బడలికతో నుండడం క్షీబత్వం.

3) *ఆగళ ప్రేమార్ద్రైః*– కంఠసీమ వరకు ప్రీతిచేత తడుపబడినవి. ఆమె చల్లని చూపులు పూర్ణ ప్రేమ గలవి.

4) *కూలముద్వహ కృపా సంప్లావితాస్మాద్భశైః*- హద్దు మీటిన దయా ప్రవాహంలో ఆశ్రయించిన వ్యక్తులను ఓలలాడించేవి.

5) *ప్రతిబింధు బద్ధకలిక బ్రహ్మాది విష్కంభకైః*- ముష్కరులు- విరోధులు ఇంట్లోకి నగరంలోకిగాని, చొచ్చుకొని రాకుండా ద్వారాలను మూసివేసి లోపలివైపు అర్గళాన్ని- బేడెంను అడ్డంగా పెట్టడం రక్షణ ప్రక్రియ. తలుపును అడ్డగించే గడియ మ్రాను 'విష్కంభం' అనబడును. 'ష్కభి ప్రతిబంధే'- విష్కభ్నోతి (ప్రతిబధ్నాతి) ఇతి= విష్కంభం.

"*తద్విష్కంభోర్గళం ననా*"- (అమరం). బ్రహ్మాది లోకపాలురు విష్కంభంవలె రక్షణకోసం నియమింపబడినవారు కాబట్టి బ్రహ్మ మొదలైన పాలకులు విష్కంభకులు- అని ఉపమింపబడినారు.

బద్ధకలికలు- అంటే స్పర్ధ కలవారు. పోటీ పడేవారు. లక్ష్మీకటాక్ష వీక్షణాలలో ఒక్కొక్క బిందువు 'నాకే దక్కాలి' అని బ్రహ్మేంద్రాదిలోక రక్షణ వ్యాపారులను కలహింపజేసేవి.

6) ఐశ్వర్యోద్గమ *గద్గదైః*- సంపదను సృష్టించి ఇచ్చే విలాస, విన్యాసాలలో నిమగ్నులైనందువల్ల, ఆ ఐశ్వర్యదేవతకూ, ఆమె కడగంటి చూపులకూ తొట్రుపాటు కల్గడం స్వాభావికం. ఇట్లు షడ్గుణాలు కలిగిన చూపులతో లక్ష్మీదేవి వేరే దిక్కూ-చక్కీ లేని నన్ను కటాక్షించవలెనని సుశ్లోకింపబడినది.

ఈ శ్లోకమందు మూడవ పాదం మొదటనున్న రెండు పదాలను కలిపి ఒకే సంబోధనాంతపదంగా 'పద్మేతే' అని కొందఱు చెబుతారు.

పద్మం అంటే కమలాన్ని 'ఇతా'= పొందియున్నది. కాబట్టి, 'పద్మేతా'- అని ఆకారాంత స్త్రీలింగ ప్రథమైక వచనం. హే పద్మేతే- అని సంబోధన ప్రథమైక వచనం.

ఓ కమల వాసినీ! లక్ష్మీదేవీ! అర్థం. ఇట్లు చెప్పడంవల్ల క్లేశమే తప్ప తోషమేమీ మిగులదు. వేర్వేఱుగా 'పద్మే! తే'- అని అందంగా అన్వయం

పొసగుతున్నది కదా! 'పద్మే' అనే సంబోధనం, ఆమె చూపులు విష్ణు భగవానుని యందు ఎక్కువగా సంచరించడంవల్ల, ఆ చూపులలో శైత్య సౌరభ మాంద్యాల సత్త్వాలను వ్యక్తం చేస్తున్నది.

'పా రక్షణే'- అనే ధాతువు యొక్క 'లోట్' మధ్యమ పురుషైక వచనం 'పాలయ'- అనే క్రియా పదం.

శార్దూల వృత్తం.

42. *పాదారుంతుదమేవ పంకజ రజశ్చేటీభృశాలోకితైః*
*అంగమ్లాని రథాంబ! సాహస విధౌలీలార విందగ్రహః।*
*డోలాతే వనమాలయా హరిభుజేహో కృష్ణ శబ్దాస్పదం*
*కేన శ్రీరతికోమలా తనురియం వాచాం విమర్దక్షమా॥*

**అర్థం:** అంబ= ఓ తల్లీ!; శ్రీః= లక్ష్మీదేవీ!; పంకజరజః= తామర పూవులోని పొడి; తే= నీ యొక్క; పాద+అరుంతుదం, ఏవ= పాదాలను బాధిస్తున్నది. చేటీ భృశ+ఆలోకితైః= చెలికత్తెల మిక్కిలి చూపులతో; అంగమ్లానిః= శరీరం వాడిపోతున్నది; అథ= అంతేకాదు; లీలారవిందగ్రహః= విలాసంకోసం పద్మాన్ని (చేతిలో) పట్టుకోవడం; సాహసకార్యమందే పొందుతున్నది; వనమాలయా= వైజయంతీమాలచేత; హరిభుజే= భగవానుని భుజాలయందలి; డోలా= ఉయ్యేల; హో! కష్ట శబ్ద+ఆస్పదం= 'అయ్యో! కష్టం' అని పల్కడానికి స్థానమైనది; అతికోమలా= మిక్కిలి సుకుమారమైన; ఇయం= ఈ; తనుః= శరీరం; కేన= ఎవనిచేత, ఏ కారణంచేత; వాచాం= మాటల యొక్క; విమర్దక్షమా= సంఘర్షణను ఓర్చుకొంటుంది; ఓర్చుకోదు.

**తా॥** జననీ! ఓ లక్ష్మీదేవీ! పద్మపరాగం నీ పాదాలకు ముల్లులాగా బాధకంగా ఉన్నది. చెలికత్తెలు దగ్గఱగా ఉండి నిన్ను పదే పదే చూచినంత మాత్రాన నీ దేహం వాడిపోతున్నది. విలాసంగా అరవిందాన్ని నీ చేతియందు ధరించడం ఒక సాహస కృత్యమే అవుతున్నది. నీ పతిదేవుని భుజాలనుంచి ఉయ్యేలవలె ఊగుతున్న వనమాల ఆయన ఎదలో నివసించిన నిన్ను తాకుతున్నందు

వల్ల "అయ్యో! ఎంతకష్టం" అని పల్కింపజేస్తున్నది. ఇంత సుకుమారమైన నీ దేహం కవుల మాటల ఒత్తిడిని ఎలా సహిస్తుంటుంది?

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి యొక్క సౌకుమార్యం వర్ణితం.

లక్ష్మీదేవి పద్మమందే నివసిస్తుంది. కాబట్టి ఆమె 'పద్మాలయ' అని పేర్గాంచినది. పద్మమెంత మృదువైనదో కదా! అంతకంటె ఎన్నో రెట్లు ఎక్కువ మెత్తనిది పద్మరజం. ఆ పుప్పొడి కణాలు లక్ష్మీదేవి చరణాలకు సోకినంతనే మర్మాలను వ్యథపెట్టునంత బాధ కల్గుతున్నది. "అరంతుందంతు మర్మస్పృక్"- (అమరం). మర్మాలను నొప్పించే బాధను 'అరుంతుదం' అంటారు. అంత సుకుమారమైనవి లక్ష్మి పాదతలాలు- అరికాళ్ళు.

*"హరేః వక్షఃస్థలం యయౌ"*- కమలవాసిని విష్ణుహృదయ కమలమందు నివసిస్తుండడంవల్ల ఆయన హృదయం అత్యంత సుకుమారమైనదన్న మాటే కదా!

*చేటీ భ్రూశాలోకితైః అంగమ్లానిః*- భూనీళాది సపత్నులూ, చెలికత్తెలూ సన్నిహితలై లక్ష్మీదేవిని ఎల్లప్పుడు కనువిందుగా సేవిస్తుంటే, వారి చూపులు పడగానే లక్ష్మీదేవియొక్క అవయవాలతోపాటు శరీరమంతా వాడిపోతుంది.

*సాహస విధౌ లీలారవిందగ్రహః*- ఇక చేతియందు ఆమె అరవిందాన్ని విలాసంగా ధరించడం, అదొక సాహసమైన పనిగా పరిగణింపబడుతున్నది.

*డోలాతే వనమాలయా హరిభుజే హా! కష్టశబ్దాస్పదం*- వైజయంతి అనే వనమాల "ఆ పాదపద్మం యామాలా వనమాలేతి సామతా"- భుజాల మీదినుంచి పాదాల దాకా వ్రేలాడే ఐదు రంగుల పూదండను 'వనమాల' అంటారు. విష్ణువక్షః స్థలమందు ఆసీనయైన లక్ష్మీదేవి, డోలగా వనమాల ఇటు-అటూ ఊగుతుంటే, దాని ఒత్తిడికి 'అయ్యో' అని హాహాకారాలు పల్కుతుంది.

స్త్రీల చూపులు ప్రసరించినంతనే వాడిపోయే అతికోమలమైన లక్ష్మీదేవి యొక్క దివ్యమైన మేను కఠినమైన కవిపుంగవుని యొక్క మాటలను ఎలా సహింప

గల్గుతుంది? ఇంతటి సౌకుమార్యం దేవాంగనలలో ఎవరియందు కూడా గోచరించదు. లక్ష్మీదేవి మాత్రమే ఇట్లు-

"పద్మప్రియే పద్మిని పద్మహస్తే!
పద్మాలయే పద్మదళాయతాక్షి!"

అని స్తుతింపబడుతున్నది కదా!

శార్దూల వృత్తం.

43. *ఆ మర్యాద మకంటకం స్తనయుగం నాద్యాపి నాలోకిత*
*భ్రూభేదస్మిత విభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః।*
*సూతే శైశవ యౌవన వ్యతికరో గాత్రేషు తే సౌరభం*
*భోగస్రోతసి కాంతదేశిక కరగ్రాహేణ గాహక్షమః॥*

**అర్థం:** (హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!); తే= నీ యొక్క; స్తనయుగం= స్తనద్వయం; ఆమర్యాదం= తగిన హద్దువరకు; అద్య+అపి= ఈనాటికి కూడా; అకంటకం= ప్రతిబంధకం లేనిదిగా; న= లేదు; ఆలోకిత-విభ్రమాః, వా/ ఆలోకిత= కటాక్ష దృష్టియొక్క; భ్రూభేద= కనుబొమల కదలికల యొక్క; స్మిత= చిఱునవ్వు యొక్క; విభ్రమాః, వా= విలాసాలు కూడా; నైసర్గికత్వ+అయశః= స్వాభావికమైన అపకీర్తిని; అద్యాపి= నేటికి కూడా; న, జహతి= విడవడం లేదు; భోగస్రోతసి= అనుభవ ప్రవాహమందు; కాంత, దేశిక, కర, గ్రాహేణ= ప్రియుడైన భగవంతుడు అనే ఆచార్యుని చేతిని పట్టుకోవడంచేత; గాహక్షమః= లోపలికి దిగి మునుగడానికి సమర్థమైన; శైశవ, యౌవన వ్యతికరః= బాల్య, యౌవనాలకు గల సంబంధం (తారుణ్యం) (తే= నీ యొక్క); గాత్రేషు= శరీరావయవాల యందు; సౌరభం= సౌగంధ్యాన్ని; సూతే= కనుచున్నది, కల్గిస్తున్నది.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ చనుదోయి ఉండవలసిన హద్దులో తారుణ్యం అడ్డుగా కలది. చూపులో కనుబొమల కదలికలలో, చిఱునగవులోనూ విలాసాలు, యౌవన దశలో ఉండే విధంగా లేవనే అపకీర్తిని ఈనాటికి కూడా

పొందుతున్నాయి. భోగ ప్రవాహంలోకి నీ ప్రియుడనే ఆచార్యుని యొక్క హస్తావలంబనం చేత దిగి అవగాహించడానికి కౌమార యౌవనాల సంధియైన తారుణ్యం ద్వివమైన నీ అవయవాలలో విలక్షణమైన పరిమళాన్ని కలుగజేస్తున్నది.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవియొక్క తారుణ్యాన్ని భట్టర్‌వారు మర్యాద మీరని విధంగా వర్ణించిన చమత్కృతి మత్కృతి ఇది. లక్ష్మీదేవి, శైశవ యౌవన దశల మధ్యన ఉండే పరువం కల్గియున్నదని వర్ణన. 'శైశవం' అంటే శిశుప్రాయమే కాక 'కౌమారావస్థ' అని కూడా అర్థం.

*"శైశవేఽభ్యస్త విద్యానాం"*- అని మహాకవి కాళిదాసు సూక్తి. విద్యను అభ్యసించే ప్రాయం- కౌమారదశ- తెల్పబడింది. వాస్తవంగా, ముప్పదేండ్ల వరకు బాల్య-కౌమార, తారుణ్య యౌవనదశలు కలుగుతాయి. బాల్య, కౌమార దశలను కలిపి ఒకే దశగా వర్ణించడం సాధారణం. తారుణ్యం పడుచుతనం పొడచుకొని వచ్చే దశ- యౌవనం అవయవ సౌష్ఠవం కల్గినదశ. దేవతలకు 'త్రిదశులు' అని పేరున్నది. మూడు దశలు కలవారు. 'జర' అంటే ముసలితనం దేవతలను ముట్టుకోదు, పట్టుకోదు. వారు నిత్యయౌవనులు. 'నిర్జరులు' అని దేవతలకు సార్థకమైన పేరు.

*ఆమర్యాద మకంటకం స్తనయుగం, అద్యాపి, న:*- శ్రీదేవి యొక్క స్తన యుగ్మం సముచితంగా పరిణమించడానికి ప్రతిబంధకం- అడ్డులేనిదిగా లేదు. అంటే, చనుగవ నిండుగా పెరుగలేదు. ఇంక ఉద్భేదానికి స్థలమున్నది- అని అర్థం. "ములైయో ముషు ముత్తుమ్ పోన్దిల"- స్తనాలు ఇంకా నిండుగా ఉద్భేదించ లేదు, అనే నమ్మాళ్వార్ల శ్రీసూక్తి ఇక్కడ వర్తిస్తుంది.

*ఆలోకిత, భ్రూభేద, స్మిత, విభ్రమా, వా నైసర్గికత్వా యశః నజహాతి:*- ('వా' అనే పదం (చ) కూడా అనే అర్థం కలది. 'విభ్రమ' శబ్దాన్ని పైనున్న మూడు పదాలకు వేర్వేఋగా అన్వయించుకోవలెను. విభ్రమం అంటే విలాసమని అర్థం. చూపులో విలాసాలు, భ్రూభంగంలో విలాసాలు, చిరునగవులో విలాసాలు యౌవన దశలో ఉండే విధంగా లేవు- అని భావం. యౌవన దశలో ఉండే

నిండు విలాసాలు లేవు అనే అపకీర్తి పోలేదట. విలాసాలు లాస్యం చేసే అవకాశ మున్నదని అర్థం.

ఉత్తరార్ధంలో మరింత చమత్కారం ఉంది. విష్ణు మనోనుకూల కదా! లక్ష్మీదేవి. ఆ దివ్యదంపతులు మనకు తల్లిదండ్రులు. జగమంతా వారి కుటుంబమే. కౌమారం వీడలేదు. నిండు యౌవనం రాలేదు. ఈ రెండింటికి మధ్యదశలో నున్నది లక్ష్మీదేవి.

రేపు చూపించేవాడు గురువు కదా! లక్ష్మీదేవికి తన వల్లభుడే దేశికుడు. భోగం అంటే సుఖానుభవం. భోగం అనే ప్రవాహంలోకి దిగి అవగాహించడానికి శ్రియఃపతి యొక్క హస్తాన్ని పట్టుకొనియున్నది ('కరగ్రాహేణ' అనేపదం ప్రాణం వంటిది.) తారుణ్యం కౌమార యౌవన దశల సంధిపరువం కదా! ఇకముందు సుఖానుభవం పొందడానికి యోగ్యమైన దశలోనున్నది. తారుణ్యం తొణికిస లాడుతున్నది. నిండు యౌవనదశలో భోగస్రోతస్సులో అవగాహింపనున్నది- అని విలక్షణంగా వర్ణించడంలో శ్రీ పరాశర భట్టర్ ఎంతో మర్యాదను పాటించారు.

శార్దూల వృత్తం.

44. *ఆమోదాద్భుతశాలి యౌవన దశావ్యాకోచ మమ్లానిమత్*
*సౌందర్యామృత సేకశీతల మిదం లావణ్య సూత్రార్పితమ్।*
*శ్రీరంగేశ్వరి! కోమలాంగ సుమనః సందర్భణం దేవి! తే*
*కాంతోరః ప్రతియత్న మర్హతి కవింధిజ్మామ కాండాకులమ్॥*

**అర్థం:** శ్రీరంగేశ్వరి= శ్రీరంగనాయకీ!; దేవి= శ్రీరంగరాజ పట్టమహిషివైన ఓ లక్ష్మీ!; ఆమోద+అద్భుతశాలి= సువాసనవల్ల ఆశ్చర్యంగా ప్రకాశిస్తున్నట్టి; యౌవన దశా వ్యాకోచం= యౌవనదశ అనే వికాసం కలదైన; అమ్లానిమత్= వాడిపోనట్టి; సౌందర్య+అమృతసేక శీతలం= సౌందర్యం అనే అమృతంచేత తడుపడం వల్ల చల్లనిదైన; లావణ్య సూత్ర+అర్పితం= లావణ్యం అనే దారంలో అర్పించబడిన; ఇదం= ఈ; తే= నీ యొక్క; కోమల+అంగ సుమనః, సందర్భణం= సుకుమారాలైన

అవయవాలు అనే పూవులచే కూర్చబడిన మాలిక; కాంత+ఉరః, ప్రతియత్నం= ప్రియుని వక్షఃస్థలానికి; అలంకారంగా; అర్హతి= తగియున్నది; అకాండ+ఆకులం= తగని రీతిగా, కలతపడిన; కవిం= కవినైన; మాం= నన్ను; ధిక్= నిందించుకోవాలి.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ సుకుమార శరీరం నారాయణుని వక్షస్సుకే తగియున్నది. నీవు వనమాలవంటి దానవే! నీ శరీరం అనే పుష్పమాలిక సువాసన కలది. యౌవన దశ అనే వికాసం కలది. ఎప్పుడూ కూడా వాడిపోనట్టిది. సౌందర్యం అనే జలంచేత తడుపబడి చల్లగానూ ఉందునట్టిది. లావణ్యం అనే దారంతో నీ అవయవ రూపమైన పూలచే కూర్చబడిన శరీరం అనే మాలిక నీ ప్రియుని వక్షఃస్థలానికి అలంకారంగా నున్నది- అని ఈ విధంగా భావించి వర్ణించడం కవికి ఉచితం కాదు- అని భట్టర్ వారు పశ్చాత్తాప పడినారు.

**వ్యాఖ్య:** కవికి లక్ష్మీదేవియందున్న అత్యంత భక్తిని ప్రకటిస్తున్న శ్లోకమిది.

శ్రీదేవి యొక్క అవయవాలే సువాసనగల పువ్వులు. లావణ్యమేదారం. అంగసౌందర్యం అంగిసౌందర్యాన్ని చాలా ప్రకాశింపజేస్తుంది. అవయవాల సామూహికమైన శరీరం యొక్క సౌందర్యాన్ని 'లావణ్యం' అంటారు. ఉప్పుమడులలో నుంచి ఒక ఉప్పు పలకను దీసి విరిచినప్పుడు నడుమ మెరిసే తాళతళ్యమే 'లావణ్యం' కదా! కాబట్టి, లావణ్యం అనే సూత్రంలో అవయవాలు అనే పూలు కూర్చబడినవి. ప్రతి పుష్పానికి ఆశ్రయంగా ఉండేది దారం- అని భావం.

శ్రీదేవి యొక్క దివ్య విగ్రహమే పుష్పమాలిక. శ్రీదేవి పద్మగంధి, పద్మదళాయతాక్షి. పద్మినియే కదా! ఈ పుష్పమాలిక, సౌందర్యం అనే అమృతం- జలంచేత చిల్కబడినందువల్ల శీతలత్వం కల్గియున్నది. వెనుక శ్లోకంలో వర్ణితమైన పరువం వికసించి యౌవనదశలో ఉన్నది. దివ్య శరీరాలకు ముసలితనం సోకదు కాబట్టి వాడిపోకుండా నిత్యనూతనంగా ఉండడం సాధారణమే. ఇట్లు పరిమళం, సౌందర్యం, వాడిపోనితనం, వికాసం, శైత్యం, లావణ్యం అనే ఆరు గుణాలతో

విరాజిల్లుతున్న పూలదండ శ్రీహరి మహోరస్సుకు వనమాల లాగా అలంకారయోగ్య మైనది శ్రీహరి వక్షః పీఠియైనది లక్ష్మీదేవి అని అర్థం.

*"తం పద్మదళ పత్రాక్షం మత్తమాతంగ గామినం"*- అని సీతాదేవి అశోక వనంలో దుఃఖపడుతూనే శ్రీరాముని అందంలో అభినివేశాన్ని పొందింది. ఇక్కడ, దళమన్నా, పత్రమన్నా ఒకటే కదా! పర్యాయ పదాలైన రెండింటిని కలిపి వాల్మీకి, శ్రీరాముని రూపసౌందర్యాన్ని మధురంగా వర్ణించాడు. రూపసౌందర్యం, గమన సౌందర్యం కలవాడు శ్రీరాముడు- అని ఆ శ్లోకపాదం వర్ణిస్తున్నది.

*"అక్షమింద్రియకాయయోః"*- అని నిఘంటు వచనం. 'అక్ష' మనే పదానికి 'నేత్రం, శరీరం' అని రెండు అర్థాలు. తామర పూరేకు వంటి కన్నులు కలవాడు, తామరాకు వన్నెవంటి శరీర వర్ణం కలవాడు. కాబట్టి *"మనత్తుక్కిని యాన్"* మనస్సుకు మధురమైనవాడు శ్రీరాముడని పల్కింది గోదాదేవి.

*"శెక్కమలత్తలర్ పోలుమ్ కణ్కైకాల్ శెమ్ కనివాయ్, అక్కమలత్తిలై పోలుమ్ తిరుమేని అడిగళుక్కు"*- (తి.వా.మొ.) భగవానుని కన్నులు, చేతులు, కాళ్ళు తామరపూలవంటివి. ఆయన అధరం దొండపండువలె ఎఱ్ఱని వన్నె కలది.

భగవానుని మేను తామరాకు వన్నెవంటి వన్నె కల్గి యున్నదని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. చిగురుటాకువలె మెత్తనిది- అనే అర్థమూ ఉన్నది. *"పద్మదళ పత్రాక్షం"*- లోని అక్ష పదానికి 'అలర్ పోలుమ్' అని, "ఇలై పోలుమ్ తిరుమేని" అని వేర్వేఱుగా- "ఇరట్టుర మొషిదల్" శ్లిష్టపదంగా- వాల్మీకిసూక్తి వివరింపబడింది.

సుమ సుకుమారమైన- పుష్పంవలె మృదువైన భగవానుని వక్షఃస్థలానికి 'సుమకుమారి'- పుష్పం కంటె మృదువైన శ్రీదేవి వనమాలవలె అలంకారంగా ఉన్నదని వర్ణించిన వెంటనే "కవింధిక్ మామకాండాకులమ్"- అని కవి భట్టర్- 'నేనొక కవినేనా? ఇట్లు వర్ణించడం తగదు- అని తనను తాను నిందించుకో దగినట్లు కలత పడడం ఎందుకు? అనే సందేహం కలుగుతున్నది.

ఇంతకుముందు 42వ శ్లోకంలో *"డోలాతే వనమాల యా హరి భుజే హా కష్ట శబ్దాస్పదం"*- భగవానుని ఎదలో ఊగుతున్న వనమాలతో నీకు ఒత్తిడి

కలిగి హాహా కారాలతో బాధపడే నీ సౌకుమార్యాన్ని కవులు తమ పరుష వాక్కులతో వర్ణించినా, ఆ సౌకుమార్యం వసివాడిపోతుందని భట్టర్ వారు వర్ణించారు కదా! ఆ విధంగా వర్ణించిన తర్వాత, ప్రియుని ఎదలో శ్రీదేవి పూలదండవలె అలంకారంగా తగియున్నది- అని వర్ణించడం హస్తమస్తక న్యాయానికి అవకాశం కల్గించింది. ఈ భావ సంఘర్షణం ప్రేమాతిశయం వల్ల కలిగిందని భావించాలి.

శ్రీహరి మహోరస్కుడు. అసురుల బాణపుదెబ్బలను తట్టుకొనే కఠిన వక్షః స్థలం కలవాడైనా, ఆశ్రిత వాత్సల్యం కల్గిన శ్రీదేవి ఆశ్రయించినందువల్ల ఆమెకు "అకలికిల్లేన్"- నేను విడిచియుండలేను- అన్నంత భగవానుని వక్షఃస్థలం అత్యంత సుకుమారమైనదే- అని కవియొక్క ప్రేమాతిశయాన్ని తెల్పుతున్నది.

శార్దూల వృత్తం.

*45. మర్మస్పృశో రససిరా వ్యతివిధ్య వృత్తైః*
*కాంతోప భోగ లలితైర్లు లితాంగ యష్టిః।*
*పుష్పావళీవ రసిక భ్రమరో పభుక్తా*
*త్వం దేవి! నిత్యమభినందయసే ముకుందమ్॥*

**అర్థం:** హేదేవి!= ఓ లక్ష్మీదేవీ!; మర్మస్పృశః= మర్మావయవాలను స్పృశించునట్టి; రస సిరాః= రసనాడులను; వ్యతివిధ్య= తాకి పొంగింపజేసి; వృత్తైః= ప్రవర్తించినవియైనట్టి; కాంత+ఉపభోగ, లలితైః= కాంతుని అనుభవం యొక్క విలాసాలతో; లులిత+అంగయష్టిః= సొక్కిన- మర్దింపబడిన చిగురుకొమ్మవంటి శరీరం కల్గినదానవై; రసికభ్రమర+ఉపభుక్తా= పుష్పరసాన్ని ఆస్వాదించే తుమ్మెద చేత పూర్ణంగా అనుభవింపబడినట్టి; పుష్ప+అవళీ, ఇవ= పూల (సముదాయం) మాలికవలె; త్వం= నీవు; ముకుందం మోక్షాన్ని ఇచ్చే భగవానుణ్ని; నిత్యం= సర్వదా; అభినంద యసే= ఆనందింప జేస్తున్నావు

**తా॥** ఓ శ్రీదేవీ! నీవు శ్రీహరి యెదలో పూలదండవలె శోభిస్తున్నావు. నీ కాంతుని ఉపభోగ విలాసాలచేత నీ యొక్క రసనాడులు ఉప్పొంగి నీవు ఆనందాన్ని

అనుభవిస్తున్నావు. చిగురుకొమ్మవంటి నీ శరీరం ఆయన కదలికలచేత సొక్కి సొలసి యుంటుంది. అయినా, పూల రసాన్ని ఆస్వాదించే తుమ్మెదచేత అనుభవింప బడి నీవు సంతోషాన్ని పొందుతున్నావు. నీ సాహచర్యంచేత శ్రీహరిని సంతోష పరుచుతున్నావు.

**వ్యాఖ్య:** దివ్యదంపతుల సంభోగ శృంగారం వర్ణితం.

దేవీ! అని సంబోధిస్తూ జగన్నాయికా నాయకుల క్రీడను గూఢంగా తెల్పుతున్న శ్లోకమిది.

శ్రియఃపతిని ఆనందింపజేస్తేనే గాని శ్రీదేవి ఆనందించదు. "*అల్లిమలర్ మకళ్ పోక మయక్కు క్కళాకియుమ్ నిఱ్కుమమ్మాన్*"– కమల వాసిని భోగానుభవం (సంశ్లేషం) వల్ల కల్గిన ఆనందాన్ని పొందినవాడై యుండే స్వామి– అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. (తి.వా.మొ. 3-10-8).

"*తూవియమ్ పుళ్ళుడై త్తెయ్వ వండు తుదైంద వెమ్ పెణ్మై యమ్ పూవిదాలో*"– (తి.వా.మొ. 9-9-4). సుపర్ణుడైన గరుత్మంతుని వాహనంగా కల్గిన పరదైవమనే తుమ్మెద చేత మర్దింపబడిన మా స్త్రీత్వ (శరీర)మనే అందమైన పువ్వు ఇట్లైనది– అని గూఢంగా పల్కిన వాక్చాతుర్యం ఈ శ్లోకంలోని మాటలచేత అనుకరింపబడినట్లున్నది కదా!

భగవంతుని స్వాతంత్ర్యాన్ని, జీవుడు చేసే అపరాధాలను జూచి శ్రీదేవి "*ఏమవుతుందో కదా!*" అనే భయంతో, క్షణ కాలమైనా శ్రీహరిని ఎడబాయకుండా ఆయన హృదయంలోనే నివసించి తన విలాసాలతో తన కాంతుని ఆనందింపజేస్తూ, (వశపరచుకొని) చేతనులను రక్షింపజేసే క్రీడ ఇది. ఐకరస్యాన్ని విశదపరచే శ్లోకమిది.

*దేవి! త్వం నిత్యం అభినందయసే ముకుందమ్:*– 'నిత్యం' అనడం వల్ల ద్వయ మంత్రంలో ఉన్న 'శ్రీమత్' అనే మాటలో 'మతుప్' అనే ప్రత్యయానికి గల 'నిత్య యోగం' అనే అర్థం తెల్పబడింది.

ద్వయ మంత్రమందు 'శ్రీమన్నారాయణ' అనే మొదటి వాక్యమందున్న పదానికి 'ఆశ్రయించడానికి సౌకర్యాన్ని కల్గించే గుణాలను కల్గిన వాడ'ని అర్థం.

రెండవ వాక్యంలో "శ్రీపతే నారాయణాయ"- అనే మాటలకు 'ఆశ్రయించిన వ్యక్తులకు సౌకర్యాన్ని కల్గించే గుణాలు కలవాడు'- అని అర్థం. రెండు వాక్యాలలోనూ 'మతుప్' ప్రత్యయం ఉన్నది. ఐకరస్యంగల దాంపత్యం అది.

శ్రీరాముడు వనవాసానికి పోయే సమయాన సీతాదేవి ఏదో విధంగా తనను వెంట దీసుకొని పోవునట్లు కాంతుని అంగీకారాన్ని పొందింది. వెంటనే లక్ష్మణుడు రాముని పాదాలను పట్టుకొన్నాడు. సీతాపిరాట్టి ముఖాన్ని మాత్రమే చూస్తున్నాడు- అని రామాయణ సూక్తి.

ఆ దివ్యదంపతులకు సర్వవిధ కైంకర్యం చేయడానికి తనను వారి వెంట దీసుకొని పోవునట్లు శ్రీరామునికి చెప్పి ఒప్పించవమ్మా! అనే ప్రార్థన లక్ష్మణుని ప్రక్రియలో సూచింపబడింది. లక్ష్మణుడు చేసిన ఈ ప్రక్రియ, ద్వయమంత్రార్థాన్ని ప్రయోగ పూర్వకంగా తెల్పుతున్నదని విజ్ఞుల మాట.

పూర్వార్థం శ్రీహరి పరమ రసిక సార్వభౌముడని తెల్పుతున్నది. 'రస సిరలు' అంటే రసనాడులు- అవి మర్మావయవాలకు సంబంధించిన నాడులన్న మాట. శ్రీకాంతుడు శ్రీదేవి యొక్క రసనాడులను తన ఉపభోగ విన్యాసాలచే తాకి కదలించాడు. ఇర్వురకు ఆనందం అంబరాన్ని అనుకొన్నది వాస్తవమే కాని ఆ విలాసాలతో లేత కొమ్మవంటి సుకుమారమైన శ్రీదేవి శరీరం సొక్కి అలసిపోయింది.

ఉత్తరార్థం 'శృంగార పరాకాష్ఠ'ను వర్ణిస్తున్నది. 'రసిక భ్రమరం' అనే పదం శ్రీకాంతునికి ఉపమానం. 'పుష్పావళీ' అనే పదం శ్రీదేవి శరీరానికి ఉపమానం. పూదే నేను ఆస్వాదించేది తుమ్మెద. 'పుష్పాల అవళి' అంటే పూల సముదాయం. ప్రత్యంగ సౌందర్యాన్ని తెల్పుతుంది. అవయవాల సముదాయమే శరీరం- అవయవి. పూలదండతో పోల్చబడినది స్తనాద్యవయవాలు కల్గిన స్త్రీ శరీరం.

రసికుడైన శ్రీకాంతుడు, తుమ్మెద పూల సముదాయాన్ని సంచలింపజేస్తూ రసాస్వాదన చేసినట్లు, ప్రత్యంగ సౌందర్య రాశియైన శ్రీదేవి శరీరాన్ని అనుభవించడంవల్ల శ్రీదేవి ఆనందిస్తూ, తన భర్తను ఆనందింప జేస్తున్నది. ముకుందుడంటే మోక్షదాత. ముకుందం నిత్యం అభినందయసే- గమనింప దగిన మాట ఇది- 'ము' అంటే ముక్తిని, 'కు' అంటే (భూమి) భుక్తిని (ముకుం) 'ద' అంటే ఇచ్చేవాడు.

'ముకుం' అనే పదం సుబంతరూపంగా ఉన్న అవ్యయం. భక్తులను అనుగ్రహించే విధంగా విశ్వరక్షణ వ్యాపారమందున్న ముకుందుణ్ని నిత్యం నయన హృదయానంద కందళితునిగా చేస్తున్నది శ్రీదేవి.

'త భ జ జ గ గ'- గణాలున్న వసంత తిలకావృత్తం.

"ఉక్తావసంత తిలకా త భ జా జ గౌ గః"- వృత్త లక్షణం.

*46. కనకరశనా ముక్తా తాటంకహార లలాటికా*
*మణి సరతులాకోటి ప్రాయైః జనార్దన జీవికే!*
*ప్రకృతి మధురం గాత్రం జాగర్తి ముగ్ధ విభూషణైః*
*వలయ శకలైర్దుగ్ధం, పుష్పైశ్చ కల్పలతాయథా॥*

**అర్థం:** హే జనార్దన జీవికే= జనార్దనుడైన భగవంతుణ్ని జీవింపజేసే ఓషధి లతవైన ఓ లక్ష్మీదేవీ!; కనక- ప్రాయైః/ కనక రశనా= బంగారు ఒడ్డాణం; ముక్తా తాటంక= ముత్యాలతో చేయబడిన చెవికమ్మలు; హార= ముత్యాల హారాలు; లలాటికా= పాపట పట్టి/ తిలకం; మణిసర= మణిహారాలు; తులాకోటి= కాళ్ళగజ్జెలు; ప్రాయైః= మొదలైన; ముగ్ధవిభూషణైః= అందమైన నగలతో; ప్రకృతి మధురం= సహజ సుందరమైన; గాత్రం= (నీ) శరీరం; వలయ శకలైః= చక్కెర ముక్కలతో; దుగ్ధం యథా= పాలవలె; పుష్పైః= పూవులతో; కల్పలతా, యథా, చ= కల్పలతవలెను; జాగర్తి= ప్రకాశిస్తున్నది.

**తా॥** ఓ జనార్దనుని జీవికవైన ఓ లక్ష్మీదేవీ! బంగారు ఒడ్డాణం, ముత్యాల దుద్దులు, స్వర్ణ మణిహారాలు, నుదుట వ్రేలాడే నగ లేదా తిలకం, మణిమయ నూపురాలు మొదలైన ఆభరణాలు సహజంగానే అందమైన నీ దేహానికి, పంచదార పాలకువలె, పువ్వులు కల్పలతకువలె పరమ శోభను కలుగజేస్తున్నాయి.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి యొక్క సహజ సుందరమైన అవయవ శోభను స్వర్ణ భూషణాలు, మణిమయాభరణాలు వృద్ధి చేస్తున్నవని సుశ్లోకితం.

లక్ష్మీదేవి యొక్క గాత్రం– శరీరం, పాలవలె స్వచ్ఛమైనది, మధురమైనది, మసృణమైనది– నునుపుగా ఉండి తళతళమెరయునట్టిది. అంతేకాదు, సన్నగా, నున్నగా, ఏపుగా ఎదుగుతూ చెట్టుకు అల్లుకొని యుండే సుకుమారమైన కల్పలతను పోలియున్నది. గాత్రం పాలవంటిదైనప్పుడు ఆభరణాలు చక్కెర ముక్కలవంటి వైనాయి. శరీరం కల్పలతవంటిదైనప్పుడు భూషణాలు పువ్వులవంటివైనట్లు రెండు ఉపమానాలతో శోభాతిశయం వర్ణింపబడినది.

సహజంగా పాలు మధురమైనవి. పాలలో చక్కెర కలిసినట్లైతే మాధుర్యం అధికమవుతుంది కదా!

స్వాభావికమైన సౌకుమార్యంగల కల్పలత పువ్వులతో శోభిస్తే సౌగంధ్యం వ్యాపించి రమణీయంగా రాణిస్తుంది.

*"నిరాశ్రయా నశోభంతే పండితా వనితాలతాః"*– అన్నట్లు, ఆశ్రయం లేనిది తీగ శోభించదు కదా! లత యొక్క ఆశ్రయంచేత తరువు శోభించినట్లే శ్రీదేవి యొక్క ఆశ్రయంచేతనే శ్రీపతికి శోభ అతిశయిస్తుంది– అనే అర్థమూ అనురణిస్తున్నది.

ఆభరణాలచేత అవయవ శోభ పెరిగిన పట్టిక ఈ శ్లోకమందున్నది.

1) కనక రశనా– స్వర్ణ మేఖల, శరీరం యొక్క పూర్వోత్తర భాగాలను అనుబంధించే నడుముకు శోభ.

2) ముక్తా తాటంకాలు- దుద్దులు- కర్ణాభరణాలు.

3) హారాలు- ముత్యాల హారాలు వక్షోజాలకు అలంకారాలు.

4) లలాటికా- లలంతిక. నడినెత్తినుంచి నెన్నుదురు మీద వ్రేలాడుతు ముఖమండలాన్ని శోభింపజేసే నగ.

5) తిలకం- పాపటిబొట్టు. రంగు రంగుల రాళ్ళ నగ.

6) మణిసరం- రత్నమాలికలు- గళాన మంగళంగా శోభించేవి.

7) తులాకోటి - మణిమయ నూపురాలు- మంజులంగా ధ్వనించే పాదాభరణాలు- కాళ్ళ అందెలు, గజ్జెలు.

8) ప్రాయైః- అంటే మొదలైనవి- ముంజేతి కంకణాలు, బాహువులకు నాగాభరణాలు, సౌభాగ్య సూచకాలు.

వలయ శకలాలు- అంటే శర్కరాఖండాలు- కండచక్కెర పలుకులు- అని అర్థం.

జనార్దన జీవికే- ఇది లక్ష్మీదేవిని సంబోధించే పదం. జనార్దనః- విష్ణు సహస్ర నామాలతో 128వ నామంగా ఉన్నది. జనాన్ అర్దయతి ఇతి జనార్దనః - లోక రక్షణకు ప్రతిబంధకంగా ఉండే అసుర స్వభావంగల జనులను నశింప జేయువాడు భగవానుడు అని అర్థం.

శ్రీపరాశర భట్టర్ వి.స.నా. భాష్య గ్రంథమందు "దస్యుత్రాణాత్ జనార్దనః" - (దోపిడి చేసే జనుల నుంచి భక్తులను రక్షించేవాడు) అనే భారతమందలి నిర్వచనాన్ని ప్రామాణికంగా జూపినారు.

దుర్జనులను పీడించేవాడు, సాధుజనులను రక్షించేవాడు జనార్దనుడు. జనార్దనుడైన భగవానునికి జీవనాధారమైనది లక్ష్మీదేవి.

"ఊర్ధ్వం మాసాత్ న జీవిష్యే"- ఒక నెలకు మించి నేను జీవించలేను- అని సీతమ్మ అన్నది. శ్రీరాముడు "న జీవేయం క్షణమపి వినాతాం అసితేక్షణాం"-

నల్లని కన్నులు కల్గిన ఆ సీతాదేవిని విడిచి క్షణం కూడా జీవించలేను- అనేవాడు. కాబట్టి, శ్రియఃపతికి జీవనౌషధమైనది శ్రీదేవి.

సహజ సుందరమైన పిరాట్టి నల్లని కన్నుల శోభయే భగవంతునికి హృదయావర్జకమైతే, ఇక వివిధాభరణాలతో దీపించే లక్ష్మీదేవి యొక్క గాత్ర శోభ జనార్దనునికి పరమ భోగ్యంగానే ఉంటుంది. అందువల్ల లక్ష్మీదేవి 'జనార్దన జీవిక'గా స్తుతింపబడినది.

హరిణీవృత్తం- 'న స మ ర స ల గ'- గణాలు కలది.

*47. సామాన్య భోగ్యమపి కౌస్తుభ వైజయంతీ*
*పంచాయుధాది రమణః స్వయమేవ బిభ్రత్।*
*తద్భార ఖేదమివ తే పరిహర్తుకామః*
*శ్రీరంగధామ మణిమంజరి! గాహతేత్వామ్॥*

**అర్థం:** హే శ్రీరంగధామ మణిమంజరి= శ్రీరంగనాథుని ఆలయానికి రత్నాల గుచ్ఛిక వంటి ఓ లక్ష్మీదేవీ!; సామాన్య భోగ్యం, అపి= సమానంగా అనుభవింపదగినవే అయినా; కౌస్తుభ, వైజయంతీ, పంచాయుధ+ఆది= కౌస్తుభమణి, వనమాల, పంచాయుధాలు మొదలైన వాటిని; తత్‌భార ఖేదం= వాటి బరువును భరించడం వలని ఆయాసాన్ని; తే= నీకు; పరిహర్తు కామః, ఇవ= లేకుండా చేయడానికో అన్నట్లు; స్వయం, ఏవ= తానే; బిభ్రత్= ధరిస్తున్న వాడైన; రమణః= నీ ప్రియుడు; త్వాం= నిన్ను; గాహతే= నిండుగా అవగాహిస్తున్నాడు- నీతో ఆనందాన్ని పొందుతున్నాడు.

**తా॥** శ్రీరంగ విమానానికి మణుల గుత్తి- రంగురంగుల మణులు వేర్వేఱు కాంతులతో వెలుగుతున్న అద్భుత దీపంవంటి ఓ లక్ష్మీదేవీ! కౌస్తుభరత్నం, వైజయంతి, పంచాయుధాలు మొదలైన వాటిని నీవు, నీ భర్త కూడా అలంకారంగా ధరించి సంతోషించడం సామాన్యమే. లక్ష్మీదేవి కూడా చతుర్భుజాలలో పాశం, అంకుశం, శంఖం, చక్రం అనే వాటిని ధరిస్తుంది. ధర్మార్థ కామమోక్ష దాయిని అని పాంచరాత్రాగమ శాస్త్రం తెల్పుతున్నది.

"పాశాంకుశధరాదేవీ ధర్మకామార్థమోక్షదా"

"శంఖ చక్రాంబుజధరాం లక్ష్మీ మేవతు చింతయేత్"

అయితే "తద్భారఖేదమివతే పరిహర్తుకామః రమణః స్వయమేవ బిభ్రత్"- సుకుమారివైన నీకు శంఖ చక్రాదుల బరువును మోసే శ్రమ కల్గకూడదనే నీ ప్రియుడు వాటిని తానే ధరిస్తున్నాడు. అంత ప్రేమ కలవాడు కాబట్టి, నీతోనే ఆనందాన్ని పొందుతున్నాడు. లక్ష్మీదేవి కోమలాంగి యని, స్వాధీన పతిక యని ఈ శ్లోక సారాంశం.

వసంత తిలకావృత్తం.

48. *యది మనుజతిరశ్చాం లీలయాతుల్య వృత్తేః*
*అనుజను రనురూపాదేవి! నావాతరిష్యః।*
*అసరస మభవిష్యన్నర్మ నాథస్య మాతః*
*దరదళ దరవిందోదంత కాంతాయతాక్షి!॥*

**అర్థం:** హేదర దళత్-అక్షి/ దర= కొద్దిగా; దళత్= వికసిస్తున్న; అరవింద= కమలంయొక్క; ఉదంత= వృత్తాంతాన్ని (సమానత్వాన్ని) కల్గిన; కాంత= ఆకర్షణీయమైన; ఆయత= విశాలమైన; అక్షి= కన్నులు కల్గిన ఓ లక్ష్మీదేవీ!; దేవి= పట్టపురాణివైన; మాతః= ఓ జగజ్జననీ!; లీలయా= స్వేచ్ఛతో; మనుజ, తిరశ్చాం= మనుష్యులకు, తిర్యక్కులకు; తుల్యవృత్తేః= సమానమైన ప్రవర్తన కల్గిన; నాథస్య= నీ భర్త యొక్క; అనుజనుః= ప్రతి అవతారమందు; అనురూపా= తగిన రూపాన్ని కల్గిన దానివై; న అవాతరిష్యః, యది= (నీవు) అవతరించియుండని యెడల; నర్మ= (నీ నాథుని) విలాసం; అసరసం= సరసం కానిది; అభవిష్యత్= అయి ఉండేది.

**తా॥** కొంచెం వికసిస్తున్న తామరపూవు వలె మనోహరమైన, విశాలమైన నేత్రాలను కలిగియున్న ఓ లక్ష్మీదేవీ! కర్మవశం వల్ల కాకుండా, తన సంకల్పంతోనే మానవ తిర్యక్కులకు తగిన వృత్తిలో ప్రవర్తించిన నీ భర్తయైన నారాయణుడు

ధరించిన అవతారాలకు తగినట్లుగా నీవు కూడా స్వేచ్ఛగా అవతరించక పోయినట్లైతే, నీ నాథుని లీల విరసమై యుండేది- అని కవి భావన.

**వ్యాఖ్య:** భగవానుడు ధరించిన అవతారాలకు తగిన తన రూపం, లీల కల్గియుండునట్లు లక్ష్మీదేవికూడా అవతరించి భగవానుని క్రీడను సరసం చేసిందని సుశ్లోకితం.

కొంచెం వికసిస్తున్న తామరపూలతో సమానంగా, అందమైన, విశాలమైన కన్నులు కల్గిన ఓ లక్ష్మీదేవీ! అని సంబోధింపబడింది.

కన్నులు పూర్తిగా మూసుకొన్నవి కావు. బాగా విప్పారిన కన్నులూ కావు. ఇప్పుడిప్పుడే వికసిస్తున్న తామరపూలలాగా మూసి మూయనట్లున్నవి ఆ కన్నులు. కాబట్టి అవి మనోజ్ఞమైనవట.

*"కింకిణి వాయ్చ్చెయ్ద తామరైపూప్పోలే శెంగణ్ శిఱిచ్చిఱిదే ఎమ్మేల్ విళియావో"*- (తిరుప్పావై.22) చిరుగజ్జె యొక్క ముఖంలాగా విరిసీ విరియని తామరవలె ఎఱ్ఱని కన్నులను కొంచెం కొంచెం తెరచి నీ చూపును మా మీద ప్రసరింపజేయవా! స్వామీ! అని గోదాదేవి యొక్క విన్నపం. కొంచెం తెరచుకొని యున్న కనురెప్పల నడుమనున్న కనీనిక (నల్లగ్రుడ్డు) ఇటు-అటు కదలుతుండగా, ఆ నల్లనివాడు, పద్మనయనమ్ములవాడు చూచే చల్లని చూపు మన పాప శాపాలను విడగొడుతుంది.

పూర్తిగా చూడకున్నా, నిండుగా చూచినా చేతనులు భరించలేరు. ఆ దివ్యదంపతుల కటాక్షం కొద్దిగా ప్రసరించినప్పుడే జీవుడు తట్టుకోగలడు.

లక్ష్మీదేవి భగవానుని కారుణ్యరూప కాబట్టి ఆమె యొక్క ఈషణ్మాత్ర కటాక్ష వీక్షణమే సకలలోక శ్రేయస్కరం కదా!

భగవానుడు ధరించిన అవతారాలు మానవరూపాలుగానే కాదు, మత్స్య కూర్మ వరాహాది తిర్యక్కులుగానూ ఉన్నవి. భగవానుని అవతారాలకు తగినట్లు

లక్ష్మీదేవి కూడా ఆయనతో సహచరించే విధంగా అనేకావతారాలను స్వేచ్ఛగా ధరించిందని శాస్త్రాలు, పురాణాలు నొక్కి చెబుతున్నాయి.

మత్స్యావతారంలో ఆయన చుట్టూ "నౌరూపధారిణే"– నావ రూపంతో పరిభ్రమించింది. కూర్మావతారమందు అమృతసారమైన సముద్ర తనయగా ఆవిర్భవించింది. వరాహావతారమందు భూదేవి రూపంగా నున్నది. నారసింహావ తారమప్పుడు చెంచులక్ష్మిగా ఉన్నది. వామనుడు బ్రహ్మచారి కాబట్టి ఆయన ఎదలో జింకచర్మంతో కప్పబడియున్నది. భార్గవరాముని అవతారమందు లక్ష్మీదేవి ధరణిగా అవతరించింది. శ్రీరామావతారాన సీతగా అవతరించి, శ్రీకృష్ణావతార మందు రుక్మిణిగా అవతరించి విశేష ఖ్యాతిని పొందినది. భగవానునికి భూనీళాది పత్నులెందఱు ఉన్ననూ లక్ష్మీదేవియే ఆయన లీలకు తగిన విధంగా– ధర్మచారిణిగా తన స్వేచ్ఛతోనే అవతరించింది. కాబట్టి, దేవీ! 'పట్టమహిషి' అని సంబోధింప బడింది.

'తుల్యవృత్తి' అన్న పదం ప్రతి అవతారమందు ఆ అవతారానికి తగిన గుణం, శీలం చెబుతున్నది. వరాహావతారమందు ఆ జాతిధర్మమైన తుంగముస్తెలను భుజించడం తుల్యవృత్తియే కదా!

'మాతః!' అని సంబోధించడంవల్ల లక్ష్మీదేవి యొక్క వాత్సల్యం వ్యక్తమవుతున్నది.

*అనుజను రనురూపాదేవి! యది నావాతరిష్యః, నాథస్య నర్మ అసరస మభవిష్యత్:* – కర్మవశంవల్ల కాకుండా, తన సంకల్పంతోనే ధరించిన భగవాముని అవతారాలకు తగిన రూపం కలదానివై నీవు అవతరించియుండకపోతే, నీ నాథుని అవతార లీలలన్నీ సరసం కానివైయుండేవి.

ఈ శ్లోకంలో ఈ వాక్యం ముఖ్యమైనది. రెండు ప్రతిషేధ వాక్యాలు (నఞ్ ద్వయం) ప్రయుక్తమైనప్పుడు ఆ మాట మనస్సున నాటుకొనే బలం కలది. అర్చావతారమందు కూడా శ్రీరంగనాథునికి అనుగుణంగా శ్రీరంగనాయకివై

శ్రీరంగధామంలో నీవు వెలసియుండకపోతే సరసం ఉండేది కాదు- అనే అర్థమూ వ్యక్తమవుతున్నది.

"అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽన పాయనీ"- (వి.పు.) ఇతర అవతారాలలో కూడా విష్ణుమూర్తిని విడిచియుండని ధర్మపత్ని లక్ష్మీదేవి- అని శ్రీ పరాశర మహర్షి సూక్తియే ప్రామాణికం.

మాలినీ వృత్తం. ' న న మ య య'- గణాలు కలది.

49. *స్ఖలిత కటకమాల్యైర్దోర్భి రబ్ధిం మురారేః*
*భగవతి! దధిమాథం మథ్నతః శ్రాంతి శాంత్యై।*
*భ్రమదమృత తరంగావర్తతః ప్రాదురాసీః*
*స్మితనయన సుధాభిః సించతీ చంద్రికేవ॥*

**అర్థం:** హే భగవతి= షడ్గుణైశ్వర్య సంపన్నురాలవైన ఓ లక్ష్మీదేవీ!; స్ఖలిత కటకమాల్యైః= తొట్రుపడిన భుజవలయాలు, పూల హారాలు కల్గిన; దోర్భిః= బాహువులతో; అబ్ధిం= పాలసముద్రాన్ని; దధిమాథం= పెరుగును చిల్కినట్లుగా; మథ్నతః= మథిస్తున్న; మురారేః= మురారియైన విష్ణువు యొక్క; శ్రాంతి శాంత్యై= అలసటను పోగొట్టడం కోసం; స్మిత నయన సుధాభిః= చిరునవ్వుతో కూడిన చూపులు అనే అమృతధారలతో; సించతీ= తడుపుతున్న; చంద్రికా, ఇవ= వెన్నెలవలె; భ్రమత్- ఆవర్తః/ భ్రమత్= తిరుగుతున్న; అమృత తరంగ= అమృతపుటలల యొక్క; ఆవర్తతః = సుడినుంచి; ప్రాదురాసీః= ఉద్భవించావు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఎక్కువ శ్రమపడుతూ పాలసముద్రాన్ని పెరుగును చిల్కినట్లుగా మథించి శ్రీమహావిష్ణువు అలసిపోయాడు. నీవు విష్ణుభగవానుని శ్రమను పోగొట్టడంకోసం అమృత తరంగాల మధ్యనుంచి, చిరునగవుతో చూపులు అనే అమృతధారలను కురిపిస్తూ, చంద్రికవలె ఆవిర్భవించావు.

**వ్యాఖ్య:** విష్ణుభగవానుని శ్రమను దీర్చడం కోసమే లక్ష్మీదేవి పాలసముద్రం నుంచి ప్రాదుర్భవించిందని ప్రస్తుతింపబడినది.

భగవానుడు జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులు అనే ఆరు గుణాలు ప్రధానంగా కలవాడు. భగవానుని అనుజను రనురూపయై లక్ష్మీదేవి కూడా షాడ్గుణ్య సంపద కల్గిన పూజ్యురాలు. కాబట్టి 'భగవతి' అని సంబోధింపబడింది.

విష్ణుభగవానుడు దేవతలకు, పూర్వ దేవతలకు ఓషధులతోపాటు మందర పర్వతాన్ని తెచ్చి, వాసుకి అనే సర్పరాజును కవ్వపుత్రాడుగా చేసి పాలసముద్రాన్ని మథించగా అమృతం ఉద్భవిస్తుందని చక్కని సలహా చెప్పినవాడే కదా! ఆది దేవుడు కాబట్టి విష్ణుమూర్తి సముద్ర మథన ప్రక్రియలో ప్రధాన పాత్రగా వ్యవహరించాడు. అది పాలసముద్రం. పెరుగును చిల్కగా వెన్నను పొందినట్లు పాలనుంచి దాని సారాన్ని పొందడానికి ఎక్కువ శ్రమపడవలసి యుంటుంది. పద్మవాసినియైన శ్రీదేవియే తనకాంతుని కాళ్లను సుతిమెత్తగా ఒత్తుతుంటే ఆయన కాళ్ళు కందిపోయేవట. అంత సౌకుమార్యం కల్గినవాడు విష్ణుమూర్తి. అందువల్ల క్షీరసముద్రాన్ని మథిస్తున్నప్పుడు విష్ణుమూర్తి యొక్క బాహు కేయూరాలు, చేతిమణికట్టులోనున్న బంగారు కంకణాలు, భుజాంతర మందలి పుష్పహారాలు జారిపోతున్నవి. కవ్వపుత్రాడును లాగడానికి బాహువుల కదలికల వల్ల ఆయాసం, అలసట కల్గిందని వ్యక్తమవుతున్నది కదా! పాలసముద్రాన్ని చిలికే భగవానుని శ్రమను పోగొట్టడానికే లక్ష్మీదేవి ప్రాదుర్భవించింది.

అవతరించిన విధమెట్టిదో ఉత్తరార్ధం తెల్పుతున్నది.

*స్మితనయన సుధాభిః సించతీ చంద్రికేవ:*- లక్ష్మీదేవి చిరునవ్వుతో కటాక్షించడం అనే అమృతధారలను కురిపిస్తూ చంద్రిక ఆవిర్భవించినట్లే పరిభ్రమించే అమృత తరంగాల సుడినుంచి ప్రాదుర్భవించింది. లక్ష్మియొక్క చిరునగవు వెన్నెలతో పోల్చబడింది. అంటే, ఆమె ముఖం చంద్రునితో సమానమైనదని అర్థం. వెన్నెల అలసటను పోగొట్టునట్లే, భగవానుని అలసటను భగవతియొక్క చిరునవ్వు పోగొడుతుంది. లక్ష్మీదేవి మరియు చంద్రుడు క్షీరాబ్ధి యొక్క అమృత తరంగాలనుంచి ఉద్భవించిన వారే కాబట్టి శ్రమను దీర్చడం ఇర్వురికి సమానమే. వెన్నెల వాకవంటి చిరునవ్వుగల లక్ష్మీదేవియొక్క చంద్రబింబం

వంటి ముఖమండలాన్ని చూడగానే విష్ణుమూర్తి బడలిక సడలిపోయింది. ఆయన పడిన శ్రమ ఫలవంతమైనది.

"సామాన్య భోగ్యమపి"- అనే 47వ శ్లోకంలో లక్ష్మీనారాయణులకు పంచాయుధాది భారాన్ని వహించడం సామాన్యమే అయినా లక్ష్మీదేవి మోయదగిన శ్రమను పోగొట్టి, వాటిని నారాయణుడే భరించాడు- అని వర్ణింపబడింది. ఈ శ్లోకమందు భగవానుని శ్రమను భగవతి పోగొట్టిన విధం తెల్పబడింది. దివ్య దంపతుల పరస్పర ప్రేమాతిశయం లోకులకు, లోకేశులకు ఎంతో ఆదర్శమైనదని సూచితం.

మాలినీ వృత్తం.

50. *మాతర్మైథిలి! రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా*
*రక్షంత్యా పవనాత్మజాల్లఘు తరారామస్య గోష్ఠీకృతా।*
*కాకంతంచ విభీషణం శరణమిత్యుక్తి క్షమౌ రక్షతః*
*సాన స్సాంద్ర మహాగసస్సుఖయతుక్షాంతి స్తవాకస్మికీ॥*

**అర్థం:** హే మాతః= ఓ తల్లీ!; మైథిలి= మిథిలాధిపతి తనయవైన ఓ జానకీదేవీ!; త్వయి= నీ విషయంలో; తదా, ఏవ= అప్పుడే; ఆర్ద్రాపరాధాః= ('ఆర్ద్ర' అంటే, తడియారనివైన) పచ్చి నేరాలను చేసిన; రాక్షసీః= రాక్షస స్త్రీలను; పవన+ఆత్మజాత్= వాయుపుత్రుడైన హనుమంతుని (బారి) నుంచి; రక్షంత్యా= కాపాడే; త్వయా= నీచేత; 'శరణం' ఇతి= 'నీవే శరణం' అని; ఉక్తి, క్షమౌ= పల్కడమందు సమర్థులైన వారు కావున; కాకం= కాకాసురుణ్ణి; తం= ఆ ప్రసిద్ధుడైన; విభీషణం= విభీషణుణ్ణి; రక్షతః= రక్షించే; రామస్య= శ్రీరాముని యొక్క; గోష్ఠీ= పరిషత్తు; లఘుతరా= చాలా చుల్కనగా; కృతా= చేయబడినది; సా= అట్టి; తవ= నీ యొక్క; ఆకస్మికీ= కారణం లేకుండా కల్గినట్టి; క్షాంతిః= ఓర్పు (సహనం); సాంద్ర, మహా+ఆగసః= చిక్కగా ఉండే గొప్ప పాపాలను కల్గియున్నట్టి; నః= మమ్ములను; సుఖయతు= సుఖింపజేయు గాత.

**తా॥** సీతామాతగా అవతరించిన ఓ లక్ష్మీదేవీ! నీ పట్ల మరువరాని అపరాధాలను చేస్తుండే రాక్షస స్త్రీలను హనుమంతుని బారినుంచి రక్షించి నిర్హేతుక జాయమాన కృపను ప్రకటించావు. తత్ఫలితంగా 'నీవే శరణం' అనే మాటను నిమిత్తంగా చేసుకొని కాకాసురుణ్ని, విభీషణుణ్ని కూడా రక్షించిన శ్రీరాముని కృపను నీ కృప కంటే తక్కువ చేసినావు. నిష్కారణంగా ప్రసరించునట్టి క్షమాశీలమైన నీ కృపను నిరంతరం మహాపరాధాలను చేస్తున్న మామీద ప్రసరింపజేసి మమ్మానందింప జేయుమని స్తోత్రం చేయబడింది.

**వ్యాఖ్య:** లక్ష్మీదేవి సీతామాతగా అవతరించి 'తల్లి ప్రేమకు కారణమేమీ ఉండ'దనే రీతిని చాటిన విషయం వర్ణితం.

మహర్షివాల్మీకి 'సీతాయాశ్చరితం మహత్"– రాముని చరిత్రకంటే సీతయొక్క చరిత్ర గొప్పది– అని 'రామాయణం' అనే గ్రంథాన్ని పేర్కొన్నాడు.

శ్లోకం 'మాతః, మైథిలి!' అనే సంబోధనతో మొదలయింది. పూర్వం సీతాదేవిగా అవతరించిన తల్లీ! అని 'రామాయణం'లోని కొన్ని విషయాలు ప్రకటింపబడినవి. త్వయారామస్య గోష్ఠీలఘుతరాకృతా– సీతాదేవి కరుణచే రాముని కరుణ తక్కువగా చేయబడినది. (రాముడు తక్కువగా చేయబడినాడు– అనలేదు.) 'శరణం' ఇత్యుక్తి క్షమౌ– శరణం– నీ వేరక్షకుడవు– అంటూ రాముణ్ని వేడుకొన్నవారు ఇద్దఱు– అని 'క్షమౌ' అనే ద్వివచనం తెల్పుతున్నది. ఆ ఇద్దఱు ఎవరు? 'కాకంతం చ విభీషణం'– కాకాసురుని శరణాగతి కంటె విభీషణుని శరణాగతి విలక్షణమైనది– ప్రసిద్ధమైనదని తెలియడం కోసం ద్వితీయా విభక్త్యేక వచనం ప్రయోగింపబడినది.

రాక్షస స్వభావంగల జయంతుడు కాకి రూపాన్ని ధరించి వచ్చి, సీతమ్మ వక్షోజమందలి మెత్తని మాంసాన్ని తినదలచి హింసించాడు. తన తొడమీద పడుకొన్న పతికి నిద్రాభంగమవుతుందని సీతమ్మ రాముణ్ని లేపకుండా ఆ బాధను ఓర్చుకొన్నది. రక్తబిందువులు రాముని మీద చిందినవి కాబట్టి లేచి, కాకిని

జూచి, అతని మీదికోపంతో గరికపోచపైన బ్రహ్మాస్త్రాన్ని అభిమంత్రించి కాకితలను ఛేదించడానికి ప్రయోగించాడు.

"*త్రీన్‌లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః*"– (రామాయణ వాక్యం) కాకాసురుడు భయపడి మూడు లోకాలలో తిరిగి తిరిగి, ఎక్కడనూ రక్షణ పొందలేనివాడై, చివరకు శ్రీరాముని సన్నిధిలోనే శరణాగతుడయ్యాడు. '*కృపయా పర్యపాలయత్*'– శ్రీరాముడు కాకిని కృపతో రక్షించెను.

'కృప' అనేది జగన్మాతయైన లక్ష్మీదేవికి వాచకం (పేరు).

"*దేవ్యాకారుణ్యరూపయా*"– మూర్తీభవించిన కరుణయే లక్ష్మీదేవి కదా! కాకాసురుడు తనను హింసించినా, అయ్యో! బ్రహ్మాస్త్రం ఆ కాకిని చంపుతుందనే భయపడుతూ, కాకిపట్ల దయాదృష్టిని ప్రసరింపజేసింది సీతమ్మ. కాబట్టి కాపాడే ఆశతో వారి వారి కాళ్ళమీద పడినంత సేపు ఆ బ్రహ్మాస్త్రం కాకిని చంపకుండా బుసలు కొడుతూ ఆగిపోతుండేది. తిరిగి తిరిగి అలసటజెంది వచ్చి రాముడున్న చోట భూమిమీద పడింది.

"*తచ్ఛిరః పాదయోస్తస్య యోజయామాస జానకీ!*
*ప్రాణ సంశయమాపన్నం దృష్ట్వా సీతాథవాయసం।*
*త్రాహి త్రాహీతి భర్తారమువాచ దయయావిభుమ్॥*" (పద్మపురాణం)

భూమిమీద పడిన కాకి తలను శ్రీరాముని పాదాలమీద చేర్చి 'రక్షించు, రక్షించు' అని సీతమ్మ భర్తను వేడుకొన్నదట.

కాకాసుర వృత్తాంతాన్ని లంకలో అశోకవనమందున్న సీతమ్మ హనుమంతునితో చెప్పింది. 'కాకాసురుణ్ని రక్షించునట్లు నేనే చేశాను' అని సీతమ్మ తన గొప్పతనాన్ని చెప్పుకోలేదు. కాబట్టి, పద్మపురాణంలో చెప్పబడిన విషయం రామాయణంలో లేదు– అని వ్యాఖ్యాతలు వెల్లడించారు.

"*విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షస చేష్టితః।*
*త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః॥*" (రామాయణం)

రాక్షస జన్మయే అయినా ధర్మస్వభావం కలవాడు విభీషణుడు. సీతాదేవిని శ్రీరామునిచెంత జేర్చుమని పలుమార్లు హితోపదేశం చేసిననూ, రావణుడు వినలేదు. పైగా "త్వాంతు ధిక్! కులపాంసనమ్"– నీవు కులాన్ని పాడుచేసే తుచ్ఛుడవు– అని గర్హించినందువల్ల విభీషణుడు పుత్రులను, భార్యను, ఆస్తులను విడిచిపెట్టి వచ్చి శ్రీరాముని శరణుపొందినాడు. "పుత్రాంశ్చ అన్నట్లు దారాంశ్చ"– అని ఉన్నది కదా! భార్యలను అని తెల్పలేదేమి? అంటే, 'దారా' శబ్దం పుంలింగమే కాక నిత్యబహు వచనమని శబ్దశాస్త్రం పేర్కొన్నది. "దారాః పుంసిచ భూమ్న్యేవ"– (నిఘంటువు.)

పగవాని తమ్ముడు కాబట్టి విభీషణుణ్ని రక్షించవద్దని సుగ్రీవుడు, వానర ప్రముఖులు వాదించారు. "యదివా రావణః స్వయం"– విభీషణుడే కాదు, స్వయంగా రావణుడు వచ్చి శరణాగతుడైతే అతనిని కూడా రక్షిస్తాను– అన్నాడు. విభీషణ శరణాగతి సందర్భంలో శరణాగతి చేసిన సర్వప్రాణులను తాను రక్షించే ప్రతిజ్ఞ చేశాడు శ్రీరాముడు.

*త్వయి తదైవార్ద్రాపరాధాః రాక్షసీః పవనాత్మజాత్ రక్షంత్యాత్వయా రామస్య గోష్ఠీ లఘుతరాకృతా*– ఈ వాక్యం సీతాదేవి అపరాధినులను రక్షించిన వృత్తాంతాన్ని తెల్పుతుంది.

రావణుని చెఱనుంచి దేవాంగనలను విడిపించడానికి సీతమ్మ లంకలో రావణుని చెఱలోనున్నది. రాక్షసస్త్రీలు సీతమ్మను రేయింబవళ్ళు భయపెడుతూ, బాధిస్తున్నారు వారితోపాటున్న త్రిజట రావణుడు పరాజితుడైనట్లు శ్రీరాముడు విజయాన్ని పొందినట్లు తన (కల) స్వప్నంలో చూచిన విషయాన్ని తోటివారికి చెప్పింది. ఆ రాక్షసస్త్రీలు స్వప్న వృత్తాంతాన్ని విని భయపడుతున్నప్పుడు సీతాదేవి *"భవేయం శరణం హివః"*– మీకు శరణం– రక్షణగా నేను ఉండగలను, భయపడకండి– అని అభయమిచ్చింది. రాక్షసాంగనలు 'కాపాడుము' అని అడుగలేదు. అడుగని వారిని కూడా రక్షింపబూనుకొన్నది. అయినా, రావణునికి భయపడి సీతమ్మను బాధపెట్టున్నారు. రావణుడు చచ్చిన తర్వాత ఆ శుభవార్తను

సీతమ్మకు తెల్పడానికి హనుమంతుడు వచ్చాడు. రావణుడు చంపబడిన సంగతి తెలియని రాక్షసస్త్రీలు ఇంకా హింసిస్తునే ఉన్నారు. హనుమంతుడు వారిని చిత్రవధ జేయడానికి సిద్ధపడగా సీతమ్మ హనుమతో "రాజసంశ్రయ వశ్యానాం"- వారు రాజాజ్ఞను పాటిస్తున్నారు, వారిలో దోషంలేదని వాదిస్తూ "కార్యం కరుణ మార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి"- ఆర్యుడవైన నీవు వారిని దయతో చూడడమే ధర్మం, తప్పుజేయనివాడెవడూ లేదు- అని హితోపదేశం చేసింది.

క్షాంతిస్తవాకస్మికీ:- శరణాగతులనే రక్షించే దయను కల్గినవాడు శ్రీరాముడు. ("గోష్ఠి"- అంటే రక్షించే విషయాన్ని చర్చించే సభ.) తనను హింసించేవారిని కూడా రక్షించే దయామయి సీతాదేవి. కాబట్టి, భగవతి యొక్క క్షమాగుణానికి సహనానికి వెదకినా కారణమే కనబడదు. అట్టి అవ్యాజమైన దేవియొక్క కృప (ఓర్పునకు కారణం దయ కల్గియుండడం. ఇక ఆమె దయకు మాత్రం కారణం తెలియరాదు) ఎల్లప్పుడూ మహాపరాధాలను చేస్తున్న మనను సుఖంగా ఉంచి ఆనందింపజేయుగాక.

శార్దూల వృత్తం.

*51.* మాతర్లక్ష్మి! యథైవ మైథిలజనస్తేనాధ్వనా తేవయం
త్వద్దాస్యైక రసాభిమాన సుభగైర్భావైరిహాముత్ర చ।
జామాతాదయితస్తవేతి భవతీ సంబంధ దృష్ట్యాహరిం
పశ్యేమ ప్రతియామ యామచ పరీచారాన్ ప్రహృష్యేమచ॥

**అర్థం:** హేమాతః= ఓ తల్లీ!; లక్ష్మి= సీతా స్వరూపిణివైన ఓ లక్ష్మీదేవీ!; తే= నీకు; మైథిలజనః= మిథిలా నగరంలోని జనం; యథా, ఏవ= ఎట్లో; తేన= అటువంటి; అధ్వనా= మార్గంచేత; వయం= మేము; త్వద్దాస్యైక-సుభగైః/ త్వత్= నీ యొక్క; దాస్య= దాస్యమందలి; ఏక= అద్వితీయమైన; రస+అభిమాన= ప్రీతి, అభిమానాలచేత; సుభగైః= సొంపైన; భావైః= ఆశయాలతో; ఇహ= ఇక్కడ- ఈ లోకమందు; అముత్ర, చ= అక్కడ (వైకుంఠమందు); జామాతా= అల్లుడు; తవ= నీకు; దయితః= ప్రియుడు;

ఇతి= అని; భవతీ సంబంధ దృష్ట్యా= నీతో సంబంధమున్నవాడు అనే దృష్టిచేత; హరిం= హరిని; పశ్యేమ= దర్శిస్తాం; ప్రతియామ= శరణుపొందుతాం; పరీచారాన్= కైంకర్యాలను; యామ= చేస్తాం; చ= మఱియు; ప్రహృష్యేమ= ఆనందిస్తాము.

**తా॥** ఓ తల్లీ! ఓ లక్ష్మీదేవీ! నీవు సీతాదేవిగా అవతరించినప్పుడు నీకు మిథిలానగర వాసులైన జనులెట్టివారో మేము కూడా ఆ పద్ధతిచేతనే నీ జనులమే. నీ సంబంధాన్ని బట్టి, హరిని (రాముణ్ని), అల్లుడనియు, నీకు భర్త అనియు, ఇక్కడ అంటే ఈ లీలా విభూతిలోనూ, అక్కడ అంటే పరమపదం (నిత్యవిభూతి)లోనూ దర్శిస్తాము, శరణు పొందుతాము, కైంకర్యం చేస్తాం, శ్రియః పతి యొక్క ఆనందాన్ని చూస్తూ, ఆనందిస్తాము.

**వ్యాఖ్య:** ఓ జననీ! సీతమ్మగా నున్నప్పుడు ఆమె సంబంధాన్నిబట్టి మిథిలా నగరమందలి జనులు శ్రీరాముని యందు ఆదరాభిమానాలు కలిగియున్నట్లే, శ్రీదేవిని పురస్కరించుకొని శ్రియఃపతిని అట్లే మేము సేవిస్తామని సుశ్లోకితం.

సీతామాత మిథిలానగర జనులను స్వజనంగా స్వీకరించినట్లే, విష్ణుపత్ని యైన లక్ష్మీదేవి మనను అట్లే స్వజనంగా చూడవలెనని ప్రార్థింపబడుతున్నది. శ్రీరాముని విషయంలో లీలా విభూతియు (ఈ లోకం) శ్రీరంగనాథుని విషయంలో నిత్యవిభూతి (వైకుంఠమూ) యు చెప్పబడినది.

*త్వద్దాస్యైక రసాభిమాన సుభగైః భావైః ఇహ, అముత్రచ:* – సీతాదేవికి కైంకర్యం చేసిన యెడల, సీతాదేవి సంబంధం ఉన్నచోట కైంకర్యం చేసిననూ, సీతాదేవికి చేసినట్లే ఉండగలదనే విశ్వాసం మిథిలానగర జనులకుండినది. జనక మహారాజుకు అల్లుడని, సీతాపతి యని మిథిలానగర వాసులు శ్రీరాముని సేవించి నందున, సీతాదేవిని సేవించినట్లే భావించి ఆనందించారు. అట్లే, విష్ణుచిత్తుల వారి జామాత యని, గోదాదేవి భర్తయని శ్రీరంగనాథునికి సర్వవిధ కైంకర్యం చేసినా గోదాదేవికి కైంకర్యం చేసినట్లే కాగలదు. కాబట్టి, లక్ష్మీదేవి సంబంధాన్ని పురస్కరించుకొని లక్ష్మీనాథుని సేవిస్తాము; శరణు పొందుతాము. పరిచర్యలను చేస్తాము, స్వామి ఆనందాన్ని జూచి ఆనందిస్తాము.

అంతఃపురానికి సంబంధించిన జనులు నేరం చేసినా, ఆ నేరాన్ని ఏదో నెపంతో రాజులు క్షమించినట్లే, మనం శ్రీదేవి సంబంధం కలవారమైనందువల్ల మన అపరాధాలను శ్రియఃపతి క్షమిస్తాడని సారార్థమన్నారు శ్రీ వేదాంత దేశికులు.

'ఆలివంకవారు ఆత్మబంధువులు' అని భావించి మా దోషాలను చూడకుండా, చూచినా క్షమించునట్లు, నీ సంబంధాన్ని పురస్కరించుకొనియే ఒకే కాలాన చతుర్విధ పురుషార్థాలను పొందునట్లు శ్రియఃపతిని పశ్యేమ= దర్శనం చేసుకొంటాము. ఇది ధర్మం. ప్రతియామ= శరణుపొందుతాము. ఇది ప్రయోజనం (అర్థం). పరీచారాన్, యామ, చ= కింకర వృత్తులను చేస్తాము కూడా. ఇది కామ పురుషార్థం- కోరిక, ప్రహృష్యేమ= శ్రీపతియొక్క ఆనందాన్ని జూస్తూ మేము బ్రహ్మానందాన్ని అనుభవిస్తాము. ఇదే మోక్షం.

శార్దూల వృత్తం.

52. *పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే*
*హితస్రోతో వృత్త్యాభవతిచ కదాచిత్ కలుషధీః।*
*కిమేత న్నిర్దోషః క ఇహజగతీతి త్వముచితై*
*రుపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః॥*

**అర్థం:** హే జనని= ఓ మాతా!; త్వత్, ప్రేయాన్= నీ ప్రియుడైన భగవానుడు; పరిపూర్ణ+ఆగసి= నిండుగా నేరాలు చేసినట్టి; జనే= వ్యక్తి విషయంలో; పితా, ఇవ= తండ్రివలె; హితస్రోతో వృత్త్యా= హితపరంపరలో ప్రవర్తించడంచేత; కదాచిత్= ఎప్పుడయినా; కలుషధీః= కాలుష్యా (కోపా)న్ని పొందిన మనస్సు కలవాడు; భవతి, చ= అవుతున్నాడు కూడా (అప్పుడు); ఏతత్ కిమ్= ఇదేమిటి (ఈ కోపమెందుకు?); ఇహ= ఈ; జగతి= ప్రపంచమందు; నిర్దోషః= దోషంలేనివాడు; కః= ఎవడు?; ఇతి= అని; త్వం= నీవు; ఉచితైః= తగిన; ఉపాయైః= ఉపాయాలతో; విస్మార్య= (దోషాలను చూచిన అతని కోపాన్ని) మఱపింపజేసి; స్వజనయసి= తన సంతానంగా మనలను భావించునట్లు చేస్తున్నావు; తత్= అందువల్ల; నః= మాకు; మాతా= తల్లివై ఉన్నావు.

**తా॥** ఓ జననీ! నీవు తల్లివి. భగవానుడు జగత్తునకు తండ్రి. నిత్యం ఎడతెగకుండా నేరాలు చేసే మాకు హితం చెప్పే సందర్భంలో, అప్పుడప్పుడు కోపాన్ని ప్రదర్శిస్తాడు. దండించడానికి కూడా ప్రవర్తిస్తాడు. అప్పుడు నీవు ఏమండి? మీకీ కోపం ఎందుకండి? లోకంలో తప్పు చేయని మనిషి ఉన్నాడా? అని ఇంక 'ఏవో అనునయ వాక్యాలతోనూ, ఓర చూపుల'తోనో భగవానుని కోపాన్ని శాంతింప జేస్తుంటావు. నీతోపాటు వారికి కూడా మమ్ములను స్వజనులనుగా జేసి తీరుతావు. కాబట్టి, మాకు తల్లివై యున్నావు.

**వ్యాఖ్య:** పురుషకారంవల్ల భగవానుని నిగ్రహాన్ని నివారింపజేస్తున్న లక్ష్మీదేవి జగజ్జననియై చేతనుల పట్ల వాత్సల్యం కలదని సుశ్లోకితం.

భగవానుడైన నారాయణుని యొక్క శ్రీపాదద్వయంలో కైంకర్యం చేయడమే కర్తవ్యంగా కల్గిన జీవునికి లక్ష్మీదేవిని పురుషకారంగా పురస్కరించుకోవడం ఆవశ్యకమా? అని సందేహించేవారికి చెప్పదగిన అంశాలు ఈ శ్లోకంలో తెల్పబడుతున్నాయి.

నారాయణుడు లోకానికి తండ్రి. లక్ష్మీదేవి లోకానికి తల్లి. తండ్రి హితపరుడు. హితం తాత్కాలికంగా కష్టమనిపిస్తుంది, చివరకు మేలును చేస్తుంది. "*అప్రియస్య చపథ్యస్యవక్తా శ్రోతాచ దుర్లభః*"– ఇష్టంకానట్టి, మేలును కలిగించే మాటను చెప్పునట్టి వ్యక్తి, వినే వ్యక్తి కూడా దుర్లభుడే– అనియు, "*హితం మనోహారిచ దుర్లభం వచః*"– హితమైనది, మనస్సుకు నచ్చునదైన మాట దుర్లభమనే వాక్యాలు హితం యొక్క విశిష్టతను వ్యక్తం చేస్తున్నాయి.

నారాయణుని హృదయం చాలా చల్లనిది. శీతకరుడైన చంద్రునికి పుట్టినిల్లు. "*చంద్రమామనసో జాతః*"– అని శ్రుతి పల్కుతుంది. అయినా పరిపాలన చేయునప్పుడు హితాన్ని దృష్టియందుంచుకొని, ఈ లోకంలో జీవులు చేసిన మహాపరాధాలను సహించలేక 'నక్షమామి' (క్షమించను). అప్పుడప్పుడు 'క్షిపామి'– (నరకంలోకి త్రోసి వేస్తాను) అంటూ కోపంతో దండించడానికి ప్రవర్తిస్తాడు.

*"తన్దమ్ మక్కళ్ అఱుదు శెన్హాల్ తాయ్ మారావాల్ తరిక్కకిల్లార్"*- (పెరియా. 2-2-3) తమ బిడ్డలు ఏడిస్తే తల్లులు భరించలేరు. *"పెత్త మనమ్బిత్తు"*- కన్నతల్లి మనస్సు పిచ్చిది. హితపరత్వంగా కల్గిన సర్వేశ్వరుని కోపాన్ని దీర్చడానికి భగవతి లక్ష్మీదేవి యొక్క పురుషకారం అవశ్యంగా అపేక్షితం.

లక్ష్మీదేవి భగవానుని కోపాన్ని దీర్చే విధానం ఎలా ఉంటుందో తెల్పబడు తున్నది.

*ప్రేయాన్*- భార్యకు ఇష్టమైనవాడు. భార్య అంటే ఇష్టపడేవాడు.

*పరిపూర్ణ ఆగసిజనే:*- భగవానుడు, నిండుగా అంటే మితిమీరిన పాపాలు- దోషాలు చేసిన వారిని సహించక కోపగించునని, నూరు తప్పులు చేసిన తర్వాతనే శిశుపాలునికి శిక్షపడిన విషయం స్పష్టమే కదా! స్వల్పమైన దోషాలను చూచి చూడనట్లుంటాడనీ తెల్పే పదమిది.

*హితస్రోతో, వృత్త్యా*- సోత్రస్సు అంటే ప్రవాహం. జీవనది ఎప్పుడూ ఎండిపోదు కదా! నారాయణుడు హితం అనే జీవనదిని ప్రవహింపజేసే వృత్తి కలవాడే అయినా జగత్పాలన చేసే సందర్భాన అనంత దోషాలను చేసిన జీవునిపై నిగ్రహింపక మానడు. అప్పుడు జగన్మాత ఏమి చేస్తుంది? అంటే-

*కిమేతత్? ఇహజగతి నిర్దోషఃకః*- మీ కోపానికి కారణమేమిటి? అని అడుగుతుంది. అతడు అసంఖ్యాకంగా జేసిన అపరాధాలు నీకు తెలియవా? అంటాడు భగవానుడు.

ఈ లోకమందు అపరాధం చేయనివాడెవడు? మీరు ఈ చేతనుని అపరాధాలను లెక్కపెట్టి, ఇతణ్ణి పక్కకు గెంటివేస్తే, ఇతనికి వేరేగతి యేమున్నది?

*"ఉఱవేల్ నమక్కు ఇంగు ఒఴిక్క ఒఴియాదు"*- (తిరుప్పావై) మనకు ఇతనికి మధ్యగల సంబంధాన్ని లేకుండా చేసుకోవడానికి మనకు సాధ్యం కానిది. మీ సొత్తు అయిన ఇతణ్ణి పొందడం స్వామి అయిన మీకే ప్రయోజనం కదా!

రక్షణను అపేక్షించి వచ్చిన ఈ చేతనుణ్ని రక్షించకుంటే మీ సర్వ రక్షకత్వం జీవిస్తుందా? అని లక్ష్మీదేవి వాదిస్తుంది.

నా ఆజ్ఞను ఉల్లంఘించి, నా కోపానికి గురియైన జీవుని దోషాలకు తగినట్లు దండించకుండా సహించిన వాడనయితే శాస్త్ర మర్యాద నశించదా? అపరాధిని శిక్షించకపోతే శాస్త్రమర్యాద నశిస్తుంది. రక్షించకపోతే దయ మొదలైన గుణాలు జీవించవు. ఏమి చేయాలి? అని ఆలోచనా మగ్నుడైన భగవానునికి ఉపాయాన్ని చెబుతుంది. అపరిమిత దోషాలను చేసి, మీ దగ్గఱికి రాకుండా విముఖులైనవారిని- "న నమేయం కదాచన"- ఎప్పుడూ నేను తలవంచను- అనే వారిని దండించండి. అనుతాపాన్ని పొంది, మీ వద్దకు వచ్చినవారి మీద కరుణాది గుణాలను ప్రవహింపజేస్తే శాస్త్రమర్యాద మఱియు కారుణ్యాది గుణగణమూ- రెండు జీవిస్తాయి- అని లక్ష్మి అంటుంది.

స్వతంత్రుడైన స్వామి అంగీకరించవచ్చు లేదా నీ పని ఇదే కదా! అని ఆమె ఉపదేశాన్ని పాటించకను ఉండవచ్చును.

*"అల్లిమలర్ పోగ మయక్కుక్కళ్ ఆగియుం నిఱ్కుమమ్మాన్"*- పద్మవాసినియైన లక్ష్మీదేవి యొక్క భోగంలో వ్యాముగ్ధుడు సర్వేశ్వరుడు కాబట్టి 'అంచితైః ఉపాయైః విస్మార్య స్వజనయసి'- లక్ష్మీదేవి సమయానుకూలంగా సంభాషించడం, పరిచర్యలు చేయడం, స్వామిని వశపరచుకోవడానికి కన్నులను త్రిప్పడం, ఒయ్యారంగా చూడడం, అలకపాన్పు జేరడం, మౌనం వహించడం ఇత్యాది శృంగార లీలలను చేసి, తన అందంతో తాను చెప్పిన రీతిగా చేస్తే తప్పు నిలువలేనివానిగా జేసి, దోషులను దండించవలెననే స్వామి ఆలోచనను మరపింప జేస్తుంది. తన దరిజేరిన జీవులను భగవానుడు తన సంతానంగా అభిమానించునట్లు చేయడమే లక్ష్మీదేవియొక్క వాత్సల్యం, పురుషకారత్వం.

మాతా తదసినః- అందుకే మనకు తల్లియై యున్నది లక్ష్మీదేవి. శ్రీ పరాశర భట్టర్ పల్కిన ప్రతిమాట చాలా రసఘనమైనది కదా!

శిఖరిణీ వృత్తం.

*53. నేతుర్నిత్య సహాయినీ జనని! నస్త్రాతుంత్వ మత్రాగతా*
*లోకేత్వన్మహిమావబోధ బధిరే ప్రాప్తావిమర్దం బహు।*
*క్లిష్టం గ్రావసుమాలతీ మృదుపదం విశ్లిష్య వాసోపనే*
*జాతోధిక్కరుణాం ధిగస్తు యువయోః స్వాతంత్ర్య మత్యం కుశమ్॥*

**అర్థం:** హే జనని= ఓ మాతా! లక్ష్మీదేవీ!; త్వం= నీవు; నేతుః= జగత్తుకు నాయకుడైన నారాయణునికి; నిత్య సహయినీ= అన్ని అవతారాలలోనూ తోడుగానున్న దానవై; నః= మమ్ములను; త్రాతుం= రక్షించడానికి; త్వన్మహిమావ బోధ బధిరే/ త్వత్= నీ యొక్క; మహిమ= మాహాత్మ్యాన్ని; అవబోధ= తెలుసుకోవడంలో; బధిరే= చెవిటిదైన; అత్ర, లోకే= ఈ లోకంలో; ఆగతా= అవతరించినదానవై; బహు= చాలా; విమర్దం= శ్రమను; ప్రాప్తా= పొందినావు; మాలతీ మృదు= సన్నజాజి పూలవలె మెత్తనైన; పదం= పాదద్వయం; గ్రావసు= రాళ్ళయందు; క్లిష్టం= (క్లేశం) కష్టపెట్టబడింది; వనే= అడవియందు; విశ్లిష్య= (నాథుని) ఎడబాసి; వాసః= లంకా నగరవాసం; జాతః= సంభవించింది; యువయోః= మీ ఇద్దఱి యొక్క; కరుణాం= దయను గూర్చి; ధిక్= ధిక్కారం; అతి అంకుశం= అడ్డులేని; స్వాతంత్ర్యం= మీ స్వాతంత్ర్యానికి; ధిక్ అస్తు= నింద అగుగాత.

**తా॥** జగజ్జననివైన ఓ లక్ష్మీదేవీ! భగవానుని అవతారాలన్నిటిలోనూ తోడు నీడగా నీవు అవతరించావు. అవతార కార్యక్రమం మీరు స్వయంగా కల్పించుకొన్నదే కాని కర్మాధీనమైనది కాదు. ప్రతి అవతారంలోనూ మమ్ములను కాపాడడానికే అవతరించిన నీ మహిమను ఈ లోకం తెలుసుకోలేకపోయింది. మీరు అవతరించి చాలా శ్రమపడినారన్న విషయాన్ని ఎవరయినా చెప్పినా ఈ లోకానికి పుట్టెడు చెవుడున్నది- అని 'బధిర' శబ్దంతో తెలుసుకోజాలనిది- అని వివరింపబడింది.

లోకంలో అవతరించి ఏమి చేశావు?

ప్రాప్తావిమర్దం బహు- కర్మవశ్యులైన సంసారులు కూడా పడని కష్టాలు పడ్డావు.

"నాట్టిల్ పిఱన్దు పడాదన పట్టు మనిశర్కాయ్"– కేవలం కృపతో నీవు ఈ లోకంలో అవతరించి మానవుల కోసం పడరాని పాట్లు పడినావు.

సన్నజాజిపూవుల వలె మృదువైన నీ పాదాలు కఠినమైన వేడి రాళ్ళ మీద సంచరించి క్లేశాన్ని పొందినాయి.

*విశ్లిష్యవనే వాసోజాతః*– అరణ్యంలో నీ నాథుని ఎడబాసి, పదినెలలు లంకానగరాన అశోకవనంలో "స్వగణేన మృగీం హీనాం శ్వగణేనా వృతామివ"– తన మందనుంచి దూరమైన, వేటకుక్కల నడుమ చిక్కుకొన్న, లేడివలె ఏడువందల మంది రాక్షస స్త్రీల మధ్య చాలా శ్రమను పొందినావు కదమ్మా!

*యువయోః కరుణాంధిక్ అస్తుస్వాతంత్ర్య మత్స్యంకుశమ్:*– ఇదంతా మీ యిద్దఱి అపార కరుణకు, నిరంకుశ స్వాతంత్ర్యానికి నిదర్శనాలు. భగవానునికి స్వతంత్ర భావం అధికం. లక్ష్మికి కారుణ్యం అపారం. తన సంతానాన్ని రక్షించడంలో మాతా పితరులకు స్వాతంత్ర్యం, కారుణ్యం సమానమే. కాబట్టి మొదట 'జనని' అని లక్ష్మీదేవి నొకర్తెను సంబోధించిననూ, 'యువయోః' అని చివరకు ఇద్దఱిని గూర్చి కవి పల్కడం గమనార్హం. తాత్పర్యం సుస్పష్టం.

ఇక్కడ కరుణా స్వాతంత్ర్యాలను నిందించడం ప్రధానం కాదు. శ్రీరామావతారంలో దివ్యదపంతులు అనుభవించిన కష్టాలను జనులు తెలుసుకొనలేక పోయిరనే బాధ ప్రధానం. కరుణలేని వ్యక్తికి గల స్వాతంత్ర్యం చెడుపును చేస్తుంది. స్వాతంత్ర్యంలేని వ్యక్తికి కలిగిన కరుణవల్ల ఇతరులకు ఉపయోగముండదు కదా!

కరుణ, స్వాతంత్ర్యం అనే రెండింటిని కల్గియుండి చేతనోజ్జీవనార్థం అవతరించిన మీ మహిమను గుర్తించని ఈ లోకంలో ఇకపైన మీరు అవతరించ నక్కఱలేదు– అని దివ్యమంగళ విగ్రహాలయందున్న తన ప్రేమాతిశయాన్ని గ్రంథకర్త వ్యక్తపరచినాడు.

శార్దూల వృత్తం.

54. *అధి శయితవానబ్ధిం నాథో మమన్థ బబన్ధతం*
*హరధనురసౌ వల్లీభంజం బభంజచ మైథిలి।*
*అపిదశముఖీం లూత్వా రక్షః కబంధ మనర్త యత్*
*కిమివ న పతిః కర్తాత్వచ్చాటు చుంచు మనోరథః॥*

**అర్థం:** హే మైథిలి!= ఓ జానకీ!; అసౌ= ఈ; నాథః= నీ నాథుడు; త్వత్+చాటు చుంచు మనోరథః= నీకు ప్రియాన్ని కలిగించడమందు కోరిక కలవాడై; అబ్ధిం= సముద్రమందు; అధిశయితవాన్= శయనించాడు; తం= ఆ సముద్రాన్నే; మమంథ= చిలికాడు; బబంధ= (సేతువుతో) బంధించాడు; హరధనుః= శివధనుస్సును; వల్లీ భంజం= తీగను త్రుంచినట్లు; బభంజ, చ= అవలీలగా విరచివేశాడు కూడా; దశముఖీం= (రావణుని) పదితలల సమూహాన్ని; లూత్వా= ఖండించి; రక్షః కబంధం= ఆ రాక్షసుని మొండెంను; అనర్తయత్, అపి= (యుద్ధరంగమందు) ఆడిచాడు కూడా (అందువల్ల); పతిః= నీ భర్త; కిమ్, ఇవ= ఏ కార్యాన్ని; న, కర్తా= చేయడు; (నీ కోసం దేనినైనా చేస్తాడు).

**తా॥** మిథిలాధిపతియైన జనకరాజపుత్రికా! సీతాదేవీ! నీకు ఇష్టమైన కార్యాన్ని చేయాలనే కోరికతోనే నీ భర్త శ్రీరాముడు పాలసముద్రమందు శయనించాడు. నీ కోసమే ఆ సముద్రాన్ని మథించాడు. బంధించాడు కూడా. శివధనుస్సును తీగను త్రుంచినట్లే భగ్నమూ చేశాడు. రావణుని పదితలలను నఱికి, అతని మొండెంను రణరంగమందు ఆడించాడు. అంతేకాదు, ఏ కార్యమైనను నీ కోసం ప్రీతితో చేయగలడు.

**వ్యాఖ్య:** ఆశ్రిత జనులను రక్షించడంకోసం భర్తను తన అధీనంలో కల్గి ఉండడం అవశ్యాపేక్షితమని సుశ్లోకితం.

హే మైథిలి– సీతాదేవిగా అవతరించిన ఓ లక్ష్మీదేవీ!

త్వచ్చాటు చుంచు మనోరథః– నీవు స్వాధీనపతికవు. కాబట్టి, నీ వల్లభుడు నీకు ఎల్లప్పుడు ప్రియమైన కార్యాన్ని చేయాలనే కోరుతుంటాడు.

*అబ్ధిం శయితవాన్*– నీ పుట్టినిల్లైన పాలకడలిని విడిచి పోలేక, అలలతో ఊయల లూగుతున్న సముద్రజలంలో శ్రీ మహావిష్ణువు శయనించాడు.

*తం మమంథ*– తన శయనస్థానమని గమనించకుండా, నిన్ను పొందడం కోసమే గంభీర సముద్రంలో మందరాన్ని కవ్వంగా నిల్పి, వాసుకిని త్రాడుగా చుట్టి చిలికినాడు.

*బబంధ*– నీ పట్ల ఉన్న వ్యామోహంచేతనే కదా శ్రీరాముడు కొండలతో సముద్రానికి ఆనకట్టను కట్టాడు.

*హరధనుః వల్లీభంజం బభంజ చ*– నీ కోసమే కదా వీర్యశుల్కంగా ఏర్పఱచిన శివుని ధనుస్సును అవలీలగా ఎక్కుపెట్టి విరచి, తన పరాక్రమాన్ని ప్రదర్శించాడు.

*దశముఖీం లూత్వా రక్షః కబంధ మనర్తయత్*– దశకంఠుని కంఠదశకాన్ని లుంఠనం చేయగా, చేయగా, అవి మాటికి మాటికి మొలిచినప్పుడు, చివరకు ఖండించి ఆ రాక్షసుని శరీరం– మొండెం– రణరంగమందు నాట్యమాడునట్లు చేశాడు.

*ప్రాణేభ్యోఽపి గరీయసివి*– తన ప్రాణాల కంటెను ఎక్కువ ప్రియమైన దానవు– అని తలచే నీ భర్త నీ కోసం ఏదైనా చేయగలడు.

*"యది రామః సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్।*
*అస్యాఃకృతే జగచ్చాపి యుక్తమిత్యేవ మేమతిః॥"* (సుం.కాం. 16–13)

శ్రీరాముడు సీతమ్మకోసం సముద్రం వరకు వ్యాపించిన భూమినే కాదు జగత్తునంతనూ తలక్రిందులుగా చేసినా తగినదే అని నా అభిప్రాయం– అని మొదట సమర్థించిన వాడు హనుమంతుడే.

హరిణీవృత్తం– న స మ ర స ల గ– గణాలు కలది.

55. *దశ శత పాణి పాదవదనాక్షి ముఖై రఖిలైః*
*అపినిజ వైశ్వరూప్య విభవై రనురూప గుణైః।*
*అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే*
*క్వచన హి విభ్రమ భ్రమిముఖే వినిమజ్జతితే॥*

**అర్థం:** హే కమలే= ఓ లక్ష్మీదేవీ!; కమితా= నీ ప్రియుడు; దశశత–ముఖైః/ దశశత= వేల సంఖ్యలోనున్న; పాణి= చేతులు; పాద= చరణాలు; వదన= ముఖాలు, అక్షి= కన్నులు; ముఖైః= మొదలైన; అఖిలైః= సమస్తమైన; (ఏ కొఱతలేని); అనురూప గుణైః= తగిన కల్యాణ గుణాలు కల్గినదైన; నిజవైశ్యరూప్య విభవైః, అపి= నిత్యమైనవి, స్వకీయాలైన విశ్వరూప వైభవాలతో కూడా; అతైః= వాటికంటే వేరైన; అవతరణైః, చ= అవతరాలతో కూడా (నిన్ను); రసయన్= ఆనందింపజేస్తున్న వాడై; తే= నీ యొక్క; విభ్రమభ్రమి ముఖే= విలాసాలు అనే సుడిగుండం ద్వారంలో; క్వచన= ఎక్కడనో; (సముద్రంలో జలబిందువువలె) వినిమజ్జతి, హి= పూర్తిగా మునిగి పోతున్నాడు కదా!

**తా॥** ఓ లక్ష్మీదేవీ! నీ వల్లభుడైన విష్ణుమూర్తికి చేతులు, కాళ్ళు, ముఖాలు, కన్నులు వేల సంఖ్యలో నున్ననూ, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణాది విభవావతారాలలో నిన్ను అనుసరిస్తున్నప్పటికీ, విశ్వరూపాన్ని ధరించియున్న నీ విలాస విభ్రమ సింధువుముందు ఆయన బిందువులాగా నిల్వలేకపోతున్నాడు. నీవు విష్ణుమూర్తియొక్క విశ్వరూపాన్ని కూడా మించిన విశ్వరూప వైభవం కలదానవు.

**వ్యాఖ్య:** భగవానుని అన్నివిధాలైన ఉపభోగ సామర్థ్యం కూడా లక్ష్మీదేవి యొక్క విలాస విన్యాసాల సుడిగుండంలో నొకచోట మునిగిపోతున్నదని వర్ణింప బడుతున్నది.

లక్ష్మీనారాయణులిద్దఱి అవయవ సౌభాగ్యం, అవతార వైభవం వర్ణింపబడుతున్ననూ, లక్ష్మీదేవి యొక్క విశ్వరూప వైభవం నిత్యనూతనమై విస్మయాన్ని కల్గిస్తున్నదని అగ్గలంగా ఉగ్గడింపబడుతున్నది.

ఇంతకుముందు 4వ శ్లోకంలో "భోగోపోద్ఘాత కేళీ చుళుకిత భగవద్వైశ్వ రూప్యానుభావా"- అన్న మాటను ఈ శ్లోకం వివరిస్తున్నది.

*నిజవైశ్వరూప్య విభవాలు లక్ష్మీనారాయణులిద్దఱికి స్వాభావికమైనవే- నిజం నిత్యేస్వకే త్రిషు*"- (అమరం) విశ్వరూపానికి సంబంధించిన గుణాలు నిత్యమైనవీ. తమవే, కాని తెచ్చిపెట్టుకొన్నవి కావని అర్థం.

"*సహస్ర శీర్షాపురుషః, సహస్రాక్షః సహస్రపాత్*"- "*నమోఽస్త్వ నంతాయ సహస్ర మూర్తయే, సహస్ర పాదాక్షి శిరోరుబాహవే*"- అని శ్రుతి స్మృతులు చెప్పిన విధంగా, పాణి, పాద, వదనాక్షి ముఖాలు వేల సంఖ్యలో కల్గి నారాయణుడు విశ్వవ్యాప్తమైన తత్త్వం కలవాడు. విశ్వరూపం కంటే భిన్నమైన రామకృష్ణాద్యవ తారాలను ధరించినవాడు.

"*దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషీ*
*విష్ణోర్దేహాను రూపాంవై కరోత్యేషాఽత్మ నస్తనుమ్॥*" (వి.పు.)

విష్ణుమూర్తి దివ్యరూపంలో ఉన్నప్పుడు లక్ష్మీదేవి దేవశరీరాన్ని, ఆయన మనుష్యత్వాన్ని పొందినప్పుడు ఆమె మానుష దేహాన్ని ధరించింది. లక్ష్మీదేవి విష్ణువు యొక్క దేహానికి అనురూపంగా తాను రూపాన్ని ధరిస్తుంది- అని శ్రీ పరాశర మహర్షి సూక్తి.

"*స్వవైశ్యరూప్యేణ సదాను భూతయా*
*ప్య పూర్వవత్ విస్మయ మాద ధానయా॥*" (స్తో.ర. 38)

విష్ణుమూర్తి విశ్వరూపునిగా ఉన్నప్పుడు లక్ష్మీదేవి విశ్వరూపిణిగానూ, ఆయన ఎట్లు ప్రవర్తించినా ఆమె దానికి అనుగుణంగా రూపాన్ని ధరిస్తూ, నిత్య నూతనంగా ప్రకాశిస్తూ, ఆశ్చర్య జనకంగా ఉంటుంది- అని యామునాచార్యుల శ్రీసూక్తి.

(అతైః- తచ్ఛబ్దంమీద నఞ్ చేరిన రూపమిది. తద్భిన్నైః- వాటికంటే వేరైనట్టి- అని అర్థం).

విష్ణుభగవానుడు విశ్వరూపంతోనూ, అంతకంటే వేరైన వ్యూహ, విభవావతారాలతోనూ లక్ష్మీదేవిని అనుసరిస్తున్నప్పటికీ, ఆమె యొక్క విలాస చేష్టితాలు అనే సుడిగుండంలో– సముద్రంలోని నీటికణం వలె ఒకచోట మునిగి పోతున్నాడు. భగవానుని అంతటి వైభవం కూడా భగవతి లక్ష్మీవైభవం కంటే తక్కువైనదే. 'కమలే' అని సంబోధింపబడిన పదం సాభిప్రాయం.

'సహస్ర పత్రం కమలం' (అమరం). వేయి రేకులు కలది కమలం. ఇందు దివ్యదంపతుల అవయవ సౌందర్యం కమలంతో పోల్చబడినది. పైగా, పాణిపాదాద్యవయవాల యందలి వేయి సంఖ్య పూరేకుల వేయి సంఖ్యచేత సూచితం.

న జ భ జ జ ల గ– గణాలు కల్గిన 'నర్కుటక వృత్తం'.

56. *జనన భవన ప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే*
*జనని దయిత ప్రేమ్ణా పుష్ణాసి తత్పరమం పదమ్।*
*ఉదధి పరమ వ్యోమ్నోః విస్మృత్య మాదృశ రక్షణ*
*క్షమమితి ధియా భూయ శ్రీరంగధామని మోదసే॥*

**అర్థం:** హే జనని!= ఓ లోకమాతా! లక్ష్మీదేవీ!; జనన భవన ప్రీత్యా= పుట్టింటి యందలి ప్రీతితో; దుగ్ధ+అర్ణవం= పాలసముద్రాన్ని; బహుమన్యసే= గొప్పగా భావిస్తున్నావు; తత్= ప్రసిద్ధమైన ఆ; పరమం పదం= వైకుంఠాన్ని; దయిత ప్రేమ్ణా= భర్తయందలి ప్రేమతో; పుష్ణాసి= పోషిస్తున్నావు; ఉదధి, పరమ వ్యోమ్నోః= పాలకడలిని, వైకుంఠాన్ని (రెండింటిని); విస్మృత్య= మరచి; మాదృశ రక్షణ క్షమం, ఇతి= మావంటి వారిని రక్షించడానికి యోగ్యమైనది అనే; ధియా= బుద్ధితో; భూయః= మళ్ళీ; శ్రీరంగధామని= శ్రీరంగ క్షేత్రమందు; మోదసే= సంతోషంతో ఉన్నావు.

**తా॥** ఓ తల్లీ! పుట్టినిల్లని పాలసముద్రాన్ని, మెట్టినిల్లని వైకుంఠాన్ని అభిమానించి గౌరవిస్తున్నావు. అయినా, ఆ రెండింటిని మరచిపోయి శ్రీరంగ క్షేత్రమందు అధిక ప్రేమతో వేంచేసి యున్నావు. ఎందుకు? కారణం ఉన్నది.

ఊరూ, పేరూ శ్రీరంగమే. పుట్టినింట అభిమానమూ, మెట్టినింట గౌరవమూ ఉన్నప్పటికీ, ఆ రెండింటికంటే తల్లికి తన సంతానం మీద నున్న ప్రేమ చాలా గొప్పది కదా!

"అధరీకృత సర్వస్నేహేన గురుణా అపత్య ప్రేమ్ణా"- అన్నింటిని లెక్కపెట్టని, గొప్పదైన పుత్ర ప్రేమతోనే తల్లి ఆనందంగా ఉంటుంది- అన్న బాణకవి మాట వాస్తవమే, అకించనులమైన మావంటి ఆశ్రితుల రక్షణకోసం 'నీవు ఎల్లప్పుడు ఇక్కడనే ఉన్నావు' అనే భావం మాకు కలుగునట్లు, శ్రీరంగాలయమందే నిత్య నివాస మేర్పరచుకొని ఉన్నావు. పరంధామంవలె శ్రీరంగధామమందు శ్రీరంగనాథునితో కూడి వేంచేసియున్న శ్రీరంగనాయకిని సేవించి, భక్తులు తరించే యోగ్యమైన దివ్యదేశం శ్రీరంగనగరమే.

క్షీర సముద్రం కంటెను, పరమపదం కంటెను అధికానందవహమైనది శ్రీరంగధామమే అని వర్ణించడం వ్యతిరేకాలంకార లక్షణం.

హరిణీవృత్తం- న స మ ర స ల గ- గణాలు కలది.

57. *ఔదార్యకారుణికతాఽ ఽ శ్రిత వత్సలత్వ*
*పూర్వేషు సర్వమతిశాయిత మత్ర మాతః।*
*శ్రీరంగధామ్ని యదుతాన్యదు దాహరంతి*
*సీతావతార ముఖమేత దముష్య యోగ్యా॥*

**అర్థం:** హే మాతః= ఓ తల్లీ!; ఔదార్య- పూర్వేషు/ ఔదార్య= దాతృత్వం; కారుణికతా= దయ; ఆశ్రిత వత్సలత్వ= ఆశ్రితుల పట్ల వాత్సల్యం; పూర్వేషు= మొదలైన గుణాలయందు; సర్వం= (పురుషకారానికి యోగ్యమైన గుణాలు) అన్నీ; శ్రీరంగధామని= శ్రీరంగ దివ్యాలయమందలి; అత్ర= శ్రీరంగనాయకివై ఉన్న అర్చామూర్తి యందు; అతిశాయితం= ఎక్కువగా పొందియున్న సన్నివేశమే; ఉత= అలాకాకపోతే; అన్యత్= అర్చావతతారం కంటే వేరైన; యత్= ఏ; సీతావతార ముఖం= సీతాదేవిగా అవతరించడం మొదలైనవి అతిశయించిన గుణాలు కలవిగా;

ఉదాహరంతి= పురాణజ్ఞులు చెబుతున్నారో; ఏతత్= ఈ విభవావతారమందు అతిశయించిన గుణాలున్నవని చెప్పడం; అముష్య= ఈ అర్చావతార లక్ష్యానికి; యోగ్యా= అభ్యాసమే.

**తా॥** ఓ లోకమాతా! శ్రీరంగనాయకీ! అన్నిటికంటె గొప్పవైన ఔదార్యం, దయ, ఆశ్రితవాత్సల్యం మొదలైన గుణాలు ఎన్ని చెప్పబడినవో అవి అన్నీ శ్రీరంగధామమందు ఉన్న నీ అర్చామూర్తియందే వ్యాపించి ఉన్నాయి. విభవావ తారమందు సీతాదేవిగా వెలసియున్నప్పుడు కూడా ఈ గుణాలు ఎక్కువగా ఉన్నట్లు ఇతిహాసజ్ఞులు వర్ణించారు. అయినా అవన్ని అర్చావతార లక్ష్యం కోసం నిరంతరం చేయబడిన అభ్యాసమే.

**వ్యాఖ్య:** అన్ని అవతారాలకంటే శ్రీరంగ దివ్యాలయ మందు వెలసియున్న లక్ష్మీదేవి యొక్క అర్చావతారమందు గుణాలన్నీ గొప్పగా వ్యాపించి ఉన్నవని సుశ్లోకితం.

ఔదార్యం- స్వార్థచింతన లేకుండా తన ద్రవ్యం మొదలైన వస్తువులను ఇతరులకు చెందునట్లు చేసే త్యాగం.

కారుణికతా- ఇతరుల దుఃఖాన్ని సహింపలేని జాలి. ఆశ్రిత వాత్సల్యం- తన చెంతుకు చేరిన వారి దోషాలను, లేదూడ ముఱికిని గోమాత నాల్కతో నాకి శుద్ధిచేసినట్లు, భోగ్యంగా భావించి క్షమించడం.

శ్రీరంగధామమందు లక్ష్మీదేవి అర్చావతార సన్నివేశంగా ఉన్న శ్రీరంగనాయకి యందు దాతృత్వం, దయ, ఆశ్రిత వాత్సల్యం మొదలైన గుణాలన్ని అతిశయించి యున్నవి. విభవావతారంలోనూ సీతామహాలక్ష్మ్యాది రూపంలో ఉన్నప్పుడు- అర్చావతారం కంటే ముందే- ఈ గుణాలన్నీ ఉన్నవని పౌరాణికులు చెబుతున్నారు కదా!

ఈ గ్రంథంలోనే "మాతర్మైథిలి!"- (50) అనే శ్లోకమందు సీతమ్మ యొక్క గుణోత్కర్షం చెప్పబడి యుండగా, ఈ శ్లోకమందు కేవలం అర్చావతారమందే

సర్వగుణ పరిపూర్ణత్వం కలదని వర్ణించడం ఎలా కుదురుతుంది? అంటే, అన్ని విధాలా కుదురుతుందనే చెప్పవలెను.

*"ఎన్నిన్ఱ యోనియుమాయ్ప్పిఱందాయ్ ఇమైయోర్ తలైవా"*– దేవదేవా! నీవు ఎన్నెన్ని జాతులలో పుట్టినావో కదా! అన్నట్లు, *"అజాయమానో బహుధా విజాయతే"*– నారాయణుడు కర్మ మూలంగా పుట్టినవాడు కాదు. కేవలం తన కృపవల్లనే అనేకావతారాలను ధరించాడు. అలాగా, లక్ష్మీదేవి కూడా నారాయణునికి అనురూపంగా పలు అవతారాలను ఎత్తింది.

*"అర్చావతార విషయేమయా ప్యుద్దేశత స్తవ।*
*ఉక్తా గుణాన శక్యంతే వక్తుం వర్షశతైరపి॥"*

అవతారాలెన్ని ఉన్ననూ, అర్చావతారంలోని గుణాలను వర్ణించడానికి వందల సంవత్సరాల కాలం కూడా సరిపోదు– అన్న విధంగానే శ్రీరంగనాయకిగా ఈ అర్చావతారంలోనే సర్వగుణాల అతిశయాన్ని పొంది యున్నది.

అముష్యయోగ్యా– విభవావతారాలలో లక్ష్మీదేవి సీతమ్మగా అవతరించి నప్పుడు శ్రీరంగనాయకి అనే ఈ అర్చావతార సన్నివేశం కోసం అభ్యాసం చేయబడినది. గుణాలు విభవావతారాలలోనూ ఎడతెఱపిలేకుండా సాధన చేయబడినవి.

నాట్యాన్ని ప్రదర్శించే నటులు, నటీమణులు, ప్రదర్శనకు ముందే పలుసార్లు ప్రాక్టిస్ చేయునట్లే, లక్ష్యసిద్ధికోసం విభవావతారాలలో గుణాభ్యాసం చేయబడినది. (సీతావతారం తక్కువదనుకోకూడదు.)

'యోగ్యమ్' అనడం కంటె 'యోగ్యా' అనడం శుద్ధమైన పాఠం.

*"సుబహుశ్రుతోఽ ప్యకృత యోగ్యః కర్మ స్వయోగ్యో భవతి"*– (సుశ్రుతుని వచనం.) బాగా చదువు నేర్చిన వాడైననూ, పనిచేసే నేర్పులేకుంటే పని చేయడానికి యోగ్యుడు కాడు– అని అర్థం.

"అస్త్ర యోగ్యాంతరేష్వపి"- అని శ్రీమద్రామాయణంలో 'యోగ్యా' శబ్దం ప్రయోగింపబడింది.

"యోగ్యం క్లీబేఽపూప యాన చందనాభ్యాస వాచకమ్।
ప్రవీణోపాయ వచ్ఛక్త యోగార్హేష్వప్యయంతిషు॥"

అని నానార్థ రత్నమాల 'యోగ్యం' అనే మాటకు అనుకూలంగా ఉన్ననూ-

"యోగ్యః ప్రవీణ యోగార్హోపాధి శక్తేషు వాచ్యవత్।
క్లీబమృద్ధ్యౌషధే పుష్యే నాస్త్ర్యభ్యాసార్క యోషితోః॥"

అనే మేదినీ కోశాన్ని, సుశ్రుతాది ప్రయోగ బాహుళ్యాన్ని అనుసరించి 'యోగ్యా' అనే స్త్రీలింగ పాఠమే ఆదరింపబడింది.

వసంత తిలకావృత్తం.

58. ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
కస్మై చిదంజలిభరం వహతే వితీర్య।
అస్మై నకించి దుచితం కృతమిత్యథాంబ!
త్వం లజ్జసే కథయ కోఽయ ముదార భావః॥

**అర్థం:** హే అంబ!= ఓ తల్లీ! లక్ష్మీదేవీ!; త్వం= నీవు; అంజలి భరం= చేతులను జోడించడం అనే భారాన్ని; వహతే= మోస్తున్న (దోసిలొగ్గి నమస్కరిస్తున్నట్టి); కస్మైచిత్= ఎవనికో; ఐశ్వర్యం= ఇహలోకంలోని సంపదను; అక్షరగతిం= కైవల్యాన్ని; లేదా, పరమం పదం, వా= వైకుంఠమందు భగవంతునికి కైంకర్యం చేసే భాగ్యాన్ని; ఇచ్చి; అథ= ఆ తర్వాత; అస్మై= ఇతనికి;ఉచితం= అంజలికి తగిన ఉపకారం; కించిత్= కొంచెం కూడా; న, కృతం= చేయబడలేదు; ఇతి= అని; లజ్జసే= సిగ్గుపడుతున్నావు; అయం= ఈ; ఉదారభావః= ఔదార్యం; కః= ఎటువంటిదో; కథయ= చెప్పుము.

**తా॥** ఓ జగన్మాతా! శ్రీరంగనాయకీ! చేతులు జోడించి నమస్కరించే ఏ తెలియని వ్యక్తికో ఇహపర సౌఖ్యాలను, విష్ణుపాదకమల సేవను కూడా పూర్తిగా

